# Sri Sitarama Jyotishyalayam

# జ్యోతిష్య భాగము – 2

రచించిన వారు : బ్రహ్మశ్రీ శిష్ట్లా నాగేశ్వర శర్మ (ప్రకాష్) గారు, జంషెడ్ పూర్

మొబైల్ నెం. : +919470566998 / +917903591993

తయారు చేసినవారు : ఎ.వి.కె. శ్రీనివాసరావు, భిలాయి (ఛ.ఘ)

# పంచ మహాపురుష యోగములు

ఈ అయిదు యోగములు **కుజ, బుధ, గురు, శుక్ర, శని,** గ్రహములవలన కలుగును. ఆ యోగములు:

1) రుచిక మహాపురుష యోగము,

2) భద్ర మహాపుష యోగము,

3) హంసమహా పురుష యోగము,

4) మాళవ మహాపురుష యొగము

5) శశ మహాపురుష యొగము.

పైన చెప్పిన అయుదు గ్రహములు, కేంద్రములందుండవలెను. అట్లు కాక ఆ రాశులు, ఆయా గ్రహములకు, స్వ, ఉచ్చ, క్షేత్రములై ఉండవలెను. జాతాక పారిజాతమున, మూల త్రికోణముల యందున్నను, సకల బలములు గలిగి ఉండవలెననిరి. అందరూ అంగీకరించనది ఈ సూత్రములే.

రుచిక మహాపురుష యోగ జాతకులు, ధైర్య సాహసములుచెసి, ధనము సంపాదించెదరు. బలవంతులు, శత్రువులను జయించు వారు అగుదుగురు, సేనానాయకులు కాగలరు. భద్ర మహాపురుష యోగ జాతకులు,సంపూర్ణ ఆయుష్షు విద్యాధికుడు పరులచే ప్రశంసించబడిన వాడు బుద్ధిమంతుడు అగును.

హంస మహాపురుష జాతకులు, మంచి గుణములు కలిగి, రాజ సమానులు, సుందరాకారము కలిగి, చెతులలొ, శంఖ చక్ర, పద్మ ముద్రలు, గలిగి ఉందురు. భొజన ప్రియులు, ధార్మికులు అగును. మాళవ్య మహాపురుష యోగజాతకులు దృఢమైన శరీరము వాహనములు, ధనము, భార్యా సంతానము, అదృష్ఠము మొదలగు శుభ లక్షణములు కలవాడగును.

శశ మహాపురుష యొగమున జన్మించిన వారు, సర్వజనములకు ప్రియుడు, గ్రామ పెద్ద, సెనాని, అగును కాని ఇట్టివారు, వ్యసనములు కలిగి, పరధన భోగి, అగును.

ఈ అయుదు యోగములు రాజప్రదములు, ఉన్నతొద్యోగములు కలుగును. ఇందులొ ఏ ఒకటి రెందు కలిసినను మహారాజ యోగము పట్టును. ఈ అయుదు యొగములు శాస్త్రమున ఉన్ననూ ఇవన్నియూ జరగవు., శాస్త్రమున సూచించిన ఇట్టి కొన్ని గ్రహముల ఉనికి కలిగినను, కొన్ని మినహాయింపులు ఉన్ననూ కొన్ని గ్రహముల కలయికవలన కొంతవరకూ ఈ యొగములు కలుగును. ఇట్టి జాతకులు కొంతమంది కలరు.

## దశాశేషం కనుగొను విధానము

జననము 25-01-1982 నాడు 15 గం.16 ని.(3-16 ఐ యస్ టి)

25 తేది ఉత్తరాషాఢ అంత్యం 07 గం.56 ని.

26 తేది శ్రవణం అంత్యం 09 గం. 36 ని.

25 వ తేది ఉత్తరాషాఢ 7 గం. 56 ని. వరకు వున్నది కావున తరువాత శ్రవణం వచ్చును.కావున శ్రవణం వచ్చు గంటలు నిముషముల నుండి జన్మకాలము వరకు నక్షత్ర భుక్తి అగును.జననకాలము నుండి శ్రవణ అంత్యకాలము వరకు నక్షత్ర శేషమగును.

25 వ తేది శ్రవణ నక్షత్రము ఆ దినం ఎన్ని గంటల ఎన్ని నిమిషాల వరకు వున్నది అని కనుగొనవలెనన్న అర్ధరాత్రి వరకు ఎన్ని గంటలు ఎన్ని నిమిషములు అయితే అన్ని గంటల అన్ని నిమిషములు శ్రవణ నక్షత్రము ఆ దినము వుండును.

25 వ అర్ధరాత్రి 12 గంటల వరకు శ్రవణ నక్షత్రం(రైల్వేటైం) 24 గం.00 ని.

ఉత్తరాషాఢ అంత్యం 07 గం.56 ని.(తీసివేయగా)

25 వ తేది శ్రవణ నక్షత్రం 16 గం.04 ని.(దీనికి 26 వ తేదీ శ్రవణం నక్షత్రం కలుపగా)

09 గం.36 + 16 గం.04 ని.= 25 గం.40 ని.ఇదే శ్రవణ నక్షత్ర ఆంద్యంతం.

నక్షత్ర శేషం తెలిస్తేగాని దశాశేషం కట్టలేము. నక్షత్ర ఆంద్యంతం లో నక్షత్ర భుక్తి(నక్షత్ర గడిచిన కాలం) తీసివేసిన నక్షత్ర శేషం వచ్చును. జననకాలమునందు ఉత్తరాషాఢ అంత్యం తీసి వేసిన శ్రవణ నక్షత్ర భుక్తి వచ్చును.

జననము. 15గం.16ని.

ఉ"షాఢ అంత్యం 07గం.56ని తీసివేయగా

శ్రవణ భుక్తి......07గం.20ని

శ్రవణ నక్షత్ర ఆంధ్యంతం....25గం. 40ని.(ఆంధ్యంత - భుక్తి =శేషం)

శ్రవణ భుక్తి 07గం.20ని తీసివేయగా

18గం.20ని ఇది నక్షత్ర శేషం

శ్రవణ నక్షత్రం పూర్తి ప్రమాణంనకు 10 సంవత్సరాలు చంద్ర మహా దశ అయితే,నక్షత్ర శేషం 18గం.20ని లకు ఎంత?

చంద్ర దశ= నక్షత్ర శేషం✖10/నక్షత్ర ఆంధ్యంతం

18-20✖10/25-40=?

(18-20 ఇన్టు 10 బై 25-40=?) అన్ని ఒకే మానములోకి మార్చుకోవాలి.

18✖60+20/(బై)25✖60+40=1100✖10(బై)/1540 అంటే వీటిని కాలమానము లోనికి మార్చ (చంద్రుని సంవత్సరములు 10 కావున 10 చే గుణించవలెను)

11000/1540=11000/1540=7సంవత్సములు

220✖12=(నెలలు కాబట్టి 12 గుణించవలెను)

2640/1540=1నెల

మిగిలిన 1100✖30=(దినములు కావున 30 చే గుణించవలెను)

33000/1540=21 దినములు.

అనగా చంద్ర మహాదశాశేషం : 7సం.ల 1నె.21 దినములు. పై విధముగా దశాశేషమును కనుగొనవలెను

___________*నవరత్నాలు*___________

*కెంపు ముత్యం పగడం పచ్చ పుష్యరాగం వజ్రం నీలం గోమేధికం వైఢుర్యాలు.*

***కెంపు :*** : మానసిక సమస్యలు, హృద్రోగం, కంటి వ్యాధులతో బాధపడేవారు, అధిక వ్యయం పేదరికంతో ఇక్కట్ల పాలవుతున్నవారు ఎరుపు రంగు కెంపు రత్నంతో ఉంగరం చేయించుకొని ఆదివారం రోజు ఉదయం పూట ధరించాలి.

***ముత్యం:*** : వివాహ వాంఛితులు, కళల్లో పురోగతి కోరేవారు, కుటుంబ సౌఖ్యాన్ని ఆశిస్తున్నవారు ముత్యం పొదిగిన ఉంగరాన్ని సోమవారంనాడు ధరించాలి.

***పగడం:*** : శతృపీడ నివారణ, రాజకీయాలు, వాణిజ్య రంగాల్లో పురోగతి, మధుమేహం వంటి దీర్ఘవ్యాధుల నుంచి ఉపశమనం కోసం పగడపు ఉంగరాన్ని ధరించాలి.

***పచ్చ:*** : స్థిర చిత్తం, విద్యలో అభివృద్ధి, వ్యాపార పురోభివృద్ధి, నరాల వ్యాధి నుంచి విముక్తికి బుధవారం రోజున పచ్చ రాయి ఉంగరాన్ని పెట్టుకోవాలి.
***పుష్యరాగం:*** : ఆధ్యాత్మిక వికాసం, సూక్ష్మ జ్ఞానం కోసం పుష్యరాగ ఉంగరం ధరించాలి. కామెర్ల వ్యాధితో బాధపడుతున్న వారికీ ఇది ఉపశమనాన్ని ఇస్తుంది.

***వజ్రం:*** : సంగీత కళలు, మంత్ర శాస్త్రంపై ఆసక్తి గలవారు వజ్రపుటుంగరాన్ని ధరిస్తే మేలు జరుగుతుంది. పాలనాపరమైన వ్యూహరచనలు చేసేవారు, ఇతరులను ఆకట్టుకొనేందుకు ప్రయత్నించేవారికీ వజ్రం ఉపకరిస్తుంది.

***నీలం:*** : దారిద్ర్య బాధతో సతమతమవుతున్న వారు నీల రత్నం గల ఉంగరాన్ని ధరించాలి. కీళ్లకు సంబంధించిన సమస్యలున్నవారు ఈ ఉంగరాన్ని పెట్టుకుంటే బాధ నుంచి ఉపశమనం కలుగుతుంది.

***గోమేధికం:*** : చిత్త చాంచల్యం నుంచి బయటపడేందుకు, వ్యాపారాల్లో లాభార్జనకు, శత్రువులను జయించేందుకు గోమేధికం పొదిగిన ఉంగరాన్ని ధరించాలి.

***వైఢుర్యం:*** : సంతాన లోపాన్ని అధిగమించేందుకు, విష జంతు బాధ నుంచి విముక్తి పొందేందుకు, కార్య సాఫల్యం కోసం వైఢూర్యం గల ఉంగరాన్ని పెట్టుకోవాలి.

## వివాహ విషయంలో ముఖ్య విషయాలు

**ముఖ్య విషయములు వివాహ విషయములో వధూ వరులు ఏక నక్షత్రము అయిన జరుగు శుభాఅశుభ ఫలములు :-**

వధువు వరుని యొక్క నక్షత్రములు కృతిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాడ, పుర్వాబాద్ర, [త్రిపాద నక్షత్రములు] ఒకటే అయిన - రోగము భయము

మృగశిర,చిత్త,ధనిష్ట [ద్విపాద నక్షత్రములు] అయిన - మరణ భయము

రోహిణి,ఆరుద్ర,పుష్యమి,మఘ,విశాఖ,శ్రవణం,ఉత్తరాబాద్ర,రేవతి [చతుర్ధ పాదములు] అయిన - వివాహమునకు మంచిది.

గ్రహముల వల్ల వచ్చు వ్యాదులు

**రవి -** గుండె,జఠరము,లాలాజలము,తాపము,తలనెప్పి,కడుపుమంట,నేత్రములు,రక్త పోటు, మొదలగు వ్యాదులు.

**చంద్రుడు -** స్తనములు,రుతుక్రమ సంబిదిత,మానసిక,పిచ్చి మొదలగు వ్యాదులు.

**కుజుడు -** కోపము,గుదము[మర్మస్థాన] కందరములు, ఎర్ర కణములు పోవుట[పొడగుట], పేలుడు[మందుగుండు] సంబదిత, శస్త్ర చికిశ్చ మొదలగు వ్యాదులు.

**భుదుడు -** శ్వాస,మెడ గొంతు,ఫిట్స్,వెన్నెముక,నోరు మొదలగు వ్యాదులు.

**గురుడు -** క్రొవ్వు,కాలేయము,మూత్రము,లివర్ సంబందిత వ్యాదులు.

**శుక్రుడు -** మర్మము,మధుమేహము,సుఖ వ్యాదులు,గడవ బిళ్ళలు మొదలగు వ్యాదులు.

**శని -** మూలవ్యాది,చాల రోజులు నిలిచే వ్యాదులు,పిసాచ బాధలు ,ఎముకలకు సంబందితవ్యాదులు.

**రాహువు -** క్షయ,అపరేషన్,కుష్టు,ప్రేగులు మొదలగు వ్యాదులు.

**కేతువు -** తెలియని జబ్బులు,నత్తి,నరముల పోటు మొదలగు జబ్బులు.

***వివాహమునకు ప్రశస్త నవాంశ***

**శ్లో!! *కార్ము కతౌలిక కన్యాయుగ్మలవే ఝషగేవా !***

***యర్శిభవే దుపయానుస్తర్శి సతేఖలుకన్యా !!***

ధనస్సు, తుల, కన్య, మిథున, మీన, నవాంశాలు ప్రశస్తములు. కన్య పతివ్రతయగును.

**వివరణ:** ఏలగ్నమైనను, ధనస్సు, తుల, కన్య, మిథున, నవాంశాలు ప్రశస్తములు మీన నవాంశాము కొందరి కసమ్మతము.

*కాలామృతకారుననుసరించి*: మేష నవాంశాయందు వివాహము జరిగిన కన్య వైధవ్యమును పొందును. వృషభ నవాంశమయున పశుసమృద్ధి, మిథున నవాంశయైన ధనవతియు, కర్కాటక నవాంశయైన వ్యభిచారిణియు, సింహ నవాంశాయైన విధవయు, కన్య నవాంశయైన ధనవతి గుణవతియు, తులా నవాంశాయైన సుపుత్రవతియు, వృశ్చికాంశ దరిద్రము, ధనుర్నవాంశా పూర్వభాగమైన ధనవతియు, పరభాగమైన వ్యభిచారిణి, మకర నవాంశయైన విధవ, కుంభ నవాంశయైన రోగవతి, మీన నవాంశయైన విధవ, దరిద్రత, సుపుత్రవతియునగును. లగ్నముకంటె శుభ నవాంలగ్నము బలవత్కామము.

*ముసల యోగం :-* గ్రహములన్నీ స్థిర చర రాశులందు ఉన్న మసల యోగం అంటారు.

*రజ్జు యోగం :-* గ్రహములన్నీ చర రాశులందు ఉన్న రజ్జు యోగం అంటారు.

*దళాఖ్య మాలా యోగం :-* మూడు కేంద్రముల చంద్రుడు కాక మిగిలిన శుభగ్రహములు ఉపస్థితమై ఉన్న దళాఖ్య మాలా యోగం అంటారు.

*దళాఖ్య సర్పయోగం :-* మూడు కేంద్రములందు చంద్రుడు కాక మిగిలిన పాపగ్రహములు ఉపస్థితమై ఉన్న దళాఖ్య సర్ప యోగం అంటారు.

*గోళ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఒక్క స్థానములోఉపస్థితమై ఉన్న గోళ యోగం అంటారు.

*యుగ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ రెండు స్థానములలో ఉపస్థితమై ఉన్న యుగ యోగం అంటారు.

*శూల యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ మూడు స్థానములలో ఉపస్థితమై ఉన్న శూలయోగం అంటారు.

*కేదార యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ నాలుగు స్థానాలలోఉపస్థితమై ఉన్న కేదార యోగం అంటారు.

*పాశ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ అయిదు ఉపస్థితమై ఉన్న పాశ యోగం అంటారు.

*దామినీ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఆరు స్థానముల ఉపస్థితమై ఉన్న దామినీ యోగం అంటారు.

*వీణా యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఏడు స్థానముల ఉపస్థితమై ఉన్న వీణా యోగం అంటారు.

*పంచ మహాపురుష యోగాలు*

లగ్నము నుండిగాని రాశి లేక చంద్రలగ్నము నుండిగాని కుజ, బుధ, గురు, శుక్ర, శనులు కేంద్రములందు ఉంది అవి ఆగ్రహములకు ఉచ్ఛ లేక స్వ స్థానములైన వరుసగా రుచక, భద్రక, హంసక, మాళవ శశ యోగము అంటారు. గ్రహములు షడ్వర్గాది బల సంపన్నులై ఉండ వలెను. ఒక యోగము కలిగిన అదృషతవంతుడు రెండు యోగములు ఉన్న రాజ సమానుడు మూడు యోగములు కలిగిన రాజు నాలుగు యోగములు కలిగిన చక్రవర్తి ఐదు యొగములు కలిగిన నృపేంద్రుడు అవుతాడు.

<u>**యోగములు**</u>

**యోగం:** సూర్య, చంద్రుల నిరయన గతిని కలిపితే అది యోగం అవుతుంది. దీనిసే నిత్యయోగ ఫలము అని కూడా అంటారు. జన్మించిన వ్యక్తి యొక్క యోగ ఫలితాన్ని తెలుపుతుంది.

**1. విష్కుంబ:** ఈ యోగం లో జన్మించిన ముందు చూపు గలవాడు, శత్రువులను జయించువాడు, గూని ఉన్నవాడు, కామ పారవశ్యము కలవాడు, పశుసంపద కలవాడు, స్వతంత్రము కలవాడు, మంత్ర నిపుణులు అగును.

**2. ప్రీతీ:** ఈ యోగంలో జన్మించిన కర్మశీలుడు, మంచి గుణము కలిగిన వాడు, పరస్త్రీ యందు ఇష్టం గలవాడు, అఖిల ప్రియుడు, దేవపూజితుడు, శ్రీమంతుడు, సుబంధువులు కలవాడు అయి ఉండును.

**3. ఆయుష్మాన్:** ఈ యోగం లో జన్మించిన దీర్ఘాయుష్షు, విశాలమైన కళ్ళు కలవాడు,ధన్యుడు, పశువులను, మిత్రులు, పుత్రులు గలవాడు, రాజు,మంత్రి, కీర్తి, పాండిత్యము, సుఖం కలవాడు అయి ఉండును.

**4. సౌభాగ్య:** ఈ యోగంలో జన్మించిన పాణి, పాదములునందు మత్స్య, శంఖ, హల గుర్తులు గలవాడు, కోమలుడు, కోరికలు కలవాడు, అన్యదేశము కలవాడు, భోజనం సౌఖ్యం కలవాడు అయి ఉండును .

**5. శోభన:** ఈ యోగం లో జన్మించిన సంపద, సుఖం, మృష్టాన్నభోజనం సౌఖ్యం కలవాడు, కామియు, అల్పకార్య తత్పరుడు, ఉత్సాహం గలవాడు, దేవకార్యములు మీద ఇష్టం కలవాడు, మిక్కిలి బంధువులు కలవాడు అయి ఉండును.

**6. అతిగండ:** ఈ యోగంలో జన్మించిన కోపం కలవాడు, శరీరము, ముఖము పొడుగు కలవాడు, పరేంగిత జ్ఞానం కలవాడు, కలహప్రియుడు, హింసాశీలుడు అయి ఉండును.

**7. సుకర్మ:** ఈ యోగంలో జన్మించిన మంచి బుద్ధి కలవాడు, గుణవంతుడు, సుఖము, పుత్రులు, బంధువులు, మంచి భార్య కలవాడు, మంచి కర్మలు యందు ఆశక్తి , స్త్రీ సుఖములను అనుభవించు వాడు, ధర్మము తెలిసిన వాడు అయి ఉండును.

**8. ధృతి:** ఈ యోగంలో జన్మించిన మాట కారి, శ్రీమంతుడు, ధైర్యం కలవాడు, ధర్మము పాటించువాడు, ఇతరులు యొక్క ధనం మీద ఆశ కలవాడు, మొండివాడు అయి ఉండును.

**9. శూల:** ఈ యోగం లో జన్మించిన అధికకోపం, పరాక్రమం, కలహాప్రియం, మంచి శరీరము, కామి, ధనం, అభిమానం గలవాడు, ప్రభువు అయి ఉండును.

**10. గండ:** ఈ యోగంలో జన్మించిన పొడుగాటి శరీరము, వ్యసన ప్రియుడు, చెడ్డవాళ్ళను ప్రేమించు వాడు, జూదములు ఆడువాడు, కులనాశనం చేయువాడు అయి ఉండును.

**11. వృద్ధి:** ఈ యోగంలో జన్మించిన సంపద,సమృద్ధి, పాండిత్యము, పరివారజనులు, చాల పుత్రులు మరియు భార్యలు కలవాడు, మంచి బుద్ధి కలవాడు అయి ఉండును.

**12. దృవ:** ఈ యోగంలో జన్మించిన శరీరము కలవాడు, ఎక్కువ ఉల్లాసంగా ఉండువాడు, మాట పైన నిలపాడు వాడు, ప్రకృతిని అనుభవించు వాడు, క్షమకలిగిన వాడు, స్థిరమైన సంపాదన ఉన్నవాడు,అనేక మంచి గుణములు కలిగిన వాడు అయి ఉండును.

**13. వ్యాఘాత:** ఈ యోగంలో జన్మించిన వెంటనే కోపించే స్వభావము, ఉపకార ఆలోచన కలవాడు, భోజన ప్రియుడు, ఒక కన్ను గాని లేక మెల్ల కన్నుతో చుడువాడు, చపలుడు, అందరిచే మావింపబడువాడు అయి ఉండును.

**14. హర్షణ:** ఈ యోగం లో జన్మించిన ముందుగా అపాయమును తెలుసుకొను వాడు, కులములో ముఖ్యుడు, సత్యం పలుకువాడు, ఇంద్రియ నిగ్రహం కలవాడు, ఇతరుల అభిప్రాయాని తెలిసినవారు, స్త్రీలను గౌరవించు వాడు అయి ఉండును. విద్యయందు, వాద్యమందు, ప్రియము కలవాడు, ధనం, సుఖం అనుభవించువాడు, పరస్త్రీ ఆసక్తి శరీర మందు వెంట్రుకులు అధికం ఉండును.

**15. వజ్ర:** ఈ యోగం నందు జన్మించిన ఉపకార స్మరణ గలవాడు, అనేక కష్టములను అనుభవించువాడు, సుందరుడు, ప్రతీవారిలోనూ తప్పులు ఎంచువాడు, అనవసరముగా మాట్లాడువాడు, పైత్య శరీరం గలవాడు, ఎవరి వల్లను కూడా విజయం సాధించ లేనివాడు అయి ఉండును.

**16. సిద్ధ:** ఈ యోగం నందు జన్మించిన సంకల్ప సిద్ధుడు, పరిశుద్ధ సరీరుడు, చల్లటి ప్రదేశమును ఉండుట ఇష్టు పడువాడు, సిరి, బుద్ధి, కామశీలం గలవాడు, సంతానం కలవాడు అయి ఉండును.

**17. వ్యతీపాత:** ఈ యోగంలో జన్మించిన అనేక కష్టములు గలవాడు, అన్నింటా విజయము సాదించువాడు, పిరికివాడు, తెలివి లేనివాడు, ప్రభువు, దొంగతనము చేయువాడు, శత్రువులను జయించువాడు, తెజస్వీగా ఉండువాడు అయి ఉండును.

**18. వరియాన్:** ఈ యోగం లో జన్మించిన పరాక్రమి, దైర్యశాలి, సదాచారం పాటించువాడు, ధనవంతుడు, అభిమానం గలవాడు, బంధువులకు ఉపకారం చేయువాడు, మంచి భార్య గలవాడు అయి ఉండును.

**19.పరిఘు:** ఈ యోగంలో జన్మించిన వారు స్వతంత్రుడు, ఇతరులను ద్వేషించువాడు, ఆయుధ అభ్యాస మందు ఇష్టము, అపనిందలు పొందువాడు, శరీరం బలం లేనివాడు, కార్యములకు అడ్డుపడువాడు అయి ఉండును.

**20. శివ:** ఈ యోగంలో జన్మించిన శాంతిశీలుడు, ధర్మము పాటించు వారు యందు ఇష్టుడు, దేవా పూజ చేయువాడు, ధర్మము, ధనం గలవాడు, ఇంద్రియములను మరియు శత్రువులను జయించువాడు అయి ఉండును.

**21.సిద్ధి:** ఈ యోగంలో జన్మించిన ప్రసిద్ధుడు, పరిశుద్ధుడు, సదాచారం గలవాడు, యశస్సు లభించాలని వాడు, వాత పైత్యం గలవాడు, ధనమును అనుభవించు వాడు, పాండిత్యము గలవాడు అయి ఉండును.

**23. శుభ:** ఈ యోగంలో జన్మించిన శుద్ధ ఆత్మయు, మంచి భార్య, రాజానుకూల్యము, రత్నములు, సంపద, వస్త్రములు గలవాడు, సుఖభోగములు, విద్య గలవాడు, పూజ్యుడు అయి ఉండును.

**24. శుక్ల:** ఈ యోగం లో జన్మించిన వాడు అభిమానం, విద్య, ధనం గలవాడు, మొండితనం గలవాడు, చపలుడు, ఇతరాలను ఉపద్రవించే దుస్వభావం గలవాడు, వాతం ప్రకృతి ఉన్న వాడు, ప్రభువు అయి ఉండును.

**25. బ్రహ్మ:** ఈ యోగంలో జన్మించిన పండితుడు, అభిమానం గలవాడు, చేయు పనులను రహస్యంగా ఉంచువాడు, వివేకం గలవాడు, త్యాగం, భోగం, ధనం గలవాడు అయి ఉండును.

**26. ఇంద్ర:** ఈ యోగం లో జన్మించిన ఇతరులకు ఉపకారం చేయు వాడు, రాబోయే కార్యములను తెలుసుకోనువాడు, వాత ప్రకృతి గలవాడు, బుద్ధిమంతుడు, వెంటనే కోపం కలుగువాడు, శ్రీమంతుడు, వీర్యమంతుడు అయి ఉండును.

**27. వైధృతి:** ఈ యోగం లో జన్మించిన జలక్రీడ, ఉద్యాన క్రీడలు యందు ఇష్టము, సౌందర్యం గలవాడు, బంగారం నందు ఎక్కువ మక్కువ గలవాడు, సత్యవంతుడు, ధనవంతుడు, వికటదృష్టి అయి ఉండును. ఈ యోగంలో స్త్రీలు జన్మించిన వైదవ్యం వచును.

## సర్ప దోషము లేదా సర్ప శాపము

(1) రాహువు 5వ యింట వుండి కుజుని చేత చూడబడినను,

(2) మేష,వృశ్చికములలో (కుజ క్షత్రమున) రాహువు ఉండినను.

(3) పంచమాధిపతి రాహువు తో కూడినను,శని పంచమమునందు ఉన్నను, శని చంద్రునితో కూడినను,చూడబడినను

(4) పుత్ర కారకు డైన గురుడు రాహువు తో కలిసి వున్నను

(5) పంచమాధి పతి బలహీనుడైనను, లగ్నాధిపతి కుజునితో కలిసి వున్నను

(6) గురుడు కుజునితో కలసియున్నను, లగ్నము లో రాహువున్నను

(7) పంచమాధిపతి దుస్థానమున,నీచ,శత్రు క్షేత్రమునున్నను

(8) కుజాంశలో కుజుడున్నను

(9) పంచమాధిపతి బుధుడైనను,పంచమాధిపతి తో రాహువు కలిసి వున్నను,బుధుడు చూసినను

(10) లగ్నమున రాహువు,మాంది యున్నను

(11) 5 వ స్థానము లో రవి,శని,కుజుడు,రాహువు,గురు,బుధ లుండి పంచమ లగ్నాధిపతులు బలహీనులైనను

(12) లగ్నాధిపతి రాహువు తో కూడినను,పంచమాధిపతి కుజుడైనను,కారకుడు రాహువు తో కూడినను....సర్ప దోషము గా తెలియవలెను.

ఈ దోష నివారణకై నాగ పూజ లేదా నాగ ప్రతిష్ఠ చేయవలెను.యధావిధిగా గో,భూ,తిల,హిరణ్య ములు దానమీయవలెను.దీని వలన దోషము పోయి పుత్ర సంతతి కలిగి కులాభివృద్ధి,సంపత్సమృద్ధి కలుగ గలదు.

# *వివాహమునకు ప్రశస్త నవాంశ*

శ్లో!! *కార్ము కతౌలిక కన్యాయుగ్మలవే ఝషగేవా !*

*యర్థిభవే దుపయానుస్త్వర్థి సతేఖలుకన్యా !!*

ధనస్సు, తుల, కన్య, మిథున, మీన, నవాంశాలు ప్రశస్తములు. కన్య పతివ్రతయగును.

వివరణ ÷ ఏలగ్నమైనను, ధనస్సు, తుల, కన్య, మిథున, నవాంశాలు ప్రశస్తములు మీన నవాంశాము కొందరి కసమ్మతము.

*కాలామృతకారుననుసరించి* ÷ మేష నవాంశాయందు వివాహము జరిగిన కన్య వైధవ్యమును పొందును. వృషభ నవాంశమయున పశుసమృద్ధి, మిథున నవాంశయైన ధనవతియు, కర్కాటక నవాంశయైన వ్యభిచారిణియు, సింహ నవాంశాయైన విధవయు, కన్య నవాంశయైన ధనవతి గుణవతియు, తులా నవాంశాయైన సుపుత్రవతియు, వృశ్చికాంశ దరిద్రము, ధనుర్న వాంశా పూర్వభాగమైన ధనవతియు, పరభాగమైన వ్యభిచారిణి, మకర నవాంశయైన విధవ, కుంభ నవాంశయైన రోగవతి, మీన నవాంశయైన విధవ, దరిద్రత, సుపుత్రవతియునగును. లగ్న ముకంటె శుభ నవాంలగ్న ము బలవత్కమము.

ముసల యోగం :-* గ్రహములన్నీ స్థిర చర రాశులందు ఉన్న మసల యోగం అంటారు.

*రజ్జు యోగం :-* గ్రహములన్నీ చర రాశులందు ఉన్న రజ్జు యోగం అంటారు.

*దళాఖ్య మాలా యోగం :-* మూడు కేంద్రముల చంద్రుడు కాక మిగిలిన శుభగ్రహములు ఉపస్థితమై ఉన్న దళాఖ్య మాలా యోగం అంటారు.

*దళాఖ్య సర్పయోగం :-* మూడు కేంద్రములందు చంద్రుడు కాక మిగిలిన పాపగ్రహములు ఉపస్థితమై ఉన్న దళాఖ్య సర్ప యోగం అంటారు.

*గోళ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఒక్క స్థానములోఉపస్థితమై ఉన్న గోళ యోగం అంటారు.

*యుగ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ రెండు స్థానములలో ఉపస్థితమై ఉన్న యుగ యోగం అంటారు.

*శూల యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ మూడు స్థానములలో ఉపస్థితమై ఉన్న శూలయోగం అంటారు.

*కేదార యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ నాలుగు స్థానాలలోఉపస్థితమై ఉన్న కేదార యోగం అంటారు.

*పాశ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ అయిదు ఉపస్థితమై ఉన్న పాశ యోగం అంటారు.

*దామినీ యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఆరు స్థానముల ఉపస్థితమై ఉన్న దామినీ యోగం అంటారు.

*వీణా యోగం :-* ద్వాదశ స్థానాలలో ఏస్థానందు అయినా గోళములన్నీ ఏడు స్థానముల ఉపస్థితమై ఉన్న వీణా యోగం అంటారు.

*పంచ మహాపురుష యోగాలు*
లగ్నము నుండిగాని రాశి లేక చంద్రలగ్నము నుండిగాని కుజ, బుధ, గురు, శుక్ర, శనులు కేంద్రములందు ఉంది అవి ఆగ్రహములకు ఉచ్ఛ లేక స్వ స్థానములైన వరుసగా రుచక, భద్రక, హంసక, మాళవ శశ యోగము అంటారు. గ్రహములు షడ్వర్గాది బల సంపన్నులై ఉండ వలెను. ఒక యోగము కలిగిన అదృషతవంతుడు రెండు యోగములు ఉన్న రాజ సమానుడు మూడు యోగములు కలిగిన రాజు నాలుగు యోగములు కలిగిన చక్రవర్తి ఐదు యొగములు కలిగిన నృపేంద్రుడు అవుతాడు.

## ప్రమాణ స్వీకార సమయంలో రాజకీయ నాయకుల భవిష్యత్ తెలియజేసే సింహాసన చక్రం..

ప్రమాణస్వీకారం ఉత్తరాయణంలో చేస్తే మంచిది.సింహాసన చక్రాన్ని పంచ నాడీ చక్రం అని కూడా అంటారు.సింహాసనమనగా పరిపాలించు వ్యక్తి కూర్చునే ఆసనం.ప్రమాణస్వీకార సమయంలోని గ్రహస్థితిని బట్టి సింహాసనచక్రం నిర్మించి పరిశీలిస్తే దేశంలో లేక రాష్ట్రంలో యుద్ధభయం,ఆకస్మిక సంఘటనలు,ప్రభుత్వంలోని ప్రముఖుని లేక నాయకుని మరణం,కరువు కాటకాలు ఏర్పడటం,వాతావరణ పరిస్థితి,ప్రభుత్వ పతనం మొదలైనవి ముందుగానే తెలుసుకునే అవకాశం ఉంటుంది.

(1)ఆధార నాడి (2)ఆసననాడి (3)పట్టనాడి (4)సింహనాడి (5)సింహాసన నాడి. అని పంచనాడులుంటాయి.
రాజ దర్బారులో రాజు సింహాసనమనే అత్యున్నతమైన ఆసనంపై కూర్చుంటాడు.ఇది సింహాసన నాడి.
తరువాత క్రింది స్థాయి ఆసనంలో సర్వాధికారి అయిన మంత్రి కూర్చుంటాడు.ఇది సింహనాడి.
తరువాత క్రింద స్థాయి ఆసనంలో రాణి లేక యువరాజు లేక ఇతర మంత్రులు కూర్చుంటారు.ఇది పట్టనాడి.
తదుపరి క్రింద స్థాయిలో పరిపాలన వ్యవస్థలోని ఇతర తక్కువ స్థాయి మంత్రులు,అధికారులు కూర్చుంటారు.ఇది ఆసన నాడి.
అన్నిటికంటే చివరగా సాధారణ ప్రజలుంటారు.ఇది ఆధార నాడి.ఒక దేశానికి ప్రజలే ఆధారం కదా.
సింహాసన చక్రంలో 3 సింహాసనాలుంటాయి.ఒక్కొక్క సింహాసనానికి 9 నక్షత్రాల వంతున మొత్తం 27 నక్షత్రాలు 3 సింహాసనాలలో పంచబడ్డాయి.
మొదటి సింహాసనంలో అశ్విని నుండి ఆశ్లేష వరకు నక్షత్రాలు ఉంటాయి. దీనిని "అశ్వపతి సింహాసనము" అంటారు.

రెండవ సింహాసనంలో మఖ నుండి జ్యేష్ట వరకు నక్షత్రాలు ఉంటాయి.దీనిని "నరపతి సింహాసనము"అంటారు.
మూడవ సింహాసనంలో మూల నుండి రేవతి వరకు నక్షత్రాలు ఉంటాయి.దీనిని "గజపతి సింహాసనము"అంటారు.
ఆధునిక ప్రజాస్వామ్య పద్ధతిలో పూర్తి పాలనాధికారం ప్రధానమంత్రికి కలదు.కావున సింహాసన నాడి ప్రధానమంత్రి (దేశానికి) లేక ముఖ్యమంత్రిని (రాష్ట్రానికి) సూచించును.
ఉప ప్రధాని లేక ఉప ముఖ్యమంత్రి లేదా ముఖ్యమంత్రి తరువాత అంతటి అధికారం ఉన్న పరిపాలనా ప్రముఖులు సింహనాడిచే సూచింపబడతారు.
క్యాబినెట్ మంత్రి వర్గాన్ని,ప్రధాని లేక ముఖ్యమంత్రి యొక్క బార్యా కుమారులను పట్టనాడి సూచించును.
ఎం.పి ,ఎం.ఎల్.ఏ లను ఇతర ప్రభుత్వ అధికారులను ఆసననాడి సూచించును.
సాధారణ ప్రజలను ఆధారనాడి సూచించును.
ప్రమాణస్వీకార సమయానికి గ్రహస్థితులను పరిశీలించి సింహాసన చక్రంలో ఏయే నక్షత్రాలలో ఏయే గ్రహాలు కలవో గుర్తించాలి.దీనివల్ల ఏయే నాడుల్లో ఏయే గ్రహాలు ఉన్నాయో తెలుసుకోవచ్చును.ఈ సింహాసన చక్రంలో చంద్ర శనులకు ప్రత్యేకత ఉంది.

ప్రమాణస్వీకార సమయానికి గల చంద్రస్థితి ఆ ప్రభుత్వ సుస్థిరత్వాన్ని సూచిస్తుంది. ప్రజాస్వామ్యం, రాజకీయాలు, ప్రజాశక్తి, ప్రజల వల్ల అనుకూలత శని వల్ల సూచించబడతాయి.
సింహాసన చక్రంలో చంద్ర, శనులు వివిధ నాడులలో ఉన్న వేరు వేరు ఫలితాలు పూర్వ గ్రంధాలలోని ఫలితాలను ప్రస్తుత పరిస్థితులకు అన్వయించుకోవాలి.

**ఆధారనాడి:-**ఆధారనాడిలో చంద్రుడున్న రాజు వేరొకరి ప్రభావంలో పరిపాలన చేస్తాడు.అంటే పరిపాలన చేసే పార్టీకి పూర్తి మెజారిటీ లేక ఇతర పార్టీలతో కలసి ప్రభుత్వాన్ని ఏర్పరుస్తాడు.లేక పరిపాలన చేసే వ్యక్తి అసమర్ధుడై వేరొకరి సూచనల మేరకు పరిపాలన చేస్తాడు.

ఆధారనాడిలో శని ఉంటే దేశంలో అతివృష్టి,తుఫానులు,కరువుకాటకాలు,ప్రజలకు దుర్భిక్షం ఏర్పడుతాయి.అతి వర్షం లేక అత్యల్ప వర్షం,అననుకూల వాతావరణం,ఊహించని ప్రకృతి వైపరీత్యాల వలన ప్రజలు కష్టపడతారు.

**ఆసననాడి:-** ఆసననాడిలో చంద్రుడున్న రాజు నీతివంతుడై చట్టబద్ధమైన,న్యాయబద్ధమైన పద్ధతులను అమలు పరుస్తూ సమర్ధవంతంగా పరిపాలించును.ప్రభుత్వ ఉద్యోగుల సహాయ సహకారాలతో దేశంలో శాంతిభద్రతలు స్థాపించును. ప్రధానమంత్రి లేక ముఖ్యమంత్రి లేక ఇతర మంత్రి వర్గ సభ్యుల మరియు ప్రభుత్వ అధికారుల సలహా సంప్రదింపులతో సంప్రదాయబద్దంగా తన పూర్వీకులు ఏవిధంగా పరిపాలించారో ఆ విధంగా పరిపాలిస్తాడు. పరిపాలించే వ్యక్తికి ప్రజాస్వామ్య ఆలోచనలు ఉంటాయి.

ఆసననాడిలో శని ఉంటే యుద్ధభయం,యుద్ధంలో పరాజయం,రోగభాధలు,జనాలకు కష్ట నష్టాలు,భాధలు కలుగుతాయి.యుద్ధ వాతావరణం ఏర్పడటం,నవ్వుల పాలయ్యే పరిస్థితి ఏర్పడటం,అంటురోగాలుప్రబలటం,ఇతర కారణాల వల్ల ప్రజలు ఇబ్బంది పడటం జరుగుతుంది.

**పట్టనాడి:-**చంద్రుడు పట్టనాడిలో ఉంటే తన ముందు వ్యక్తి పరిపాలించినట్లుగా పరిపాలిస్తాడు.తనకంటే ముందు వ్యక్తి ఆచరించిన పద్ధతులను అమలు పరుస్తాడు.

పట్టనాడిలో శని ఉంటే పరిపాలన చేసే వ్యక్తి యొక్క బార్య లేక కుమారుడు లేక క్యాబినెట్లోని మంత్రివర్యుని మరణం జరుగుతుంది.పరిపాలనా వ్యక్తికి చాలా కష్టకాలంగా ఉంటుంది.

**సింహనాడి**:-చంద్రుడు సింహనాడిలో ఉన్న రాజు సింహం లాగా ధైర్యం కలిగి యుద్ధాశక్తుడౌతాడు.తన ఆలోచనా విధానాలతో పని చేస్తాడు.ప్రధాని లేక ముఖ్యమంత్రి ఎక్కువ అధికారాలు కలిగి ఉండి యుద్ధాసక్తుడు మరియు కలహాసక్తుడు అవుతాడు.తన మంత్రి వర్గ మరియు ఇతర అధికారుల సలహాలు తీసుకోకుండా పనిచేస్తాడు.

సింహనాడిలో శని ఉంటే రాజు యొక్క మరణం సూచిస్తుంది.ప్రధానమంత్రికి గాని,ముఖ్యమంత్రికి గాని తీవ్ర అనారోగ్యం ప్రాణగండం లేక పదవీ గండం ఏర్పడుతుంది.

**సింహాసననాడి:-** సింహాసననాడిలో చంద్రుడున్న రాజు హుందాగా ఉన్నా,చంచలత్వం,శీఘ్రంగా కోపం తెచ్చుకునే వాడు అయివుంటాడు.క్రూరుడై ప్రజలను బాధిస్తాడు.ప్రధాని లేక ముఖ్యమంత్రి అవసరానికి మించిన అధికారాలు కలిగి క్రూరమైన నిర్ణయాలతో ప్రజలనుబాధ పెడతాడు.తనపై తనకు నియంత్రణ లేక ఇంద్రియ లోలుడౌవుతాడు.తన తెలివితక్కువ నిర్ణయాల వల్ల ప్రజల్లో గౌరవం,పేరు కోల్పోతాడు.చంద్రుడు ఆధారనాడిలో ఉన్న రాజుకి శక్తి,అధికారం లేకపోవటం జరుగుతుంది.చంద్రుడు ఆధారనాడి నుండి సింహాసననాడికి మారుతున్నప్పుడు క్రమంగా వ్యక్తి యొక్క అధికారం పెరగటం గమనించవచ్చు.సింహాసననాడిలో వ్యక్తి అధిక శక్తి కలిగి ప్రజలను బాధిస్తాడు.కాబట్టి ఈ రెండు చంద్ర స్థితులు మంచివి కావు.చంద్రుడు పట్టనాడిలో ఉన్న వ్యక్తికి సమతుల్యమైన అధికారాలు ఉంటాయని సూచించబడుతుంది.

సింహాసననాడిలో శని ఉంటే సింహనాడి మాదిరి రాజు యొక్క మరణాన్ని సూచిస్తాడు.ప్రధానమంత్రికి గాని,ముఖ్యమంత్రికి గాని తీవ్ర అనారోగ్యం,ప్రాణగండం,లేక పదవీగండం ఏర్పడుతుంది.ఆసననాడిలో చంద్రుడు,శని లేక రాహువు లేక రవి లేక కుజ యుతుడైన రాజును లేక ప్రధాన,ముఖ్య మంత్రుల పాలనను నాశనం చేస్తాడు.ఆసనానాడిలో శని వక్రించి ఉంటే మరియు ఇతర పాప గ్రహాలతో యుటి చెంది ఉంటే రాజును లేదా ప్ధాన,ముఖ్య మంత్రలు పాలనను నాశనం చేస్తారు.శని ఏ నాడిలోనూ శుభ పలితాలనివ్వలేడు.అందువల్ల ముహూర్తచక్రంలో గురుగ్రహ ఆశీర్వాదం కావాలి.గురువు ఆసననాడిలో ఉంటే శుభపలితాల నిస్తాడు.అంతేకాక బలవంతుడైన గురుని దృష్టి నైసర్గిక పాపగ్రహాలపై ఉంటే పాప ఫలితాలు ఉపశమిస్తాయి.

**సింహాసన చక్రాన్ని పరిశీలించే విధానం:-**

1) ప్రమాణస్వీకార సమయానికి సింహాసన చక్రాన్ని నిర్మించాలి.

2) గ్రహాలను సింహాసన చక్రంలో వాటి వాటి నాడుల్లో గుర్తించాలి.

3) సింహాసన చక్రంలో చంద్రుడున్న నక్షత్రాన్ని మరియు నాడిని గుర్తించాలి.

4) సింహాసన చక్రంలో శని ఉన్న నక్షత్రాన్ని మరియు నాడిని గుర్తించాలి. శని సింహ లేక సింహాసన నాడిలో ఉన్న ప్రభుత్వానికి లేక ప్రధాన, ముఖ్యమంత్రులకు అరిష్టం. అంటే శనేశ్వరుడు చంద్ర, రాహు, కుజ నక్షత్రాలలో ఉండరాదు.

5) ఆసననాడిలో బలహీనమైన లేక ఇతర పాపగ్రహాలచే ప్రభావితమైన చంద్రుడు లేక శని ఉన్న అశుభ ఫలితాలను ఇస్తుంది.

6) ఆసననాడిలో గురుగ్రహం ఉన్న అశుభ ఫలితాల నుండి లేక అరిష్టాల నుండి రక్షణ లభిస్తుంది.

7) ప్రమాణ స్వీకార ముహూర్త సమయానికి నైసర్గిక పాప గ్రహాలైన శని,కుజ,రవి,రాహు,కేతువులు సింహనాడి, లేక సింహాసననాడిలో ఉన్న అశుభ పలితాలనిస్తుంది.

8) ప్రమాణ స్వీకార ముహూర్త సమయానికి కుజ లేక కేతువులు సింహ లేక సింహాసననాడులలో ఉంటే పరిపాలకుడి మరణం లేక భయానక మరణం కలగవచ్చు.

9)ప్రమాణ స్వీకార ముహూర్త సమయానికి శనేశ్వరుడు లేక ఇతర పాపగ్రహాలు పట్టనాడిలో ఉన్న పరిపాలకుడి భార్యకు లేక కుమారునికి లేక ఇతర మంత్రులకు అరిష్టం కలుగుతుంది.మంత్రులపై పుకార్లు,అభాండాలు ఏర్పడతాయి.

10)ఆసననాడిలో పాపగ్రహాలు ఉన్న యుద్ధ భయాన్ని కలుగజేస్తాయి.

11)ఆధారనాడిలో పాపగ్రహాలు ఉన్న ప్రకృతి వైపరీత్యాలు కలుగుతాయి.

ఈ విధంగా ప్రమాణ స్వీకార ముహూర్తానికి సింహాసన చక్రం వేసి పరిశీలించాలి.

## 108 నవాంశలు వాటి ఫలితాలు.

27 నక్షత్రాలలోను ప్రతి నక్షత్రానికి నాలుగు పాదాలు ఉంటాయి. మొత్తం నూట ఎనిమిది పాదాలే గాక వాటికి విడివిడిగా రాశ్యంశలు కూడా ఉంటాయి.

అశ్వని, రోహిణి, పునర్వసు, మఖ, హస్త, విశాఖ, మూల, శ్రవణం, పూర్వాభాద్ర అనబడే తొమ్మిది నక్షత్రాల ప్రధమ పాదాలు మేషాంశకు, ద్వితీయ పాదాలు వృషభాంశకు, తృతీయ పాదాలు మిధునాంశకు, చతుర్ధ పాదాలు కర్కాటాంశకు చెంది ఉంటాయి.

భరణి, మృగశిర, పుష్యమి, పుబ్బ, చిత్ర, అనూరాధ, పూర్వాషాడ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర అనబడే తొమ్మిది నక్షత్రాల ప్రధమ పాదాలు సింహాంశకు, ద్వితీయ పాదాలు కన్యాంశకు, తృతీయ పాదాలు తులాంశకు, చతుర్ధ పాదాలు వృశ్చికాంశకు చెంది ఉంటాయి.

కృత్తిక, ఆరుద్ర, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, జ్యేష్ఠ, ఉత్తరాషాడ, శతభిషం, రేవతి అనబడే తొమ్మిది నక్షత్రాల ప్రధమ పాదాలు ధనురాంశకు, ద్వితీయ పాదాలు మకరాంశకు, తృతీయ పాదాలు కుంభాంశకు, చతుర్ధ పాదాలు మీనాంశకు చెంది ఉంటాయి.

**1) అశ్వని నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

1) తస్కరాంశ:- అశ్వని నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. మంచి సంపద, భోగాలను అనుభవించువాడు, తగాదాలనిన ఇష్టం కలవాడు, లోభ గుణం కలవాడు, పరస్త్రీల యందు ఆసక్తి కలవాడు, చోర గుణం కలవాడు అగును.

2) భోగ్యాంశ:- అశ్వని నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. ధర్మ నిరతుడు, తేజస్సు కలవాడు, ధన, ధాన్యాభివృద్ధి కలవాడు, దాన గుణం కలవాడు అగును.

3) విచక్షణాంశ:- అశ్వని నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. సమస్త భోగాలు కలవారు, ప్రతి పనిని సాధించువాడు, పనులను నేర్పుతో చేయువాడు అగును.

4) ధర్మాంశ:-అశ్వని నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. భగవంతుడి పైన భక్తి కలవాడు, పూజలు చేయువాడు, సంధ్యావందన తత్పురుడును, నిత్యం ధర్మ కార్యాచరణలో ఉండువారు అగును.

**2) భరణి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

5)నృపాంశ:- భరణి నక్షత్ర ప్రధమ పాదం రవిది. గౌరవ, మర్యాదలు పొందువారు, మంచి లక్షణాలు కలిగి ఉంటారు. కార్య సఫలత కలవారు, ధర్మాత్ముడు అగును.

6) నపుంసకాంశ:- భరణి నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. లోభత్వం కలవారు, నపుంసకుడు, పిసినారి, పనులయందు నేర్పరి, మధ్యవర్తిత్వం చేయువారు అగును.

7) అభయాంశ:-భరణి నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. ప్రశాంతమైన మనస్సు కలవారు, ఉత్సాహవంతులు, శూరులు, బాధ్యతారాహిత్యమైన జీవితాన్ని ఆశించేవారు అగును.

8) పాపాంశ:- భరణి నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. క్రూర స్వభావం కలవారు, కృతజ్ఞత కలవారు, అధిక పుత్ర సంతానవంతులు, ఫలితాలను ఆశించని వారు అగును.

**3) కృత్తిక నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

9) ధానాంశ:- కృత్తిక నక్షత్ర ప్రధమ పాదం గురువుది. దాన, ధర్మాలు చేయువారు, ధనవంతులు, ప్రతాపవంతులు, పనులలో నైపుణ్యం కలవారు అగును.

10) పాపాంశ:- కృత్తిక నక్షత్ర ద్వితీయ పాదం శనిది. మొహమాటం లేకుండా ఉంటారు, పాప కర్మలు చేయువారు, వేశ్యా గృహాలలో జీవించే వాళ్ళుగా ఉంటారు.

11) ఉగ్రాంశ:- కృత్తిక నక్షత్ర తృతీయ పాదం శనిది. చెడు సావాసాలు చేయువారు, నైపుణ్యం ఉన్నప్పటికి మంద బుద్ధులుగా ఉంటారు, దుష్టులైన మిత్రులు కలవారు అగును.

12) ఉత్కృష్టాంశ:- కృత్తిక నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. విద్యా వినయాలు కలవారు, ధర్మాత్ములు, ధార్మికులు, ఎల్లప్పుడు సంతోషం కలవారు అగును.

**4) రోహిణి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

13) సేనాంశ:- రోహిణి నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. చంచలత్వం కలవాడు, ఎర్రని వెంట్రుకలు కలవాడు, శూరుడు, దెబ్బలాటలకు ప్రీతి కలవాడు, నిష్టూరంగా మాట్లాడు వాడు అగును.

14) భృత్యాంశ:-రోహిణి నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. పొడవైన శరీరం కలవాడు, ఓటమిని అంగీకరించలేని తనం కలవారు, మంచి నడవడిక కలవారు అగును.

15) విద్యాంశ:- రోహిణి నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. పండితులు గాను, కవులు గాను, గణిత శాస్త్రజ్ఞులు గాను, లోక వ్యవహార జ్ఞానం కలవారు గాను ఉంటారు.

16) అత్యాశ:- రోహిణి నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఇతరుల ధనంపైన ఆశపడేవారు, తెలివైన వారుగాను, బుద్ధిమంతులుగాను, సజ్జనులుగాను ఉందురు.

**5) మృగశిర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

17) రాజాంశ :- మృగశిర నక్షత్ర ప్రధమ పాదం రవిది. స్థూలమైన శరీరం కలవారు, శత్రువులపైనా విజయం సాదించువారు, ధనవంతులు, తలకు మించిన పనులను నెత్తిన వేసుకొనేవారు గాను ఉంటారు.

18)చండాంశ:- మృగశిర నక్షత్రం ద్వితీయ పాదం బుధుడిది. యజ్ఞ యాగాదులు చేయువారు, భాగ్యవంతులు గాను, మంచి వాక్ శుద్ధి కలవారు గాను ఉంటారు.

19) అభయాంశ:- మృగశిర నక్షత్రం తృతీయ పాదం శుక్రుడిది. ఉదార స్వభావం కలవారు గాను, దేనికైనా సిద్ధపడేవారు గాను, ముఖ వర్చస్సు కలవారుగాను, మంచి పనులు చేయువారు, శౌర్యవంతులు గాను ఉందురు.

20) నీచాంశ:-మృగశిర నక్షత్రం చతుర్ధ పాదం కుజుడిది. కామత్వం కలవారు, తలపైన దెబ్బ తగిలినవారు గాను, ఇతరులను ద్వేషించువారు గాను ఉందురు.

**6) ఆరుద్ర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

21) కృపాంశ:- ఆరుద్ర నక్షత్ర ప్రధమ పాదం గురువుది. గుణవంతుడు, పెద్దల యందు భక్తి, ప్రశాంతమైన ముఖం కలవారు గాను, దయా స్వభావం కలవారుగాను, మంచి నేర్పరులుగాను ఉందురు.

22) తస్కరాంశ:- ఆరుద్ర నక్షత్ర ద్వితీయ పాదం శనిది. కలహ ప్రియులు, చోర విధ్య బాగా తెలిసినవారు, అతి దాహార్తి కలవారు, హీనమైన కాంత స్వరం కలవారు గాను ఉంటారు.

23) ఉగ్రాంశ:- ఆరుద్ర నక్షత్ర తృతీయ పాదం శనిది. శుచి శుభ్రత లేనివారు, చెడు ఆలోచనలు చేసేవారు, స్థిరమైన ఆదాయం లేనివారు, మంత్ర తంత్రాలతో భయపెట్టేవారు అగును.

24) ఉత్కృష్టాంశ:- ఆరుద్ర నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. ధర్మాన్ని పాటించేవారు, అక్కటి ఆచార వ్యవహారాలు చేయువారు, గౌరవ మర్యాదలు తెలిసిన వారై ఉంటారు.

**7) పునర్వసు నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

25) ఉత్తమాంశ:- పునర్వసు నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. భగవంతునిపైన భక్తి కలవారు, ఎర్రటి కనులు కలవారు, కోప స్వభావం, చెడు ప్రవర్తన కలవారుగాను ఉంటారు.

26) భోక్తాంశ:- పునర్వసు నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. వస్త్ర అలంకార ప్రియులు, భోజన ప్రియులు, ధనవంతులు, శృంగార ప్రియులు అవుతారు.

27) సౌమ్యాంశ:- పునర్వసు నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. పండితుడు, లోభ స్వభావం కలవారు, తరచూ వ్యాధి పీడితులుగాను, వ్యాపార దక్షత కలవారు, శృంగార ప్రియులు అవుతారు.

28) ధనాంశ :- పునర్వసు నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఆదిక ధనవంతులు, ఉపకారం చేయువారు, స్త్రీల మాటలను పాటించువారు, నిర్మలత్వం కలవారు, ఆకర్షణ కలవారు అవుతారు.

**8) పుష్యమి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

29) భూపాంశ:- పుష్యమి నక్షత్రం మొదటి పాదం రవిది. వీరికి ఏకాంతమన్న ప్రీతి, ప్రతి పని తొందరగా చేస్తారు. రోగం కలవారుగాను, స్థూల కాయం కలగి ఉంటారు.

30) సౌమ్యాంశ:- పుష్యమి నక్షత్రం రెండవ పాదం బుధుడిది. పరస్త్రీలపైనా వ్యామోహం కలిగి ఉంటారు. వారి మూలంగా కష్టాలను తెచ్చుకుంటారు. ధనకాంక్ష కలిగి ఉంటారు.

31) శూరాంశ :- పుష్యమి నక్షత్రం మూడవ పాదం శుక్రుడిది. చాలా ప్రసన్నంగా ఉంటారు. భోగవంతులు, పరోపకారి, నిత్యం మనశ్శాంతి కలిగి ఉంటారు.

32) నీచాంశ:- పుష్యమి నక్షత్రం నాల్గవ పాదం కుజుడిది. వీరు సహజంగా కలహ ప్రియులు, ఇతరుల వస్తువులను దొంగలించువారు. పరస్త్రీల యందు ఆసక్తి కలవారుగాను ఉంటారు.

**9) ఆశ్లేష నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

33) ఉత్పన్నాంశ:- ఆశ్లేష నక్షత్ర ప్రధమ పాదం గురువుది. వీరు ధైర్యవంతులు. సత్యవాక్కులు పలుకువారు. మంచిబుద్ధి కలవారుగాను ఉంటారు.

34) పాపాంశ:- ఆశ్లేష నక్షత్ర ద్వితీయ పాదం శనిది. వీరు నిత్యం ఏదో ఒక వ్యాధితో బాధపడుతూనే ఉంటారు. పాప కార్యాలు చేయుటలో ఆసక్తి కలిగి ఉంటారు. చంచల స్వభావం కలిగి ఉంటారు. చెడ్డ పనుల ద్వారా ఆదాయం సంపాదిస్తారు. సుకి శుభ్రత లేనివారు అవుతారు.

35) క్రోధాంశ:- ఆశ్లేష నక్షత్ర తృతీయ పాదం శనిది. వీరు అబద్ధాలు ఆడటం, కుట్రలు చేయటం, అన్యాయంగా డబ్బు సంపాదించటం, బుద్ధి మాంద్యం, వాటా రోగం కలిగి ఉంటారు.

36) ఉగ్రాంశ:- ఆశ్లేష నక్షత్ర నాల్గవ పాదం గురువుది. వీరు మాట పితరులకు మారకులు అవుతారు. దాన నాశకులు, పరుల పెంపకంలో ఉండేవారు, ఒక మోస్తరుగా సుఖపడేవాళ్ళుగా ఉంటారు.

**10) మఖ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

37) సేవాంశ:- మఖ నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. వీరి శరీరంపై ఎర్రని రోమాలు కలిగి ఉంటారు. పట్టుదల కలిగి ఉంటారు. ప్రతిష్ఠ కలవారుగా ఉంటారు.

38) భుక్తాంశ:- మఖ నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది వీరు ఏకాంతాన్ని కోరుకుంటారు. త్యాగం చేయువారు, దేనినైనా న్యాయంగా పొందాలి. సంపాదించాలి అని కోరుకునేవారు.

39) విచక్షణాంశ:- మఖ నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. వీరు జ్ఞాన వంతులు, మేధావులు, శాస్త్రవేత్తలు, నేర్పరులుగా ఉంటారు.

40) అంత్యాంశ :- మఖ నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. వీరు స్త్రీ ప్రియులు, రోగం కలవారు, తెలివైనవాళ్ళు, కుటిలమైన స్వభావం కలిగి ఉంటారు. పొట్టిగా ఉంటారు.

**11) పుబ్బ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

41) రాజాంశ:- పుబ్బ నక్షత్ర ప్రధమ పాదం రవిది. వీరు చంచలమైన నేత్రాలు కలిగి ఉంటారు. చూడటానికి బలహీనంగా ఉంటారు. కొనుగోలు, అమ్మకాలు వ్యవహారాలు కలిగిన వ్యాపారాలలో నిపుణత్వం కలిగి ఉంటారు.

42) నపుంసకాంశ :- పుబ్బ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. కీర్తి ప్రతిష్ఠలు కలిగి ఉంటారు. వికృత రూపం కలిగి ఉంటారు. ఇతరులకు కష్ఠం కలిగిస్తూ ఉంటారు.

43) అభయాంశ :- పుబ్బ నక్షత్రం తృతీయ పాదం శుక్రుడిది. వీరికి పుత్ర సంతానం అధికంగా కలిగి ఉంటారు. శిల్పశాస్త్రంలో నిపుణులు అవుతారు. గణిత శాస్త్రంలోను నిపుణత్వం కలిగి ఉంటారు.

44) దరిద్రాంశ :- పుబ్బ నక్షత్రం చతుర్ధ పాదం కుజుడిది. జీవితంలో సుఖం ఉండదు. నిత్యం కష్ఠలను అనుభవిస్తారు. అధిక సంతానం కలిగి ఉంటారు. దరిద్రాన్ని అనుబావిస్తూంటారు.

**12) ఉత్తర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

45) ఉత్పన్నాంశ:- ఉత్తర నక్షత్రం ప్రధమ పాదం గురువుది. వీరు వాత రోగం కలిగి ఉంటారు. పరిశుద్ధులు, ప్రబంధ ప్రియులు, కావ్యాస్వాదనా చతురులు కలవారు అవుతారు.

46) పాపాంశ :- ఉత్తర నక్షత్రం ద్వితీయ పాదం శనిది. వీరు పరులను పీడించేవారుగాను, చంచలత్వం కలవారుగాను, నిత్య దరిద్రులుగా ఉందురు.

47) ఉగ్రాంశ:- ఉత్తర నక్షత్రం తృతీయ పాదం శనిది. వీరు మేలు చేసిన వారిని మరిచిపోతారు. చెడు వాదనలు చేసేవాళ్ళు, డాంబికాలు పోతారు, గర్విష్టులు, అందరిని సూటిపోటీ మాటలతో వేదిస్తారు.

48) శుభాంశ :- ఉత్తర నక్షత్రం చతుర్ధ పాదం గురువుది. వీరు వినయ విధేయతలు కలవారు, విద్యా సంపన్నులు అవుతారు. పుత్ర సంతానం కలవారు అవుతారు.

**13) హస్త నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు.**

49) క్రూరాంశ:- హస్తా నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. వీరు పాప కర్మలు చేసేవాళ్ళు, బలవంతులు, చింతన కలవారు అవుతారు.

50) ముక్తాంశ:- హస్తా నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. వీరు నిత్యం మంచి మాటలనే మాట్లాడేవారు, మంధ బుద్ధి కలవారుగాను ఉంటారు.

51) పండితాంశ:- హస్తా నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. వీరు చెడ్డ బుద్ధి కలవారు, కాముకులు, వ్యాపారంలో భాగం అయిన అమ్మకాలు, కొనుగోళ్ళు విషయాలలో మహా నిపుణులుగా ఉంటారు.

52) ధనాంశ:- హస్తా నక్షత్రం చతుర్ధ పాదం చంద్రుడిది. వీరు రాచకార్యాలు చేయుటలో ఇష్టం కలవారు, సన్మానాలు పొందేవారు, అభిమానవంతులు, కొద్దిగా కోపం కలవారుగాను ఉంటారు.

**14) చిత్రా నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

53) రాజాంశ:- చిత్రా నక్షత్ర ప్రధమ పాదం రవిది. వీరు చంచల మనస్తత్వం కలవారుగా ఉంటారు. ఉగ్ర స్వభావం కలవారుగా ఉంటారు.

54) నపుంసకాంశ:- చిత్రా నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. వీరు చాలా తియ్యగా మాట్లాడి జనాలను నమ్మిస్తారు. కోపం వస్తే చాలా కాలం ఉంటుంది. ఈ పనిని ఐనా సరే అధికకాలం అయ్యేటట్లు చేస్తారు.

55) అభయాంశ:- చిత్రా నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. వీరు కీర్తిమంతులు, శౌర్యవంతులు, పండితులతో సహవాసం చేయటం, వారితోనే గడపటం వీరి లక్షణాలు.

56) ధనాంశ:- చిత్రా నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. వీరు చిన్నతనంలోనే దొంగతనాలకు పాల్పడతారు. సరిపడా సంపాదించాక నేరాలు మానేస్తారు. అమిత ధైర్యవంతులు, విక్రమం కలవారుగాను ఉంటారు.

**15) స్వాతి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

57) ఉత్పన్నాంశ :- స్వాతి నక్షత్ర ప్రధమ పాదం గురుడుది. వీరు ఎప్పుడు అతిగా మాట్లాడుతూనే ఉంటారు. సూక్ష్మ పరిశీలన కలవారు. జ్ఞానం కలవారుగాను ఉంటారు.

58) ధనాంశ :- స్వాతి నక్షత్ర ద్వితీయ పాదం శనిది. వీరు చెడ్డపేరు తెచ్చుకుంటారు. దొంగలుగా, వ్యసనపరులుగా పరిణమిస్తారు. సాయం చేసినవారిని మాత్రం మరువరు.

59) ఉగ్రాంస:- స్వాతి నక్షత్ర తృతీయ పాదం శనిది. వీరు మూర్ఖులు, అత్యంత కోపం కలవారు. శత్రువుల పట్ల ద్వేషం పెంచుకునే వారు. అతిగా ఖర్చు పెట్టేవాళ్ళుగా ఉంటారు.

60) ఉత్కృష్టాంశ :- స్వాతి నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. వీరు కోపం కలిగి ఉన్న జనాభిమానం కలవారు. గురుభక్తి కలవారు. ధనికులు అయి ఉంటారు.

**16) విశాఖ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

61) సౌఖ్యాంశ:- విశాఖ నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. పలుచటి ఛాతీ కలిగిన శరీరం. ఎర్రటి కన్నులు కలిగి ఉంటారు. మిక్కిలి ధనవంతులై ఉంటారు.

62) భోగాంశ:- విశాఖ నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. రూప వంతులు, సౌందర్యవంతులు, అందమైన భార్య కాళీ ఉంటారు. సౌఖ్యవంతులు. చెవిటి వాళ్ళుగా గాని, వినికిడి లోపం ఉన్నవారుగా గాని ఉంటారు. దేనినైనా న్యాయ పరంగా సంపాదింకుసేవాళ్ళు అవుతారు.

63) సౌమ్యాంశ:- విశాఖ నక్షత్రం తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు మంచి చెడు పట్ల విచక్షణ కలిగి ఉంటారు. నేర్పరితనం కలిగి ఉంటారు. దాన గుణవంతులుగా ఉంటారు. కంటి చూపును కోల్పోవటం లేదా లోపం గాని ఏర్పడవచ్చును.

64) అర్ధాంశ:- విశాఖ నక్షత్రం చతుర్ధ పాదం చంద్రుడిది. స్త్రీలను ఆకర్షించువాడు. దృష్టి లోపం కలవాడు. ధన సంపాదన పైన ఆసక్తి కలవాడు అగును.

**17) అనూరాధ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

65) రాజాంశ :- అనూరాధ నక్షత్ర ప్రధమ పాదం రవిది. ఈ జాతకులు మాట్లాడేటప్పుడు వినయ విధేయతలు కలిగి ఉంటారు. నీతి నియమాలు కలిగి ఉంటారు. మంత్రోపాసన చేసేవారు. మంత్రాంగాలు నెరపేవాళ్ళుగా ఉంటారు.

66) నపుంసకాంశ:- అనూరాధ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. ఈ జాతకులు వీణా వాయిద్యాల పట్ల మక్కువ కలిగి ఉంటారు. ఆదర్శమూర్తులు. మేధావులుగా ఉంటారు.

67) అభయాంశ :- అనూరాధ నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. వీరికి స్థిరత్వం ఉండదు. అనుకూలవతియైన భార్య లభిస్తుంది.

68) నీచాంశ:- అనూరాధ నక్షత్రం చతుర్ధ పాదం కుజుడిది. ఈ జాతకులు ఇతరులకు ద్రోహం చేసేవాళ్ళు, కుట్రలు కుతంత్రాలు చేసేవాళ్ళు, దరిద్రులు అవుతారు.

**18) జ్యేష్ఠ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

69) ఉత్పన్నాంశ :- జ్యేష్ఠ నక్షత్ర ప్రధమ పాదం గురువుది. రచనా సామర్ధ్యం కలవారు. హాస్యప్రియులు, గర్వం కలవారుగా ఉంటారు.

70) ఉగ్రాంశ:- జ్యేష్ఠ నక్షత్ర ద్వితీయ పాదం శనిది. ఎప్పుడు ఏదో ఒక అనారోగ్యంతో బాధపడేవారుగాను, ఇతరులకు సులభంగా లొంగిపోయేవారుగాను ఉంటారు.

71) పాపాంశ:- జ్యేష్ఠ నక్షత్ర తృతీయ పాదం శనిది. ఈ జాతకులు అంగవైకల్యం కలిగి ఉంటారు. మరీ అతి స్వల్పమైన భోగం కలిగి ఉంటారు. చూపు సరిగా లేకపోవటం, ఇతరుల పనులు చేయువారు అగుదురు.

72) శుభాంశ:- జ్యేష్ఠ నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. వినికిడి లోపం కలిగి ఉంటారు.ధర్మ శాస్త్రాలపైనా పట్టు కలవారు. పూజలు చేయువారు. శాస్త్రవేత్తలు అవుతారు.

**19) మూల నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

73) తస్కరాంశ:- మూల నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. తండ్రి సహకారం లేనివాడు. వ్యాధిగ్రస్తులుగా ఉంటారు. ధరిద్రులు అవుతారు.

74) భోక్తాంశ:- మూల నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. మాతృసౌఖ్యం లేనివారు, దయామయులు, క్షీరాన్నం, బెల్లం పట్ల మక్కువ కలవారు. వాహన సౌఖ్యం కలవారు. భోగాలను అనుభవించేవారు.

75) విచక్షణాంశ:- మూల నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు ధనవంతులు, ఖర్చు పెట్టే మనస్తత్వం కలవారు. మంచి సంభాషణాపరులు, విద్యావంతులు, జ్యోతిష్య విద్య తెలిసిన వాళ్ళు, ఎదుటి వారు ఏది చెబితే వినగలరో అది చెప్పగలిగే సామర్ధ్యం ఉన్నవారు.

76) ధనాంశ:- మూల నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఈ జాతకులు ప్రభుత్వ ఉద్యోగులు, సేనాపతులు, పరోపకారులు, కామత్వం కలవారు, రోగ సూచనలు కలవారు, ఆడవారి కంఠ స్వరం కలవారు. మెత్తగా మాట్లాడేవారు, లౌకికం కలవారు అవుతారు.

**20) పూర్వాషాడ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

77) ఉత్పన్నాంశ:- పూర్వాషాడ నక్షత్ర ప్రధమ పాదం రవిది. సౌఖ్యత లేనివారు, ఎర్రటి నేత్రాలు కలవారు, శక్తి సామర్థ్యాలు కలవారు

78) అభయాంశ:- పూర్వాషాడ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. ఈ జాతకులు పెద్ద పొట్ట కలిగి ఉంటారు. ఎప్పుడు మాట్లాడుతూనే ఉంటారు. మృదువుగానే మాట్లాడుతారు. అవతలి వ్యక్తులలోని సద్గుణాలను పసిగడతారు.

79) భాగ్యాంశ :- పూర్వాషాడ నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. ఈ జాతకులు నిత్యం శుచిగా ఉంటారు. దయా హృదయం కలిగి ఉంటారు. భాగ్యవంతులు, చపలచిత్తం కలవారుగా ఉంటారు.

80) ఉగ్రాంశ:- పూర్వాషాడ నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. పండితుల పట్ల ద్వేషం కలవారు. ఉగ్ర స్వభావం కలవారు. పాపకార్యాలు చేయువారు, అబద్ధాలాడటం వీళ్ళ స్వభావంగా ఉంటుంది.

**21) ఉత్తరాషాడ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

81) ఉత్పన్నాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర ప్రధమ పాదం గురువుది. ఈ జాతకులు బుద్ధిమంతులు. శాస్త్రవేత్తలు, స్థిరాస్తులు కలవారు, పెద్దలయందు భక్తి కలవారు, ధర్మపాలన చేయువారు.

82) పాపాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర ద్వితీయ పాదం శనిది. ఈ జాతకులు పనికి రాని పనులు చేయటంలో సిద్ధహస్తులు. ఇతర మతాలపట్ల ప్రేమాభిమానాలు కలవారు.

83) ఉగ్రాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర తృతీయ పాదం శనిది. స్థూలమైన శరీరం కలవారు. అల్ప సంతోషులు, నిత్యం వ్యాధిగ్రస్తులుగా ఉంటారు.

84) శోభనాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. శుభములు కలవారు, నిత్యం ఏదో ఒక పని చేసేవారు, శాస్త్ర విషయాలపై శ్రద్ధ కలవారు, వ్యాపార లక్షణాలు కలవారు, ఉత్సాహవంతులుగా ఉంటారు.

**22) శ్రావణా నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

85) మంగళాంశ:- శ్రావణా నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. కలహ ప్రియులు, పుత్ర సంతానం లేనివారు, గుల్మరోగం కలవారు అవుతారు.

86) భోక్తాంశ:- శ్రావణా నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. సేవకులతో పని చేయించుకునేవారు. తంత్ర విద్యలపైనా ఆసక్తి కలవారు. కామత్వం కలవారు అవుతారు.

87) విచక్షణాంశ :- శ్రావణా నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు అత్యంత ఉదార స్వభావం కలవారు. చిత్రలేఖకులు, కలహప్రియులుగా ఉంటారు.

88) ధనాంశ:- శ్రవణా నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఈ జాతకులు పసు పోషకులు. యోగులు, ధార్మికులు అవుతారు. ముక్కు పొడవు కలిగి ఉంటారు.

**23) ధనిష్ఠ నక్షత్ర నాలుగు పాదాలకు అంశగుణాలు**

89) రాజాంశ :- ధనిష్ఠ నక్షత్ర ప్రధమ పాదం రవిది. ఈ జాతకులు స్థూలమైన శరీరం కలవారు. దానగుణం కలవారు. స్త్రీలపైన ప్రీతి కలవారు అగును.

90) సౌమ్యాంశ :- ధనిష్ఠ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. వినయ విధేయతలతో మాట్లాడేవారు. ఉన్నత విద్యలు చదివేవారు అవుతారు.

91) అభయాంశ :- ధనిష్ఠ నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. గుణవంతులు అవుతారు. చిరాయుష్మంతులు అవుతారు. సత్య పలుకులు పలుకువారు అవుతారు.

92) క్రూరాంశ :- ధనిష్ఠ నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. ఈ జాతకులు నిత్యం పాప కర్మలు చేయుటలో లీనమై ఉంటారు. క్రూరమైన స్వభావం కలవారు. స్థూలమైన శరీరం కలవారు అవుతారు.

**24) శతభిష నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

93) ఉత్పన్నాంశ :- శతభిష నక్షత్ర ప్రధమ పాదం గురువుది. ఈ జాతకులు గోవులను పూజించువారు. బ్రాహ్మణులపట్ల గౌరవం కలవారు. సత్యం మాట్లాడువారు. స్థిరమైన బుద్ధి కలవారు, అభిమానవంతులు, స్నేహములను కలిగి ఉంటారు.

94) పాపాంశ :- శతభిష నక్షత్ర ద్వితీయ పాదం శనిది. ఈ జాతకులు పిరికితనం కలిగి ఉంటారు. ఏ పని తొందరగా చేయరు. పాపభీతి కలవారు అగుదురు.

95) భయాంశ:- శతభిష నక్షత్ర తృతీయ పాదం శనిది. ఈ జాతకులు పుత్ర సంతానం కలిగి ఉంటారు. పాండిత్యం కలవారు. మంధబుద్ధికలవారు. పాప కర్మలు చేయువారు. ఉగ్ర కర్మలు చేయువారు అగుదురు.

96) సౌమ్యాంశ:- శతభిష నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. ఈ జాతకులు స్నేహశీలురు, పండితులు, అభిమానవంతులు, యజ్ఞ కార్యాలు చేయువారు.

**25) పూర్వాభాద్ర నక్షత్ర నాలుగు పాదాలకు అంశగుణాలు.**

97) సేవాంశ:- పూర్వాభాద్ర నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. ఈ జాతకులు ఉద్యోగస్తులు, విష్ణు పూజ చేయువారు, భోగులుగా ఉంటారు.

98) భోగాంశ :- పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. ఈ జాతకులు సాహస వంతులు, మంత్రోపాసన చేయువారు, ప్రభుత్వ వ్యతిరేకులుగా ఉంటారు.

99) విచక్షణాంశ:- పూర్వాభాద్ర నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు పితృ ప్రియులు, సుఖవంతులుగా ఉంటారు. జ్ఞానవంతులు, భోగులుగా ఉంటారు.

100) ధనాంశ :- పూర్వాభాద్ర నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఈ జాతకులు స్త్రీలపైనా ఆసక్తి కలవారు, అందరి చేత కీర్తింపబడేవారు, ధనవంతులు, మాతృ సేవకులుగా ఉంటారు.

**26) ఉత్తరాభాద్ర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

101) తీక్షణాంశ:- ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రధమ పాదం రవిది. ఈ జాతకులు పైత్యా శరీరం కలవారు, చపల చిత్తం కలవారు, కోపిష్ఠులు, ఎర్రని నేత్రాలు కలవారు, కృశించిన శరీరం కలవారుగా ఉంటారు.

102) అభయాంశ :- ఉత్తరాభాద్ర నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. ఇజాతకులు జ్యోతిష శాస్త్ర పండితులుగా గాని, పంచాంగ కర్తలుగా గాని ఉంటారు. జ్ఞాన వంతులు, సౌమ్యమైన గుణం కలవారు, అవతలి వాళ్ళలోని గుణాలను గ్రహించగలిగే సామర్ధ్యం కలవారు అవుతారు.

103) అభయాంశ :- ఉత్తరాభాద్ర నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. ఈ జాతకులు తెలివితేటలు కలవారు, శాస్త్రవేత్తలు, ధనవంతులు అవుతారు.

104) దీనాంశ:- ఉత్తరాభాద్ర నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. ఈ జాతకులు చెడు స్నేహాలు కలవారు, శత్రువులు కలవారు, ధనం సంపాదించువారు అవుతారు.

**27) రేవతి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

105) ఉత్పన్నాంశ :- రేవతీ నక్షత్ర ప్రధమ పాదం గురువుది. ఈ జాతకులు శాస్త్రాలపైనా పట్టు గలవారు, నీటి నియమాలు కలవారు, తాత్వికులు అగుదురు.

106) పాపాంశ:- రేవతి నక్షత్ర ద్వితీయ పాదం శనిది. పాప కర్మలు చేసేవారు, జూదం ఆడేవారు, కుటిలమైన బుద్ధి కలవారు అగుదురు.

107) ఉగ్రాంశ:- రేవతి నక్షత్ర తృతీయ పాదం శనిది. మంధ బుద్ధి కలవారు, సౌందర్యవంతులు, కోప స్వభావం కలవారు అగుదురు.

108) శోభనాంశ :- రేవతి నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. ఈ జాతకులు యజ్ఞ యాగాదులు చేయువారు, దైవ కార్యాలు చేయువారు, పండితులు, వేదాంతులు, ధైర్యవంతులు అవుతారు.108 నవాంశలు వాటి ఫలితాలు.

27 నక్షత్రాలలోను ప్రతి నక్షత్రానికి నాలుగు పాదాలు ఉంటాయి. మొత్తం నూట ఎనిమిది పాదాలే గాక వాటికి విడివిడిగా రాశ్యంశలు కూడా ఉంటాయి.

అశ్వని, రోహిణి, పునర్వసు, మఖ, హస్త, విశాఖ, మూల, శ్రవణం, పూర్వాభాద్ర అనబడే తొమ్మిది నక్షత్రాల ప్రధమ పాదాలు మేషాంశకు, ద్వితీయ పాదాలు వృషభాంశకు, తృతీయ పాదాలు మిధునాంశకు, చతుర్ధ పాదాలు కర్కటాంశకు చెంది ఉంటాయి.

భరణి, మృగశిర, పుష్యమి, పుబ్బ, చిత్ర, అనూరాధ, పూర్వాషాడ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర అనబడే తొమ్మిది నక్షత్రాల ప్రధమ పాదాలు సింహాంశకు, ద్వితీయ పాదాలు కన్యాంశకు, తృతీయ పాదాలు తులాంశకు, చతుర్ధ పాదాలు వృశ్చికాంశకు చెంది ఉంటాయి.

కృత్తిక, ఆరుద్ర, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, జ్యేష్ఠ, ఉత్తరాషాడ, శతభిషం, రేవతి అనబడే తొమ్మిది నక్షత్రాల ప్రధమ పాదాలు ధనురాంశకు, ద్వితీయ పాదాలు మకరాంశకు, తృతీయ పాదాలు కుంభాంశకు, చతుర్ధ పాదాలు మీనాంశకు చెంది ఉంటాయి.

**1) అశ్వని నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

1) తస్కరాంశ:- అశ్వని నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. మంచి సంపద, భోగాలను అనుభవించువాడు, తగాదాలనిన ఇష్టం కలవాడు, లోభ గుణం కలవాడు, పరస్త్రీల యందు ఆసక్తి కలవాడు, చోర గుణం కలవాడు అగును.

2) భోగ్యాంశ:- అశ్వని నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. ధర్మ నిరతుడు, తేజస్సు కలవాడు, ధన, ధాన్యాభివృద్ధి కలవాడు, దాన గుణం కలవాడు అగును.

3) విచక్షణాంశ:- అశ్విని నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. సమస్త భోగాలు కలవారు, ప్రతి పనిని సాధించువాడు, పనులను నేర్పుతో చేయువాడు అగును.

4) ధర్మాంశ:-అశ్విని నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. భగవంతుడి పైన భక్తి కలవాడు, పూజలు చేయువాడు, సంధ్యావందన తత్పురుడును, నిత్యం ధర్మ కార్యాచరణలో ఉండువారు అగును.

**2) భరణి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

5)నృపాంశ:- భరణి నక్షత్ర ప్రధమ పాదం రవిది. గౌరవ, మర్యాదలు పొందువారు, మంచి లక్షణాలు కలిగి ఉంటారు. కార్య సఫలత కలవారు, ధర్మాత్ముడు అగును.

6) నపుంసకాంశ:- భరణి నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. లోభత్వం కలవారు, నపుంసకుడు, పిసినారి, పనులయందు నేర్పరి, మధ్యవర్తిత్వం చేయువారు అగును.

7) అభయాంశ:-భరణి నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. ప్రశాంతమైన మనస్సు కలవారు, ఉత్సాహవంతులు, శూరులు, బాధ్యతారాహిత్యమైన జీవితాన్ని ఆశించేవారు అగును.

8) పాపాంశ:- భరణి నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. క్రూర స్వభావం కలవారు, కృతఙ్ఞత కలవారు, అధిక పుత్ర సంతానవంతులు, ఫలితాలను ఆశించని వారు అగును.

**3) కృత్తిక నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

9) ధానాంశ:- కృత్తిక నక్షత్ర ప్రధమ పాదం గురువుది. దాన, ధర్మాలు చేయువారు, ధనవంతులు, ప్రతాపవంతులు, పనులలో నైపుణ్యం కలవారు అగును.

10) పాపాంశ:- కృత్తిక నక్షత్ర ద్వితీయ పాదం శనిది. మొహమాటం లేకుండా ఉంటారు, పాప కర్మలు చేయువారు, వేశ్యా గృహాలలో జీవించే వాళ్ళుగా ఉంటారు.

11) ఉగ్రాంశ:- కృత్తిక నక్షత్ర తృతీయ పాదం శనిది. చెడు సావాసాలు చేయువారు, నైపుణ్యం ఉన్నప్పటికి మంద బుద్ధులుగా ఉంటారు, దుష్టులైన మిత్రులు కలవారు అగును.

12) ఉత్కృష్టాంశ:- కృత్తిక నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. విద్యా వినయాలు కలవారు, ధర్మాత్ములు, ధార్మికులు, ఎల్లప్పుడు సంతోషం కలవారు అగును.

**4) రోహిణి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

13) సేనాంశ:- రోహిణి నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. చంచలత్వం కలవాడు, ఎర్రని వెంట్రుకలు కలవాడు, శూరుడు, దెబ్బలాటలకు ప్రీతి కలవాడు, నిష్టూరంగా మాట్లాడు వాడు అగును.

14) భృత్యాంశ:-రోహిణి నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. పొడవైన శరీరం కలవాడు, ఓటమిని అంగీకరించలేని తనం కలవారు, మంచి నడవడిక కలవారు అగును.

15) విద్యాంశ:- రోహిణి నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. పండితులు గాను, కవులు గాను, గణిత శాస్త్రజ్ఞులు గాను, లోక వ్యవహార జ్ఞానం కలవారు గాను ఉంటారు.

16) అత్యాశ:- రోహిణి నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఇతరుల ధనంపైన ఆశపడేవారు, తెలివైన వారుగాను, బుద్ధిమంతులుగాను, సజ్జనులుగాను ఉందురు.

**5) మృగశిర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

17) రాజాంశ :- మృగశిర నక్షత్ర ప్రథమ పాదం రవిది. స్థూలమైన శరీరం కలవారు, శత్రువులపైనా విజయం సాదించువారు, ధనవంతులు, తలకు మించిన పనులను నెత్తిన వేసుకొనేవారు గాను ఉంటారు.

18)చండాంశ:- మృగశిర నక్షత్రం ద్వితీయ పాదం బుధుడిది. యజ్ఞ యాగాదులు చేయువారు, భాగ్యవంతులు గాను, మంచి వాక్ శుద్ధి కలవారు గాను ఉంటారు.

19) అభయాంశ:- మృగశిర నక్షత్రం తృతీయ పాదం శుక్రుడిది. ఉదార స్వభావం కలవారు గాను, దేనికైనా సిద్ధపడేవారు గాను, ముఖ వర్చస్సు కలవారుగాను, మంచి పనులు చేయువారు, శౌర్యవంతులు గాను ఉందురు.

20) నీచాంశ:-మృగశిర నక్షత్రం చతుర్ధ పాదం కుజుడిది. కామత్వం కలవారు, తలపైన దెబ్బ తగిలినవారు గాను, ఇతరులను ద్వేషించువారు గాను ఉందురు.

**6) ఆరుద్ర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

21) కృపాంశ:- ఆరుద్ర నక్షత్ర ప్రథమ పాదం గురువుది. గుణవంతుడు, పెద్దల యందు భక్తి, ప్రశాంతమైన ముఖం కలవారు గాను, దయా స్వభావం కలవారుగాను, మంచి నేర్పరులుగాను ఉందురు.

22) తస్కరాంశ:- ఆరుద్ర నక్షత్ర ద్వితీయ పాదం శనిది. కలహ్ ప్రియులు, చోర విధ్య బాగా తెలిసినవారు, అతి దాహార్తి కలవారు, హీనమైన కాంత స్వరం కలవారు గాను ఉంటారు.

23) ఉగ్రాంశ:- ఆరుద్ర నక్షత్ర తృతీయ పాదం శనిది. శుచి శుభ్రత లేనివారు, చెడు ఆలోచనలు చేసేవారు, స్థిరమైన ఆదాయం లేనివారు, మంత్ర తంత్రాలతో భయపెట్టేవారు అగును.

24) ఉత్కృష్టాంశ:- ఆరుద్ర నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. ధర్మాన్ని పాటించేవారు, అక్కటి ఆచార వ్యవహారాలు చేయువారు, గౌరవ మర్యాదలు తెలిసిన వారై ఉంటారు.

**7) పునర్వసు నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

25) ఉత్తమాంశ:- పునర్వసు నక్షత్ర ప్రథమ పాదం కుజుడిది. భగవంతునిపైన భక్తి కలవారు, ఎర్రటి కనులు కలవారు, కోప స్వభావం, చెడు ప్రవర్తన కలవారుగాను ఉంటారు.

26) భోక్తాంశ:- పునర్వసు నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. వస్త్ర అలంకార ప్రియులు, భోజన ప్రియులు, ధనవంతులు, శృంగార ప్రియులు అవుతారు.

27) సౌమ్యాంశ:- పునర్వసు నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. పండితుడు, లోభ స్వభావం కలవారు, తరచూ వ్యాధి పీడితులుగాను, వ్యాపార దక్షత కలవారు, శృంగార ప్రియులు అవుతారు.

28) ధనాంశ :- పునర్వసు నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఆదిక ధనవంతులు, ఉపకారం చేయువారు, స్త్రీల మాటలను పాటించువారు, నిర్మలత్వం కలవారు, ఆకర్షణ కలవారు అవుతారు.

**8) పుష్యమి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

29) భూపాంశ:- పుష్యమి నక్షత్రం మొదటి పాదం రవిది. వీరికి ఏకాంతమన్న ప్రీతి, ప్రతి పని తొందరగా చేస్తారు. రోగం కలవారుగాను, స్థూల కాయం కలగి ఉంటారు.

30) సౌమ్యాంశ:- పుష్యమి నక్షత్రం రెండవ పాదం బుధుడిది. పరస్త్రీలపైనా వ్యామోహం కలిగి ఉంటారు. వారి మూలంగా కష్టాలను తెచ్చుకుంటారు. ధనకాంక్ష కలిగి ఉంటారు.

31) శూరాంశ :- పుష్యమి నక్షత్రం మూడవ పాదం శుక్రుడిది. చాలా ప్రసన్నంగా ఉంటారు. భోగవంతులు, పరోపకారి, నిత్యం మనశ్శాంతి కలిగి ఉంటారు.

32) నీచాంశ:- పుష్యమి నక్షత్రం నాల్గవ పాదం కుజుడిది. వీరు సహజంగా కలహ ప్రియులు, ఇతరుల వస్తువులను దొంగలించువారు. పరస్త్రీల యందు ఆసక్తి కలవారుగాను ఉంటారు.

**9) ఆశ్లేష నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

33) ఉత్పన్నాంశ:- ఆశ్లేష నక్షత్ర ప్రధమ పాదం గురువుది. వీరు ధైర్యవంతులు. సత్యవాక్కులు పలుకువారు. మంచిబుద్ధి కలవారుగాను ఉంటారు.

34) పాపాంశ:- ఆశ్లేష నక్షత్ర ద్వితీయ పాదం శనిది. వీరు నిత్యం ఏదో ఒక వ్యాధితో బాధపడుతూనే ఉంటారు. పాప కార్యాలు చేయుటలో ఆసక్తి కలిగి ఉంటారు. చంచల స్వభావం కలిగి ఉంటారు. చెడ్డ పనుల ద్వారా ఆదాయం సంపాదిస్తారు. సుకి శుభ్రత లేనివారు అవుతారు.

35) క్రోధాంశ:- ఆశ్లేష నక్షత్ర తృతీయ పాదం శనిది. వీరు అబద్ధాలు ఆడటం, కుట్రలు చేయటం, అన్యాయంగా డబ్బు సంపాదించటం, బుద్ధి మాంద్యం, వాటా రోగం కలిగి ఉంటారు.

36) ఉగ్రాంశ:- ఆశ్లేష నక్షత్ర నాల్గవ పాదం గురువుది. వీరు మాట పితరులకు మారకులు అవుతారు. దాన నాశకులు, పరుల పెంపకంలో ఉండేవారు, ఒక మోస్తరుగా సుఖపడేవాళ్ళుగా ఉంటారు.

**10) మఖ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

37) సేవాంశ:- మఖ నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. వీరి శరీరంపై ఎర్రని రోమాలు కలిగి ఉంటారు. పట్టుదల కలిగి ఉంటారు. ప్రతిష్ఠ కలవారుగా ఉంటారు.

38) భుక్తాంశ:- మఖ నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది వీరు ఏకాంతాన్ని కోరుకుంటారు. త్యాగం చేయువారు, దేనినైనా న్యాయంగా పొందాలి. సంపాదించాలి అని కోరుకునేవారు.

39) విచక్షణాంశ:- మఖ నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. వీరు జ్ఞాన వంతులు, మేధావులు, శాస్త్రవేత్తలు, నేర్పరులుగా ఉంటారు.

40) అంత్యాంశ :- మఖ నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. వీరు స్త్రీ ప్రియులు, రోగం కలవారు, తెలివైనవాళ్ళు, కుటిలమైన స్వభావం కలిగి ఉంటారు. పొట్టిగా ఉంటారు.

**11) పుబ్బ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

41) రాజాంశ:- పుబ్బ నక్షత్ర ప్రధమ పాదం రవిది. వీరు చంచలమైన నేత్రాలు కలిగి ఉంటారు. చూడటానికి బలహీనంగా ఉంటారు. కొనుగోలు, అమ్మకాలు వ్యవహారాలు కలిగిన వ్యాపారాలలో నిపుణత్వం కలిగి ఉంటారు.

42) నపుంసకాంశ :- పుబ్బ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. కీర్తి ప్రతిష్ఠలు కలిగి ఉంటారు. వికృత రూపం కలిగి ఉంటారు. ఇతరులకు కష్టం కలిగిస్తూ ఉంటారు.

43) అభయాంశ :- పుబ్బ నక్షత్రం తృతీయ పాదం శుక్రుడిది. వీరికి పుత్ర సంతానం అధికంగా కలిగి ఉంటారు. శిల్పశాస్త్రంలో నిపుణులు అవుతారు. గణిత శాస్త్రంలోను నిపుణత్వం కలిగి ఉంటారు.

44) దరిద్రాంశ :- పుబ్బ నక్షత్రం చతుర్థ పాదం కుజుడిది. జీవితంలో సుఖం ఉండదు. నిత్యం కష్టలను అనుభవిస్తారు. అధిక సంతానం కలిగి ఉంటారు. దరిద్రాన్ని అనుబావిస్తూంటారు.

**12) ఉత్తర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

45) ఉత్పన్నాంశ:- ఉత్తర నక్షత్రం ప్రధమ పాదం గురువుది. వీరు వాత రోగం కలిగి ఉంటారు. పరిశుద్ధులు, ప్రబంధ ప్రియులు, కావ్యాస్వాదనా చతురులు కలవారు అవుతారు.

46) పాపాంశ :- ఉత్తర నక్షత్రం ద్వితీయ పాదం శనిది. వీరు పరులను పీడించేవారుగాను, చంచలత్వం కలవారుగాను, నిత్య దరిద్రులుగా ఉందురు.

47) ఉగ్రాంశ:- ఉత్తర నక్షత్రం తృతీయ పాదం శనిది. వీరు మేలు చేసిన వారిని మరిచిపోతారు. చెడు వాదనలు చేసేవాళ్ళు, డాంబికాలు పోతారు, గర్విష్టులు, అందరిని సూటిపోటీ మాటలతో వేదిస్తారు.

48) శుభాంశ :- ఉత్తర నక్షత్రం చతుర్ధ పాదం గురువుది. వీరు వినయ విధేయతలు కలవారు, విద్యా సంపన్నులు అవుతారు. పుత్ర సంతానం కలవారు అవుతారు.

**13) హస్త నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు.**

49) క్రూరాంశ:- హస్తా నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. వీరు పాప కర్మలు చేసేవాళ్ళు, బలవంతులు, చింతన కలవారు అవుతారు.

50) ముక్తాంశ:- హస్తా నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. వీరు నిత్యం మంచి మాటలనే మాట్లాడేవారు, మంధ బుద్ధి కలవారుగాను ఉంటారు.

51) పండితాంశ:- హస్తా నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. వీరు చెడ్డ బుద్ధి కలవారు, కాముకులు, వ్యాపారంలో భాగం అయిన అమ్మకాలు, కొనుగోళ్ళు విషయాలలో మహా నిపుణులుగా ఉంటారు.

52) ధనాంశ:- హస్తా నక్షత్రం చతుర్ధ పాదం చంద్రుడిది. వీరు రాచకార్యాలు చేయుటలో ఇష్టం కలవారు, సన్మానాలు పొందేవారు, అభిమానవంతులు, కొద్దిగా కోపం కలవారుగాను ఉంటారు.

**14) చిత్రా నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

53) రాజాంశ:- చిత్రా నక్షత్ర ప్రధమ పాదం రవిది. వీరు చంచల మనస్తత్వం కలవారుగా ఉంటారు. ఉగ్ర స్వభావం కలవారుగా ఉంటారు.

54) నపుంసకాంశ:- చిత్రా నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. వీరు చాలా తియ్యగా మాట్లాడి జనాలను నమ్మిస్తారు. కోపం వస్తే చాలా కాలం ఉంటుంది. ఈ పనిని ఐనా సరే అధికకాలం అయ్యేటట్లు చేస్తారు.

55) అభయాంశ:- చిత్రా నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. వీరు కీర్తిమంతులు, శౌర్యవంతులు, పండితులతో సహవాసం చేయటం, వారితోనే గడపటం వీరి లక్షణాలు.

56) ధనాంశ:- చిత్రా నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. వీరు చిన్నతనంలోనే దొంగతనాలకు పాల్పడతారు. సరిపడా సంపాదించాక నేరాలు మానేస్తారు. అమిత ధైర్యవంతులు, విక్రమం కలవారుగాను ఉంటారు.

**15) స్వాతి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

57) ఉత్పన్నాంశ :- స్వాతి నక్షత్ర ప్రధమ పాదం గురుడుది. వీరు ఎప్పుడు అతిగా మాట్లాడుతూనే ఉంటారు. సూక్ష్మ పరిశీలన కలవారు. జ్ఞానం కలవారుగాను ఉంటారు.

58) ధనాంశ :- స్వాతి నక్షత్ర ద్వితీయ పాదం శనిది. వీరు చెడ్డపేరు తెచ్చుకుంటారు. దొంగలుగా, వ్యసనపరులుగా పరిణమిస్తారు. సాయం చేసినవారిని మాత్రం మరువరు.

59) ఉగ్రాంస:- స్వాతి నక్షత్ర తృతీయ పాదం శనిది. వీరు మూర్ఖులు, అత్యంత కోపం కలవారు. శత్రువుల పట్ల ద్వేషం పెంచుకునే వారు. అతిగా ఖర్చు పెట్టేవాళ్ళుగా ఉంటారు.

60) ఉత్కృష్టాంశ :- స్వాతి నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. వీరు కోపం కలిగి ఉన్న జనాభిమానం కలవారు. గురుభక్తి కలవారు. ధనికులు అయి ఉంటారు.

**16) విశాఖ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

61) సౌఖ్యాంశ:- విశాఖ నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. పలుచటి ఛాతీ కలిగిన శరీరం. ఎర్రటి కన్నులు కలిగి ఉంటారు. మిక్కిలి ధనవంతులై ఉంటారు.

62) భోగాంశ:- విశాఖ నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. రూప వంతులు, సౌందర్యవంతులు, అందమైన భార్య కాళీ ఉంటారు. సౌఖ్యవంతులు. చెవిటి వాళ్ళుగా గాని, వినికిడి లోపం ఉన్నవారుగా గాని ఉంటారు. దేనిసైనా న్యాయ పరంగా సంపాదింకుసేవాళ్ళు అవుతారు.

63) సౌమ్యాంశ:- విశాఖ నక్షత్రం తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు మంచి చెడు పట్ల విచక్షణ కలిగి ఉంటారు. నేర్పరితనం కలిగి ఉంటారు. దాన గుణవంతులుగా ఉంటారు. కంటి చూపును కోల్పోవటం లేదా లోపం గాని ఏర్పడవచ్చును.

64) అర్ధాంశ:- విశాఖ నక్షత్రం చతుర్ధ పాదం చంద్రుడిది. స్త్రీలను ఆకర్షించువాడు. దృష్టి లోపం కలవాడు. ధన సంపాదన పైన ఆసక్తి కలవాడు అగును.

**17) అనూరాధ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

65) రాజాంశ :- అనూరాధ నక్షత్ర ప్రధమ పాదం రవిది. ఈ జాతకులు మాట్లాడేటప్పుడు వినయ విధేయతలు కలిగి ఉంటారు. నీతి నియమాలు కలిగి ఉంటారు. మంత్రోపాసన చేసేవారు. మంత్రాంగాలు నెరపేవాళ్ళుగా ఉంటారు.

66) నపుంసకాంశ:- అనూరాధ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. ఈ జాతకులు వీణా వాయిద్యాల పట్ల మక్కువ కలిగి ఉంటారు. ఆదర్శమూర్తులు. మేధావులుగా ఉంటారు.

67) అభయాంశ :- అనూరాధ నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. వీరికి స్థిరత్వం ఉండదు. అనుకూలవతియైన భార్య లభిస్తుంది.

68) నీచాంశ:- అనూరాధ నక్షత్రం చతుర్ధ పాదం కుజుడిది. ఈ జాతకులు ఇతరులకు ద్రోహం చేసేవాళ్ళు, కుట్రలు కుతంత్రాలు చేసేవాళ్ళు, దరిద్రులు అవుతారు.

**18) జ్యేష్ఠ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

69) ఉత్పన్నాంశ :- జ్యేష్ఠ నక్షత్ర ప్రధమ పాదం గురువుది. రచనా సామర్ధ్యం కలవారు. హాస్యప్రియులు, గర్వం కలవారుగా ఉంటారు.

70) ఉగ్రాంశ:- జ్యేష్ఠ నక్షత్ర ద్వితీయ పాదం శనిది. ఎప్పుడు ఏదో ఒక అనారోగ్యంతో బాధపడేవారుగాను, ఇతరులకు సులభంగా లొంగిపోయేవారుగాను ఉంటారు.

71) పాపాంశ:- జ్యేష్ఠ నక్షత్ర తృతీయ పాదం శనిది. ఈ జాతకులు అంగవైకల్యం కలిగి ఉంటారు. మరీ అతి స్వల్పమైన భోగం కలిగి ఉంటారు. చూపు సరిగా లేకపోవటం, ఇతరుల పనులు చేయువారు అగుదురు.

72) శుభాంశ:- జ్యేష్ఠ నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. వినికిడి లోపం కలిగి ఉంటారు.ధర్మ శాస్త్రాలపైనా పట్టు కలవారు. పూజలు చేయువారు. శాస్త్రవేత్తలు అవుతారు.

**19) మూల నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

73) తస్కరాంశ:- మూల నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. తండ్రి సహకారం లేనివాడు. వ్యాధిగ్రస్తులుగా ఉంటారు. ధరిద్రులు అవుతారు.

74) భోక్తాంశ:- మూల నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. మాతృసౌఖ్యం లేనివారు, దయామయులు, క్షీరాన్నం, బెల్లం పట్ల మక్కువ కలవారు. వాహన సౌఖ్యం కలవారు. భోగాలను అనుభవించేవారు.

75) విచక్షణాంశ:- మూల నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు ధనవంతులు, ఖర్చు పెట్టే మనస్తత్వం కలవారు. మంచి సంభాషణాపరులు, విద్యావంతులు, జ్యోతిష్య విద్య తెలిసిన వాళ్ళు, ఎదుటి వారు ఏది చెబితే వినగలరో అది చెప్పగలిగే సామర్ధ్యం ఉన్న వారు.

76) ధనాంశ:- మూల నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఈ జాతకులు ప్రభుత్వ ఉద్యోగులు, సేనాపతులు, పరోపకారులు, కామత్వం కలవారు, రోగ సూచనలు కలవారు, ఆడవారి కంఠ స్వరం కలవారు. మెత్తగా మాట్లాడేవారు, లౌకికం కలవారు అవుతారు.

**20) పూర్వాషాడ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

77) ఉత్పన్నాంశ:- పూర్వాషాడ నక్షత్ర ప్రధమ పాదం రవిది. సౌఖ్యత లేనివారు, ఎర్రటి నేత్రాలు కలవారు, శక్తి సామర్ధ్యాలు కలవారు

78) అభయాంశ:- పూర్వాషాడ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. ఈ జాతకులు పెద్ద పొట్ట కలిగి ఉంటారు. ఎప్పుడు మాట్లాడుతూనే ఉంటారు. మృదువుగానే మాట్లాడుతారు. అవతలి వ్యక్తులలోని సద్గుణాలను పసిగడతారు.

79) భాగ్యాంశ :- పూర్వాషాడ నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. ఈ జాతకులు నిత్యం శుచిగా ఉంటారు. దయా హృదయం కలిగి ఉంటారు. భాగ్యవంతులు, చపలచిత్తం కలవారుగా ఉంటారు.

80) ఉగ్రాంశ:- పూర్వాషాడ నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. పండితుల పట్ల ద్వేషం కలవారు. ఉగ్ర స్వభావం కలవారు. పాపకార్యాలు చేయువారు, అబద్ధాలాడటం వీళ్ళ స్వభావంగా ఉంటుంది.

**21) ఉత్తరాషాడ నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

81) ఉత్పన్నాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర ప్రధమ పాదం గురువుది. ఈ జాతకులు బుద్ధిమంతులు. శాస్త్రవేత్తలు, స్థిరాస్తులు కలవారు, పెద్దలయందు భక్తి కలవారు, ధర్మపాలన చేయువారు.

82) పాపాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర ద్వితీయ పాదం శనిది. ఈ జాతకులు పనికి రాని పనులు చేయటంలో సిద్ధహస్తులు. ఇతర మతాలపట్ల ప్రేమాభిమానాలు కలవారు.

83) ఉగ్రాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర తృతీయ పాదం శనిది. స్థూలమైన శరీరం కలవారు. అల్ప సంతోషులు, నిత్యం వ్యాధిగ్రస్తులుగా ఉంటారు.

84) శోభనాంశ:- ఉత్తరాషాడ నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. శుభములు కలవారు, నిత్యం ఏదో ఒక పని చేసేవారు, శాస్త్ర విషయాలపై శ్రద్ధ కలవారు, వ్యాపార లక్షణాలు కలవారు, ఉత్సాహవంతులుగా ఉంటారు.

**22) శ్రావణా నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

85) మంగళాంశ:- శ్రావణా నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. కలహ ప్రియులు, పుత్ర సంతానం లేనివారు, గుల్మరోగం కలవారు అవుతారు.

86) భోక్తాంశ:- శ్రావణా నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. సేవకులతో పని చేయించుకునేవారు. తంత్ర విద్యలపైనా ఆసక్తి కలవారు. కామత్వం కలవారు అవుతారు.

87) విచక్షణాంశ :- శ్రావణా నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు అత్యంత ఉదార స్వభావం కలవారు. చిత్రలేఖకులు, కలహప్రియులుగా ఉంటారు.

88) ధనాంశ:- శ్రవణా నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఈ జాతకులు పసు పోషకులు. యోగులు, ధార్మికులు అవుతారు. ముక్కు పొడవు కలిగి ఉంటారు.

**23) ధనిష్ఠ నక్షత్ర నాలుగు పాదాలకు అంశగుణాలు**

89) రాజాంశ :- ధనిష్ఠ నక్షత్ర ప్రధమ పాదం రవిది. ఈ జాతకులు స్థూలమైన శరీరం కలవారు. దానగుణం కలవారు. స్త్రీలపైన ప్రీతి కలవారు అగును.

90) సౌమ్యాంశ :- ధనిష్ఠ నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. వినయ విధేయతలతో మాట్లాడేవారు. ఉన్నత విద్యలు చదివేవారు అవుతారు.

91) అభయాంశ :- ధనిష్ఠ నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. గుణవంతులు అవుతారు. చిరాయుష్మంతులు అవుతారు. సత్య పలుకులు పలుకువారు అవుతారు.

92) క్రూరాంశ :- ధనిష్ఠ నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. ఈ జాతకులు నిత్యం పాప కర్మలు చేయుటలో లీనమై ఉంటారు. క్రూరమైన స్వభావం కలవారు. స్థూలమైన శరీరం కలవారు అవుతారు.

24) శతభిష నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు

93) ఉత్పన్నాంశ :- శతభిష నక్షత్ర ప్రధమ పాదం గురువుది. ఈ జాతకులు గోవులను పూజించువారు. బ్రాహ్మణులపట్ల గౌరవం కలవారు. సత్యం మాట్లాడువారు. స్థిరమైన బుద్ధి కలవారు, అభిమానవంతులు, స్నేహములను కలిగి ఉంటారు.

94) పాపాంశ :- శతభిష నక్షత్ర ద్వితీయ పాదం శనిది. ఈ జాతకులు పిరికితనం కలిగి ఉంటారు. ఏ పని తొందరగా చేయరు. పాపభీతి కలవారు అగుదురు.

95) భయాంశ:- శతభిష నక్షత్ర తృతీయ పాదం శనిది. ఈ జాతకులు పుత్ర సంతానం కలిగి ఉంటారు. పాండిత్యం కలవారు. మంధబుద్ధికలవారు. పాప కర్మలు చేయువారు. ఉగ్ర కర్మలు చేయువారు అగుదురు.

96) సౌమ్యాంశ:- శతభిష నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. ఈ జాతకులు స్నేహశీలురు, పండితులు, అభిమానవంతులు, యజ్ఞ కార్యాలు చేయువారు.

**25) పూర్వాభాద్ర నక్షత్ర నాలుగు పాదాలకు అంశగుణాలు.**

97) సేవాంశ:- పూర్వాభాద్ర నక్షత్ర ప్రధమ పాదం కుజుడిది. ఈ జాతకులు ఉద్యోగస్తులు, విష్ణు పూజ చేయువారు, భోగులుగా ఉంటారు.

98) భోగాంశ :- పూర్వాభాద్ర నక్షత్ర ద్వితీయ పాదం శుక్రుడిది. ఈ జాతకులు సాహస వంతులు, మంత్రోపాసన చేయువారు, ప్రభుత్వ వ్యతిరేకులుగా ఉంటారు.

99) విచక్షణాంశ:- పూర్వాభాద్ర నక్షత్ర తృతీయ పాదం బుధుడిది. ఈ జాతకులు పితృ ప్రియులు, సుఖవంతులుగా ఉంటారు. జ్ఞానవంతులు, భోగులుగా ఉంటారు.

100) ధనాంశ :- పూర్వాభాద్ర నక్షత్ర చతుర్ధ పాదం చంద్రుడిది. ఈ జాతకులు స్త్రీలపైనా ఆసక్తి కలవారు, అందరి చేత కీర్తింపబడేవారు, ధనవంతులు, మాతృ సేవకులుగా ఉంటారు.

**26) ఉత్తరాభాద్ర నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

101) తీక్షణాంశ:- ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రధమ పాదం రవిది. ఈ జాతకులు పైత్యా శరీరం కలవారు, చపల చిత్తం కలవారు, కోపిష్ఠులు, ఎర్రని నేత్రాలు కలవారు, కృశించిన శరీరం కలవారుగా ఉంటారు.

102) అభయాంశ :- ఉత్తరాభాద్ర నక్షత్ర ద్వితీయ పాదం బుధుడిది. ఇజాతకులు జ్యోతిష శాస్త్ర పండితులుగా గాని, పంచాంగ కర్తలుగా గాని ఉంటారు. జ్ఞాన వంతులు, సౌమ్యమైన గుణం కలవారు, అవతలి వాళ్ళలోని గుణాలను గ్రహించగలిగే సామర్ధ్యం కలవారు అవుతారు.

103) అభయాంశ :- ఉత్తరాభాద్ర నక్షత్ర తృతీయ పాదం శుక్రుడిది. ఈ జాతకులు తెలివితేటలు కలవారు, శాస్త్రవేత్తలు, ధనవంతులు అవుతారు.

104) దీనాంశ:- ఉత్తరాభాద్ర నక్షత్ర చతుర్ధ పాదం కుజుడిది. ఈ జాతకులు చెడు స్నేహాలు కలవారు, శత్రువులు కలవారు, ధనం సంపాదించువారు అవుతారు.

**27) రేవతి నక్షత్ర నాలుగు పాదాలకు అంశ గుణాలు**

105) ఉత్పన్నాంశ :- రేవతీ నక్షత్ర ప్రధమ పాదం గురువుది. ఈ జాతకులు శాస్త్రాలపైనా పట్టు గలవారు, నీటి నియమాలు కలవారు, తాత్వికులు అగుదురు.

106) పాపాంశ:- రేవతి నక్షత్ర ద్వితీయ పాదం శనిది. పాప కర్మలు చేసేవారు, జూదం ఆడేవారు, కుటిలమైన బుద్ధి కలవారు అగుదురు.

107) ఉగ్రాంశ:- రేవతి నక్షత్ర తృతీయ పాదం శనిది. మంధ బుద్ధి కలవారు, సౌందర్యవంతులు, కోప స్వభావం కలవారు అగుదురు.

108) శోభనాంశ :- రేవతి నక్షత్ర చతుర్ధ పాదం గురువుది. ఈ జాతకులు యజ్ఞ యాగాదులు చేయువారు, దైవ కార్యాలు చేయువారు, పండితులు, వేదాంతులు, ధైర్యవంతులు అవుతారు.

## జ్యోతిషంలోని నక్షత్రాల ఆకృతులు అధిదేవతలు

మొత్తం 27 నక్షత్రాలు  అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ (పూర్వఫల్గుణి), ఉత్తర (ఉత్తరఫల్గుణి), హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ట, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.  ప్రతిరాశిలో మూడు నక్షత్రాలు తొమ్మిది పాదాల చొప్పున మన పూర్వీకులు విభజన చేయడం జరిగింది.

**మేషరాశిలో నక్షత్రాలు**

మేషంలో అశ్వని ,భరణి,కృత్తిక మొదటి పాదం ఉంటుంది. అశ్వినికి అశ్విని దేవతలు, భరణికి యముడు, కృత్తికకు అగ్నిదేవుడు అధిదేవతలు. దీనికి లాటిన్ ఎరిస్ అని పేరు. అశ్విని చుక్కలు గుర్రపు తల ఆకారాన్ని కలిగి ఉంటుంది. వేదంలో అశ్వని నక్షత్ర ప్రస్థావన అలాగే మంత్రం మనకు కనభడుతుంది. భరణి పోయిరాళ్ళుగా మూడుచుక్కల సమూహం. కృత్తిక నక్షత్రం మంగళికత్తి ఆకారంలో ఉంటుంది.

**వృషభరాశిలో నక్షత్రాలు :-**

రాశులలో రెండవది వృషభం. ఈ రాశిలో క్రుత్తికలోని మూడుపాదాలు, రోహిణి , మృగశిరలోని రెండు పాదాలు వస్తాయి. కృత్తికనక్షత్రం అరుచుక్కల సమూహం. రోహిణి నక్షత్రంలో అయిదు చుక్కలు ఉంటవి. రోహిణి నక్షత్రం ఉదయించేటప్పుడు A అక్షరం మాదిరిగా అస్తమించేటప్పుడు V అక్షరం మాదిరిగా కనభడుతుంది. రోహిణికి ఆధిదైవం ప్రజాపతి. రోహిణి నక్షత్రాన్ని ప్రజాపతికి కూమర్తెగా మన పురాణాలు తెలియజేసాయి.  మృగశిరానక్షత్రం మృగం ఆకారంలో ఉంటుంది. దీనికి అధిదేవత సోముడు. కొంతమంది యజ్ఞోపవీతాన్ని ధరించిన పురుషుడు అని మరికొందరు మృగరూపం దాల్చిన ప్రజాపతి అన్నారు.

**మిథునరాశిలో నక్షత్రాలు :-**

మిథునరాశిని గమనిస్తే మృగశిర చివరి రెండు పాదాలు,ఆరుద్రనక్షత్రంలోని 4 పాదాలు అలాగే పునర్వసు నక్షత్రంలోని మూడుపాదాలు ఉంటాయి. ఆరుద్రనక్షత్రం దీనినే ఆ నక్షత్రం యొక్క రంగును బట్టి పగడపుచుక్క అన్నారు. ఆరుద్రకు రుద్రుడు అధిపతి యోరోపియన్లు ఈ నక్షత్రాన్ని బీటల్ జూ అంటారు. తెలుగుప్రాంతంలో గొల్లకావిడి చుక్కలు అంటారు. జ్యోతిషం ప్రకారం రుద్రుడే శివుడు దానిపైన ఉన్న నక్షత్రం మృగశిర అంటే చంద్రుడు అంటే శివునిపైన ఉన్న తలలో ఉన్న చంద్రుడుగా అభివర్ణిస్తారు. కాస్టర్ ,పోలాక్స్ ,పోస్వాన్ చుక్కలు కలిపి చేపలాగ పునర్వసు నక్షత్రం ఉంటుంది. అధితిదేవి ఈ నక్షత్రానికి అధిదేవత. అదితికి ఉన్న ప్రాదాన్యం ఏమిటంటే యజ్ఞాయాగాది క్రతువులు అదితితో ఆరంభం అయ్యి అధితితోనే పూర్తిఅవుతాయి.

**కర్కాటక రాశిలో నక్షత్రాలు :-**

కార్కాటక రాశిలో  నాలగవ రాశి. ఈ రాశిలో పునర్వసు నాల్గవ పాదం,పుష్యమి నాలుగు పాదాలు,ఆశ్లేష నాలుగు పాదాలు ఉంటాయి. ఇందులో పుష్యమి నక్షత్రానికి సిద్ధయ,అంగీరస,పోట్లపువ్వుచుక్క అని పేర్లు ఉన్నాయి. తదుపరి ఆశ్లేష నక్షత్రం ఈ నక్షత్రం సర్పదేవత అయిన ఆశ్రేశ అని అసిలెరని. సర్పపుచుక్క అని అంటారు. అశ్లేషతో వినాయకుడు ఉదయించుట వలన అతను నాగయగ్నిపవితుడు అయినాడు. హైడ్రాగుంపులోని డెల్టా, ఎప్సిలాన్, ఈట ,ల రో జీటా గుర్తులు కలవి ఆశ్లేషచుక్కలు. కర్కాటకం అంటే ఎండ్రకాయ అని అర్థం.

**సింహరాశిలో నక్షత్రాలు :-**

సింహరాశిని గమనిస్తే మఘ 4 పాదాలు , పుబ్బ 4 పాదాలు, ఉత్తర 1 పాదం కలిసి ఉన్నాయి. మఘనక్షత్రానికి పల్లకీబొంగు చుక్క ,పితురుల చుక్క అనే పేర్లు ఉన్నాయి. ఈ నక్షత్రానికి పితృదేవతలే ఆధిదైవాలు. పల్లకి ఆకారంలో అయిదు చుక్కలు ఈ నక్షత్రంలో ఉన్నాయి. మహాకాంతి నక్షత్రం అయిన ఆల్ఫా చుక్క యోగాతార మఘ . పూర్వంలో దక్షిణాయనం మఘుకార్తితో ఆరంభం అయ్యేది కావున పితృదేవతలు అధిదేవతలు అయ్యారని తైత్తరీయసంహిత చెబుతున్నది. తదుపరి పుబ్బ దీనినే పూర్వఫల్గుణి అంటారు. దీనికే పోద్దురిక్క అనే పేరు కలదు. దీనికి అధిదేవత భగుడు. మేషంను ఉదయించే సమయం గా చెబితే సింహం అస్తమించే సమయం.

**కన్యారాశి నక్షత్రాలు :-**

ఉత్తర మిగిలిన మూడు పాదాలు,హస్తాలోని నాలుగు పాదాలు,చిత్తా నక్షత్రంలోని రెండు పదాలు కాన్యారాశి. కన్యఆకారంలో ఈ రాశినక్షత్రాల సమ్మేళనం ఉంటుంది కావున ఆ పేరు వచ్చింది. కన్యారాశికి రోదశి,అరమతి అను పేర్లు కలవు. కాన్యరాశిలో spica స్టార్ ఉంటుంది. హస్తానక్షత్రానికి కైనాటిరెక్క అని పేరు. హస్తా నక్షత్రం అరచేతి రూపం. అయిదు చుక్కలు హస్త అని తెలుస్తుంది. హస్తకు ఆదిదైవం సూర్యుడు. చిత్తానక్షత్రం ముత్తెపుసవతు రిక్క అని పేరు. చిత్తాకు విశ్వకర్మ అదిదైవం.

**తులారాశిలో నక్షత్రాలు :-**

చిత్తానక్షత్రంలోని రెండు పాదాలు, స్వాతి నక్షత్రం, విశాఖనక్షత్రంలోని మూడు పాదాలు ఈ రాశికి చెందుతాయి. స్వాతి నక్షత్రాన్ని కరువలి రిక్క అని పిలుస్తారు. స్వాతికి నిష్ట్య అనే పేరు కూడా ఉంది. దీనికి ఆదిదైవం వాయువు. భూతేశమండలంలోని తొలి అవడం చేత ఆల్ఫాభుటీస్ అని ఆర్క్ చూరస్ అనీ పేర్లు కలవు. ఏకాదశ రుద్ర రూపాల్లో ఈ భూతేషుడు ఒకరు. విశాఖనక్షత్రం కు జోడుపేల్పుల రిక్క అని పేరు. ఆకారాన్ని బట్టి చేటరిక్క, కమ్మరిసారే అని పేరులు ఉన్నాయి. విశాఖకు ఇంద్రాగ్నులు అధిదైవం. కుమ్మరిసారె రూపంలో గుండ్రంగా అమరిఉన్న అయిదు చుక్కలు ఉండటం వలన విశాఖ కులలచక్ర పంచ అన్నారు. ఖగోళ తులారాశిలో తక్కెడ రూపంలో ఉన్నరూపమే విశాఖ. సూర్యుడు తులరాశిలోకి ప్రవేశించినపుడు సమస్త లక్షణాలు సరిసమానం అవుతాయి. సూర్యుడు తులారాశిలో ఉన్నపుడు పగలు, రాత్రి సమానంగా ఉంటాయి.

**వృశ్చికరాశిలోని నక్షత్రాలు :-**

విశాఖ చివరిపాదం, అనురాధ నక్షత్రం, జ్యేష్ట నక్షత్రం లోని నాలుగు పాదాలు. అనురాధ కు చెలిమిచుక్క అని , తోరనపు చుక్క అని పేరు. అనురాధకు అధిదైవం మిత్రుడు. వృశ్చికరాశిలోని బీటా , డెల్టా , పై సంజ్ఞలు గల చుక్కలు అనురాధ

నక్షత్రపు చుక్కలు. చత్రకార త్రయం మూడుచుక్కలు గొడుగు ఆకృతిలో కనభడుతాయి. జ్యేష్ట నక్షత్రంనకు తాతిరిక్క అనే పేరు కలదు. జ్యేష్ట వృశ్చికరాశిలో తోలి చుక్క. దీన్నే ఆల్ ఫా స్కార్పియో అని అంటారు. ఆల్ ఫా , సిగ్మా , టౌ గుర్తులున్న నక్షత్రాలు కలిసి జ్యేష్ట అనే గుంపు ఏర్పడింది. అధిదైవం ఇంద్రుడు. ఈ నక్షత్రం సూర్యుని కన్నా తొమ్మిది కోట్ల రెట్లు పెద్దది.

**ధనుస్సు రాశిలోని నక్షత్రాలు : -**

ధనుస్సురాశిలో మూలానక్షత్రంలో 4 పాదాలు, పూర్వాషాడ 4 పాదాలు, ఉత్తరాషాడ మొదటిపాదం ఉంటాయి. మూలానక్షత్రానికి నోకురిక్క అని పేరు. ఈ నక్షత్రానికి నిరృతి , పితురులు అధిపతులు. తేలుకోండి ఆకారంలోని 11 నక్షత్రాల సమూహం మూల అవుతుంది. వృశ్చికపు తోకలోని చిట్టచివరి అయిదు చుక్కలు కలిసి మూల అవుతుంది. పూర్వషాడకు నీటిచుక్క అనే పేరు. జలదేవత ఈ నక్షత్రానికి అధిపతి. డెల్టా , ఎప్సిలాన్ చుక్కలు కలిసి పూర్వాషాడ అవుతుంది.

**మకరరాశిలోని నక్షత్రాలు :-**

ఉత్తరాషాడలోని చివరి మూడుపాదాలు , శ్రవణంలోని 4 పాదాలు, ధనిష్ట నక్షత్రంలోని మొదటి రెండు పాదాలు ఈ రాశికి చెందుతాయి. వేదకాలంలో ఈ రాశిని అజం అనేవారు. మకరం పైన మేక క్రిందిభాగంలో చేపఆకారంలో ఉంటుంది. ఉత్తరాషాడ నక్షత్రం వంపులతో కనబడుతుంది. అందుకే దీనిని ఏచకంకటి చుక్క అంటారు. కీత.ఒమ్రికాన్ గుర్తులు గల చుక్కలు ఉత్తరాషాడ. దీనికి అధిదేవతలు విశ్వదేవతలు. శ్రవణం నకు శ్రోనా అని అశ్వథామ అని పేరు కలవు. దీని ఆదిదైవం విష్ణుభగవానుడు. ఈ నక్షత్రాన్ని కరివేలుపు చుక్క అంటారు. మూడు నక్షత్రాల గుంపు కలది. గడుద గుంపులోని అల్పాచుక్క.

**కుంభరాశి నక్షత్రాలు : -**

ధనిష్టా నక్షత్రంలోని 3,4 పాదాలు , శతభిషం లోని నాలుగు పాదాలు , పూర్వాభాద్రలోని మొదటి మూడు పాదాలు కలిపితే కుంభరాశి అవుతుంది. ధనిష్టకు మద్దెలరూపు చుక్క అనే పేరు కలదు. ఈ నక్షత్రం అధిదేవత అష్టవసువులు. శీర్షత్రయ మంటే మూడుతారలతొ కూడి ఉంటుంది. ధనిష్ట గోలాకానికి చెందిన నక్షత్రం. శతభిషకు నీతిరెక్క అని పేరు. అధిదైవం వరణుడు. శతంతారః అంటే వంద తారల గుంపు అని అర్థం.

**మీనరాశిలో నక్షత్రాలు :-**

పూర్వాభాద్ర నక్షత్రంలోని నాల్గవ పాదం , ఉత్తరాభాద్ర పాదాలు, రేవతి లోని నాలుగు పాదాలు ఈ రాశికి చెందుతాయి. పూర్వభాద్రకు కాళ్ళరిక్క అనిపేరు కలదు. ఉత్తారభద్రకు ముక్కంటిరిక్క అనిపేరు. రేవతికి కడచిక్క అనిపేరు. రేవతికి కొసరిక్క, మీనరూపు చుక్క అనిపేరు. పూర్వాభాద్రకు అజైకపాదుడు, ఉత్తరాభాద్రకు అహిర్భద్యుడు , రేవతికి పూషుడు అధిదైవాలు. మీనరాశిలోని రెండు చేపలు ఉంటాయి.

## అధిక ధన యొగములు.

1) ధనాధిపతి, ధనకారకుడు ---- 10 4 9 అధిపతులతో కలసి వుంటే జాతకుడు అధిక ధనవంతుడు అగును.

2) 1,2,9,11 ఉచ్చ పోంది లాభాధిపతి వైశేషికాంశ పోందిన జాతకుడు అధిక ధనవంతుడు అగును.

3) 9 అధిపతి ఉచ్చ స్థితి లోను లాభాధిపతి వర్గోతౌమంశ లోను రవి 4 వ భావం లో వుండుట వలన జాతకుడు అధిక ధనవంతుడు అగును.

4) 2,9,11అధిపతులకు బలమైన సంబంధం కలిగి ఉండుట వలన జాతకుడు అధిక ధనవంతుడు అగును.

5) లగ్నాధిపతి బలవంతు డై భాగ్యాధిపతి తో యతి వలన జాతకుడు ధనవంతుడు అగును.

6) లగ్నాధిపతి 2 భావం లో ధన స్థానాధిపతి కేంద్ర లోను శుక్రుడు దశమ భావం లో వుండుట వలన జాతకుడు అధిక ధనవంతుడు అగును.

7) భాగ్యాధిపతి గాని శుక్రుడు గాని స్వ క్షేత్రం లేదా ఉచ్చ యందు ఉంది, అవి కేంద్ర కోణము లు అయితే అది లక్ష్మి యోగం.

8) ఇందు లగ్నం లో ఉచ్చ గ్రహం ఉన్న జాతకుడు అధిక ధనవంతుడు అగును.

## రోగ నివారణమును గూర్చి తెలుసు కోనుటకు.

కుజ నక్షత్ర నుండి నాటి నక్షత్ర వరకూ లెక్కించగా

1 , 2,3 అయితే మృతి లేదా  అధిక చికాకు.

4, 5, 6, అయితే ఔషధ సేవ

7,8,9 అయితే  వ్యాధి

10, 11, 12 అయితే సౌఖ్యము

13, 14,15 అయితే గమనము

16 ,17, 18 అయితే  దుఃఖం

19 ,20,21 అయితే శరీర పుష్టి

22 ,23,24 అయితే సంభోగం

25 ,26,27 అయితే  వాంఛ సేర పేరుట.

## యొగములు

(1) **సరస్వతి యొగము:-** శుభ గ్రహము లైన గురు,శుక్ర,బుధలు 1,2,4,5,7,9,10 స్థానములలో ఏ స్థానమున అయినను వుండి గురుడు ఉచ్చ రాశి యందు గాని మిత్ర క్షేత్రము నందు గాని వున్నచో సరస్వతి యొగము కలుగును.

ఈ యొగము వలన కవులు,పండితులు,అనేక శాస్త్రములు చదివినవారు,నేర్పు, మంచి కళత్రము లవారును అగుదురు.

(2) **త్రిలోచన యొగము:-** రవి,చంద్ర,కుజులు పరస్పర త్రికోణ రాశులలో వుండినచో త్రిలోచన యొగము వర్తించును.

ఈ యొగము వలన శతృవులకు సింహస్వప్నం వలె నుండుట, ధన సంపాదన, మానసిక బలము,తెలివి తెలివితేటలు, శతృవులపై విజయము సాధించువారును, మంచి ఆరోగ్యము, ఐశ్వర్యము కలవారును అగుదురు

(3) **కేమద్రుమ యెగము:-** చంద్రడున్న స్థానమునకు 2,12 స్థానముల యందు గ్రహములు లేకుండుట వలన కేమద్రుమ యెగము కలుగ గలదు. ఈ యెగము వలన విరుద్దమైన వృత్తులు యందు వుండుట, దుష్ట వేషముల నవలంబించుట, దారాపుత్ర సంపద లేకుండుట, మలినులు, విదేశములందు నివసించు వారునుఅగుదురు.

చంద్రుడున్నస్థానమునకు 2,12 స్థానములందు గ్రహములు లేనప్పటికిని, పాప శుభ గ్రహములలో యేగ్రహములచే నైనను చంద్రడు చూడబడిన కేమద్రుమ యెగము భంగమై జాతకులను చక్రవర్తిని, ధీర్ఘాయుష్మంతుని చేయును.

చంద్రుడున్న స్థానమునకు 2, 12 స్థానములయందు ఏ గ్రహములు లేనప్పటికీ 4 కేంద్రముల యందు పాప, శుభ గ్రహములు ఏవియున్నను కేమద్రుమ యెగము భంగమై "కల్పద్రుమ"యెగము కలుగును. ఈ యెగము వలన జాతకులకు ఎల్లప్పుడూ శుభ ఫలితములు కలుగును.

జన్మకాలమందు తులారాశి లో గురు కుజు లను, కన్యారాశిలో రవి యుండి, మేషరాశి యందుడు చంద్రనకు (బుధ, శని, శుక్రులు) ఇతర గ్రహ ధృష్ఠి వున్నప్పుడు కేమద్రుమ యెగము భంగమగును. శుక్రుడు, బుధుడు, గురుడు కలసి లగ్నమునకు కేంద్ర స్థానముల యందున్నను, చంద్రుడు పూర్ణుడైనను ఆ చంద్రునకు కేంద్రములందు గ్రహములున్నను యెగ ఫలితములుండును.

## ద్వాదశ భావాలు - సంక్షిప్త విశ్లేషణ

**ఒక భావానికి మరో భావానికి సంభందం ఎలా ఉందో చూడండి**

జాతకుడు బాగుండాలంటే, జాతకుని యొక్క తనూ భావము (లగ్నము) బాగుండాలి. తనూ భావము బాగుండాలంటే వ్యయ స్థానము (ద్వాదశ భావము ) బాగుండాలి. ఎలాంటి ఇబ్బందులు లేకుండా వ్యయము చేయగలగాలంటే బాగా లాభాలు లేదా సంపాదన బాగుండాలి. అంటే లాభ స్థానము (ఏకాదశి భావము) బాగుండాలి. లాభాలు లేదా సంపాదన బాగుండాలంటే వృత్తికి సంబందించిన (దశమ భావము) బాగుండాలి. వృత్తి అనగా, వ్యాపారము కావచ్చు, ఉద్యోగము కావచ్చు, నైపుణ్యము కావచ్చు. దశమ భావము బాగుండాలంటే, అందుకు అతడు లేదా అతని తల్లిదండ్రులు ఎంతో పుణ్యము చేసుండాలి. ఇందుకు నవమ భావము బాగుండాలి. నవమ భావము బాగుండాలంటే, జాతకుడు ఎంతో కష్టపడాలి, ఇబ్బందులను ఎదుర్కోవాలి. దీనికి అష్టమ భావము (ఆకస్మిక ధన లాభము, స్పెకులేషన్ మొ. కూడా) బాగుండాలి. అష్టమ భావము బాగుండాలంటే సప్తమ భావము (కళత్రము, సంబందాలు, రిలేషన్స్) బాగుండాలి. సప్తమ భావము బాగుండాలంటే శత్రు, రోగ, ఋణ స్థానము (6వ భావము) బాగుండాలి. అందుకు జాతకుని యొక్కఆలోచన సరళి, సంతానము (పంచమ భావము) బాగుండాలి. అందుకు తల్లి ప్రేమ, సౌఖ్యము, విద్య, ఆహారనియమాలు మొ. (చతుర్ధ భావము) తోడ్పడుతుంది. దానికి అందరి సహకారము (తృతీయ భావము) కావాలి. సహకారము పొందాలంటే ధనము, మంచి వాక్కు (ద్వితీయ భావము) కలిగి ఉండాలి.

ద్వాదశ భావాలలో ఒక భావమునకు మరొక భావమునకు అంతర సంబందము కలిగి ఉంటుంది. కావునజాతకులు మంచి వాక్కు, నడవడి, ప్రవర్తన కలిగి ఉండవలెను.

**వివాహ పొంతన సమగ్ర పరిశీలన.**

జీవితంలో వివాహం అనేది ఒక ముఖ్య వ్యవహారం.వదూవరుల మద్య భావాలు కలసి, భావైక్యత ఉందో లేదో తెలుసుకొని వివాహం చేస్తే జీవితం అన్యోన్యంగా ఉండేందుకు అవకాశం ఉంది.దీనికి ముఖ్యంగా లగ్నాన్ని,సప్తమభావాన్ని పరిగణలోకి తీసుకుంటారు.లగ్నంలో తాను,సప్తమంలో భార్య,లేదా భర్త సామాజిక సంబంధాలు ఉన్నాయి.కానీ ఏ ఇద్దరి మద్య అభిప్రాయాలు అన్నీ విషయాలలో ఏకీభవించకపోవచ్చు.అయితే కొన్ని ముఖ్యమైన అభిప్రాయాలు కూడా ఏకీభవించకపోతే కలసి జీవించటం కష్టం.

చంద్రుడు మనఃకారకుడు కావటం వల్ల చంద్రుడున్న నక్షత్రాన్ని,రవి ఆత్మ శక్తికి కారకుడు కావటం వల్ల రవి ఉన్న నక్షత్రాన్ని, లగ్నం శరీరశక్తి కావటంవల్ల లగ్నాన్ని పొంతన చూడాలి అని చెప్పిన అనుభవజ్ఞుల అభిప్రాయం మంచిదనిపిస్తుంది.

ఇరువురి రాశిచక్రాలలో చంద్ర స్థానాధిపతుల,లగ్నాధిపతుల,రవి స్థానాదిపతుల మైత్రి ఉంటే వారిద్దరి మద్య అవగాహన,మానసికమైన ఏకీకృత ఆలోచనా విధానం,శారీరక విషయాలలో లోపాలు లేకుండటం మొదలైన అంశాలు ప్రత్యేకంగా గుర్తించబడతారు.

ఇటువంటి విశేషాలతో కూడుకున్న మేలాపలకం అనేది సైద్ధాంతిక ప్రాతిపదికలతో కూడుకున్నటువంటిది.బాల్యవివాహాలు ఆచారంగా ఉన్న రోజుల్లో వేరు పిల్లల మధ్యలో అవగాహన కలిగించటానికి ఏర్పాటు చేసుకున్న ఆరోగ్యకరమైన ఆనందకరమైన విధానమే ఈ మేలాపలకం.ఈ మేలాపలకం సరిగా ఉంటే వ్యక్తుల శరీర మానసిక ఆత్మిక ధోరణులలో ఐక్యత ఉండి దాదాపుగా ఇద్దరి ఆలోచనా ప్రవృత్తుల్లో ఆనందదాయకమైన ఫలితాలు ఏర్పడతాయి.లేకుంటే బలవంతంగా భావాలను,శరీరాలను పంచుకోవాల్సి రావటం వల్ల అక్రమ విధానాలకు,ఇబ్బందులకు వ్యక్తులు పాల్పడుతుంటారు. ప్రాశ్చాత్యులు కూడా ప్రస్తుత కాలంలో వివాహాల విషయంలో మేలాపకాదులను గమనిస్తున్నారంటే వారి విధానాల నుండి మన వైజ్ఞానిక మేలాపాక విధానం,సంప్రదాయ ఆరోగ్యవంతమైన జీవన విధానం వైపు వారు చూసే చూపును మనం అర్ధం చేసుకోవచ్చును.

చాలా మంది పంచాంగంలో పాయింట్లు చూసి 18 కన్నా ఎక్కువ ఉన్నాయి కాబట్టి జాతకాలు కుదిరాయనుకుంటారు. ఈ నిర్ణయం చాలా తప్పు. అష్టకూటములలో సంతానం, వైదవ్యం, ద్వికళత్రయోగం లాంటివి తెలుసుకోవటానికి అవకాశం లేదు. ఉదా:- సప్తమస్థానంలో కుజ,శుక్రుల సంయోగం ఉండి పాప వీక్షణ ఉన్న దాంపత్య జీవితంలో ఇబ్బందులు ఉంటాయి. స్థానంలో రాహు, కేతువులు, కుజుడు, శని గాని ఉండి పాప వీక్షణ ఉన్న సంతాన నష్టం, మృతశిశువు, గర్భస్రావం జరిగే అవకాశాలు ఎక్కువ. ఇవి ఏవి అష్టకూటముల ద్వారా నిర్ణయించలేము.పాయింట్లు బాగున్నాయని వివాహం చేసుకోవచ్చని వివాహ నిర్ణయం చేయరాదు. 36 పాయింట్లకు 34 వచ్చిన జాతక చక్రంలో అనుకూలంగా లేకపోతే ఉపయోగంలేదు.

వివాహ పొంతన విషయంలో తప్పనిసరిగా వదూవరులిద్దరి జాతకచక్రంలో పంచమం (సంతానం కోసం), సప్తమ స్థానం (దాంపత్య జీవితం), అష్టమ స్థానం (వైదవ్యం), దశ, అంతర్దశలు (వివాహానంతర జీవితం) తప్పని సరిగా పరిశీలించి నిర్ణయం తీసుకోవాలి. పాయింట్లకు ప్రాదాన్యత ఇవ్వరాదు.తారాబలం, గ్రహమైత్రి, నాడీమైత్రి బాగుండి జాతకచక్రం అనుకూలంగా ఉన్నప్పుడు వదూవరులిద్దరికి పొంతన కుదిరినట్లే.

వధూవరులకు వివాహ పొంతన చూసేటప్పుడు ముఖ్యముగా 8 కూటములను పరిగణన లో తీసుకొన్నారు .

(1) వర్ణకూటమి (2) వశ్యకూటము (3) తారాకూటమి (4) యోనికూటము (5) గ్రహకూటమి (6) గణకూటమి (7) రాశికూటమి (8) నాడీకూటమి

వీటిలో మొత్తం 18 గుణాలు దాటితే శుభం అనేది సామాన్య వచనం, కానీ సప్తమ, పంచమ, అష్టమ భావాలు సంపూర్ణ శుభత్వం ఉంటే వివాహం చేయవచ్చు. ఒక వేళ జన్మ నక్షత్రం తెలియకపోతే నామ నక్షత్రాన్ని అనుసరించి చూడాలి.

వర్ణకూటమి : స్త్రీ పురుషులు ఇద్దరు ఒకే వర్ణమునకు చెందిన వారయితే మంచిది.

కర్కాటకం, వృశ్చికం, మీన రాశుల వారు బ్రాహ్మణ వర్ణం.
మేషం, సింహం, దనస్సు రాశుల వారు క్షత్రియ వర్ణం.
మిధున, తుల, కుంభ రాశుల వారు వైశ్య వర్ణం.
వృషభ, కన్య, మకర రాశులు శూద్ర వర్ణం.

వదూవరులు ఇద్దరు ఏక వర్ణమైన ఉత్తమం.వధువు వర్ణం కంటే వరుడి వర్ణం ఎక్కువైన మద్యమం.వరుని వర్ణం కంటే వధువు వర్ణం ఎక్కువైన వర్ణ పొంతన కుదరదు.

**2) వశ్యపొంతన :** మేషరాశికి - సింహము ,వృశ్చికం, వృషభ రాశివారికి – కర్కాటక ,తులారాశులు , మిదునమునకు – కన్యరాశి, కర్కాటకరాశికి – వృశ్చికం, ధనుస్సు , సింహరాశికి – తులారాశి , కన్యకు – మిధున , మేషములు , తులా రాశికి – కన్య, మకరం, వృశ్చికరాశికి – కర్కాటకం ,ధనుస్సుకు – మీనము , మకర రాశికి – మేషం , కుంభం కుంభరాశికి – మేషము , మీనమునకు – మకరం ఈ విధంగా పై రాశులు వశ్యము కలిగి ఉన్నవి . వధూవరులు ఇద్దరి రాశులు వశ్య పొంతన కలిగి ఉండవలెను .మిధున,కన్య,తుల నర రాసులు.వీటికి సింహం తప్ప తక్కినవన్నీ వశ్యములే.సింహానికి వృశ్చికం తప్ప అన్నీ వశ్యాలే.

**3) తారా పొంతన :** స్త్రీ జన్మ నక్షత్రమునుండి పురుషుని జన్మ నక్షత్రము వరకు లెక్కించిన సంఖ్యను 9 చే భాగించగా 1, 3, 5, 7 శేషము వచ్చిన తారలు మంచివి కావు. అను జన్మతారలో చేసుకోవచ్చును.శుభతారలైతే 3 గుణాలు,అశుభ తారలైతే 1 న్నర గుణాలు ఉంటాయి.

**4) యోనిపొంతనము :**
అశ్వని,శతభిషం-గుఱ్ఱం
స్వాతి,హస్త-ఎద్దు
ధనిష్ట,పూర్వాభాద్ర-సింహం
భరణి,రేవతి-ఏనుగు
పుష్యమి,కృత్తిక-మేక
శ్రవణం,పూర్వాషాడ-కోతి

ఉత్తరాషాడ,అభిజిత్-ముంగీస

రోహిణి,మృగశిర-పాము

జ్యేష్ఠ,అనూరాధ-లేడి

మూల,ఆరుద్ర-కుక్క

పునర్వసు,ఆశ్లేష-పిల్లి

మఘ,పుబ్బ-ఎలుక

విశాఖ,చిత్త-పులి

ఉత్తర,ఉత్తరాభాద్ర-ఆవు

పులి – ఆవు , పిల్లి – ఎలుక , లేడి – కుక్క , గుఱ్ఱము – దున్న , పాము – ముంగిస , సింహం – ఏనుగు , కోతి- మేక ఇవి విరోధ జంతువులు. వధూవరుల ఇరువురు నక్షత్రములు విరోధ జంతువులకు సంబంధించినవి కాకూడదు.ఒకే యోని అయితే సంపద,భిన్న యోనులైతే శతృత్వం లేకపోతే మద్యమం,రాశి కూటం,వశ్య కూటం అనుకూలమైతే యోనికూటం కుదరకున్నా దోషం లేదు.

**5) గ్రహకూటమి :**

సూర్యుడు – శని , చంద్రుడు – బుధుడు , కుజుడు –బుధుడు .గురుడు –శుక్రుడు ఈ పైన తెలిపిన గ్రహములు ఒకరికొకరు పరస్పం శత్రువులు గ్రహ కూటమి ని చూసేటప్పుడు పై విధంగా ఉండ కూడదు.

వధూవరుల రాశులకు అన్యోన్యమైత్రి ఉత్తమం,సమమైత్రి మద్యమం,పరస్పర సమత్వం కనిష్ఠం,పరస్పర శతృత్వం మృత్యుపదం,శతృత్వం కలహప్రదం.

**6) గణ కూటమి :-**

స్వగుణం చోత్తమం ప్రీతి మధ్యమం దైవమానుషం

అధమం దేవదైత్యానాం మృత్యుర్మానుష రాక్షసం.

వధూవరుల జాతకం పరిశీలించేటప్పుడు వరుని యొక్క మనస్తత్వం నిర్ణయించటానికి అతని జన్మ నక్షత్రం ఆదారంగా నిర్ణయించవచ్చు. నక్షత్ర విభజన వారి మనస్తత్వ ప్రకారం విభజించబడింది.వధువు నక్షత్రంతో వరుని నక్షత్రం సరిపోతుందో లేదో చూడాలి కానీ వరుని నక్షత్రంతో వధువు నక్షత్రాన్ని పోల్చకూడదు. నక్షత్రాలు 27 .నక్షత్రాలను మూడు భాగాలుగా చేశారు.

దేవగణ నక్షత్రాలు:-అశ్వని,మృగశిర,పునర్వసు,పుష్యమి,హస్త,స్వాతి,అనురాధ,శ్రావణం,రేవతి

దేవగణ నక్షత్ర జాతకులు సాత్విక గుణం కలిగి ఉంటారు.శాంత స్వభావం కలిగి ఉంటారు.పరోపకారులై ఉంటారు.ఓర్పు,సహనం కలిగి ఉంటారు.

మనుష్యగణ నక్షత్రాలు:-భరణి,రోహిణి,ఆరుద్ర,పుబ్బ,ఉత్తర,పూర్వాషాడ,ఉత్తరాషాడ,పూర్వభాద్ర,ఉత్తర భాద్ర

మనుష్యగణ నక్షత్ర జాతకులు రజో గుణ లక్షణాలు కలిగి ఉంటారు.మంచి చెడు రెండు కలిగి ఉంటారు.భాదించటం,వేధించటం చేయరు.ఎవ్వరికీ హాని తలపెట్టరు.

**రాక్షస గణ నక్షత్రాలు:-** కృత్తిక, ఆశ్లేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ట, శతబిషం
రాక్షసగణ నక్షత్ర జాతకులు తామస గుణ లక్షణాలు కలిగి ఉంటారు.అసూయ ద్వేషాలు కలిగి ఉంటారు.కఠినంగా మాట్లాడుతారు.మిక్కిలి స్వార్ధపరులు.

వధూవరులిద్దరిది ఒకే గణమైతే వారిద్దరి మధ్య సహకారం,ప్రేమానురాగాలు ఉంటాయి.వధువుది మనుష్య గణమై వరునిది రాక్షస గణమైతే వారిద్దరిమధ్య బొత్తిగా అవగాహన లేకపోవటం ,ఆమెకు విలువ ఇవ్వక తన ఇష్టానుసారం ప్రవర్తిస్తాడు. వధువుది దైవగుణం వరునిది రాక్షసగణం అయితే సంసారంలో అసంతృప్తి ఎక్కువగా ఉంటుంది.భార్యాభర్తల మధ్య పొందిక కుదరదు.

**7. రాశి పొంతనము :**
వధూవరుల జన్మ రాసులు ఒకదానికొకటి 6-8 అయితే మృత్యువు,5-9 అయితే సంతాన హాని,2-12 అయితే నిర్ధనత్వం.

**ప్రీతి షడష్టకం:-** మేషం-వృశ్చికం,మిధునం-మకరం,సింహం-మీనం,తుల-వృషభం,ధనస్సు-కర్కాటకం-కన్య.
**మృత్యు షడష్టకం:-** మేషం-కన్య,మిధునం-వృశ్చికం,సింహం-మకరం,తుల-మీనం,ధనస్సు-వృషభం,కుంభం-కర్కాటం.
**శుభ ద్విర్ద్వాదశం:-** మీనం-మేషం,వృషభం-మిధునం,కర్కాటకం-సింహం,కన్య-తుల,వృశ్చికం-ధనస్సు,మకరం-కుంభం.
**అశుభ ద్విర్ద్వాదశం:-** మేషం-వృషభం,మిధునం-కర్కాటం,సింహం-కన్య,తుల-వృశ్చికం,ధనస్సు-మకరం,కుంభం-మీనం.
**శుభనవపంచకాలు:-** మేషం-సింహం, వృషభం-కన్య, మిధునం-తుల, సింహం-ధనస్సు, తుల-కుంభం, వృశ్చికం-మీనం, ధనస్సు-మేషం, మకరం-వృషభం.
**అశుభ నవ పంచకాలు:-** కర్కాటకం-వృశ్చికం, కన్య-మకరం, కుంభం-మిధునం, మీనం-కర్కాటకం.

ఏకరాశి:- సౌభాగ్యం, పుత్ర లాభాలు.
సమసప్తకం:- ప్రీతి, ధన, భోగ, సుఖాలు.
తృతీయ లాభాలు:- ప్రీతి, ధనం, సౌఖ్యం.
చతుర్ధ దశమాలు:- ప్రీతి, ధనం, సౌఖ్యం.

**8 నాడీపొంతనము :** నాడీ దోషం ఎంతో విశిష్టమైనది.విడువరానిది.వదూవరులిద్దరిదీ ఏకనాడీ అయితే వారి వివాహం ఎట్టి పరిస్ధితులలోను చేసుకొనకూడదు.వదూవరులిద్దరిదీ ఏక శరీర తత్వము కాకూడదు అనేది నాడీ నిర్ణయం.వివాహమునకు తరువాత వ్యక్తి క్రొత్త జీవితములోనికి ప్రవేశించునని పెద్దలు అంటారు, పెద్దలు ఇట్లు చెప్పుట చాలా వరకు సరైనది కూడ. వివాహమునకు తరువాత ప్రారంభమగు క్రొత్త జీవితము సుఖమయముగా వుండుటకు కుండలి యొక్క లెక్కింపు చేసెదరు. కుండలి యొక్క లెక్కింపు క్రమములో అష్టకూటము ద్వారా విచారణ చేసెదరు. ఈ అష్ట కూటములో ఎనిమిదవ మరియు అంతిమ కూటము నాడీ కూటము. నాడీ కూటమి సరిగా లేకుంటే మిగతా ఏడు కూటాల గుణాల్ని కూడా నాశనం చేస్తుంది.

శరీరాన్ని మూడు భాగాలుగా విభజించారు.జ్యోతిష్య శాస్త్రము (Astrology)లో నాడులు మూడు ప్రకారములుగా వుండును, ఈ నాడుల పేర్లు ఆదినాడి, మధ్య నాడి, అంత్య నాడి.

**1. ఆది నాడి:** జేష్ట, మూల, ఆర్ద్ర, పునర్వసు, ఉత్తరఫల్గుని, హస్త, పూర్వభాద్ర,శతబిషం మరియు అశ్విని నక్షత్రములు ఆది లేదా ఆద్య నాడిలో వుండును. దీని వల్ల మేదోసంపత్తి,ప్రతీకార వాంఛ,ఆలోచనా విధానం,కోపం,ఆవేశం తెలుపుతుంది.వదూవరులిద్దరి నక్షత్రాలు ఉత్తర,శతభిషం,పూర్వాభాద్ర,పునర్వసు,ఆరుద్ర,మూల మొదలగు నక్షత్రాలకు ఆది నాడీ దోషం లేదు.

**2. మద్య నాడి:** పుష్యమి, మృగశిర, చిత్ర, అనురాధ, భరణి, దనిష్ట, పూర్వాషాడ, పూర్వఫల్గుణి మరియు ఉత్తరాభాద్ర నక్షత్రములు మధ్య నాడిలో వుండును. దీని వల్ల శరీరం మద్య భాగంలో ఉన్న రుగ్మతలు, సంతానం, ఊపిరితిత్తులు గుండెలో ఉన్న రుగ్మతలు తెలుపుతుంది. వదూవరులిద్దరి నక్షత్రాలు పూర్వాషాడ, అనురాధ, ధనిష్ఠ, పుష్యమి, చిత్త, పుబ్బ, మృగశిర అను నక్షత్రాలకు మద్య నాడీ దోషం లేదు.

**3. అంత్య నాడి:** స్వాతి, విశాఖ, కృత్తిక, రోహిణి, ఆశ్లేష, మఘ, ఉత్తరాషాడ, శ్రవణ మరియు రేవతి నక్షత్రములు అంత్య నాడిలో వచ్చును. దీనివల్ల మర్మాయవాలు, కామవాంఛ, నపుంసకత్వం గురించి తెలియజేయును. వదూవరులిద్దరి నక్షత్రాలు కృత్తిక, విశాఖ, ఆశ్లేష, శ్రవణం, మఖ, ఉత్తరాషాడ, రోహిణి నక్షత్రాలకు అంత్య నాడీ దోషం లేదు.

జ్యోతిష్య శాస్త్ర ఆదారముగా వరుడు మరియు కన్య ఇరువురి నక్షత్రములు ఒకే నాడిలో వుండిన అప్పుడు ఈ దోషము కలుగును. అన్ని దోషముల కన్నా నాడీ దోషము అశుభ కరముగా చెప్పబడుతున్నది. ఎందుకంటే ఈ దోషము కలుగుట వలన 8 అంఖము యొక్క హాని కలుగును. ఈ దోషము కలుగుట వలన వివాహ ప్రసంసము చేయుట శుభకరముగా వుండదు.

మహర్షి వశిష్టు (Maharishi Vashisht) ని అనుసారముగా నాడీ దోషము లో ఆది, మధ్య మరియు అంత్య నాడులకు వాతము (Mystique), పిత్తము (Bile) మరియు కఫము (Phlegm) అనే పేర్ల ద్వారా తెలిపెదరు.

నాడి మానవుని యొక్క శారీరక ఆరోగ్యమును కూడ ప్రభావితము చేయును (Nari also effect human health). ఈ దోషము కారణముగా వారి సంతానము మానసికముగా వికసితము లేని మరియు శారీరకముగా అనారోగ్యముతో వుండును (Naridosh also effect Mind of their Child and Health of their Child).

ఈ స్థితులలో నాడీ దోషము కలుగదు: (Naridosha will not affect you in these conditions)

1. యది వరుడు - వధువు యొక్క జన్మ నక్షత్రములు (Birth Nakshatras) ఒకటిగా వుండిననూ ఇరువురి చరణములు ప్రదమ చరణమైన ఎడల నాడీ దోషము కలుగదు.

2. యది వరుడు - వదువు ఒకే రాశిగా వుండి (Bride and Groom have Same Rashi) మరియు జన్మ నక్షత్రము బిన్నమైన (Different Birth Nakshatras) ఎడల నాడీ దోషము నుండి వ్యక్తి ముక్తి పొందగలడు.

3. వరుడు - వధువు యొక్క జన్మ నక్షత్రము ఒకటిగా వుండి మరియు రాశులు వేరు వేరుగా (Different Rashi) వుండిన ఎడల నాడీ దోషము కలుగదు.

తప్పనిసరి అయితే నాడీ దోష పరిహారానికి మృత్యుంజయ జపం సువర్ణ దానం చేయాలి. అంతేగాకుండా వరుడి జన్మ లగ్నం గురువర్గంలో బేసి రాశి అయినచో వధువు జన్మ లగ్నం శని వర్గం అయ్యే విధముగా చూసుకోని వివాహము చేయవలెను.

## షోడశ సంస్కారాలలోని గర్భాధానం ప్రాముఖ్యత

శుక్ల శోణిత కలయిక పిండోత్పత్తికి కారణం. పంచాంగ శుద్ధి, తిధి, వార, నక్షత్ర, యోగ, కరణ, తారాబాలము చూచి ఆరోగ్యవంతులైన వధూవరులకి గర్భాదానం ఏర్పాటు చేయవలెను.

మహానీయుల పుట్టుకకు మూల కారణం జ్యోతిష్య శాస్త్రంలోని గర్భాధారణ ముహూర్తం. హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు సంధ్యాకాల గర్భధారణ వలన జన్మించారని, శంఖ పురుష శాలివాహనుడు మంచి ముహూర్తంలో పుట్టటం వలనే యుగ పురుషుడు అయ్యాడని మనకు కొన్ని గాధలు వలన తెలుస్తున్నాయి.

పిల్లలను మంచి విధ్యాబుద్ధులు ఉన్న వారుగా, మంచి సంస్కారవంతులుగా తయారు చేయటానికి పిల్లవాడు పుట్టకముందే మంచి సంస్కారవంతులుగా తయారుచేయటానికి జ్యోతిష్యశాస్త్రం లోని గర్భధారణకు ముహూర్తాన్ని నిర్ణయించే విధానం ఉండటం వలనే మన భారతావనిలో వేలకు వేలుగా మహాత్ములు జన్మించటానికి మూల కారణం.

గర్భధారణకు ముహూర్తం, గర్భవతిగా ఉన్నప్పుడు మంచిమాటలు చెప్పటం, గర్భవతిగా ఉన్నప్పుడు సంస్కారాలు చేయటం, పిల్లవాడు పుట్టగానే షోడశ సంస్కారాలు చేయటం, పుట్టిన పిల్లలో దైవాన్ని దర్శించటం, పిల్లవానికి కూడా తల్లి తండ్రులలో దైవాన్ని దర్శించాలని నేర్పటం, గురువులోను దైవాన్ని దర్శించాలని నేర్పటం, భార్యా భర్తలు ఒకరిలో ఒకరు దైవాన్ని దర్శించుకోవటం అనే అంశాలు ఒక్క భారతదేశంలోనే ఉన్నాయి. అందువలనే ఇంతమంది మహానుభావులకు జన్మనివ్వగలుగుతుంది మన భారతదేశం.

దంపతుల ప్రధమ సమాగమాన్ని గర్భాధానమని వ్యవహరిస్తారు. బాల్య వివాహాలు ఆచారంగా ఉన్న కాలంలో వివాహానంతరం కొంతకాలానికి స్త్రీలు ఋతుమతులవుతూ ఉంటారు. ఇప్పుడు బాల్య వివాహాలు చట్ట విరుద్ధం కనుక రజస్వల అనంతర వివాహాలే నేడు ఆచారంగా ఉన్నాయి. స్త్రీ రజో దర్శన దినం నుండి నాలుగు దినాలు వర్జ్యాలు. ఆ తరువాత పన్నెండు దినాలు ఋతుకాలం. ఈ కాలంలో సమదినాలందయిన పుత్ర సంతానం బేసి దినాలందయిన స్త్రీ సంతానం కలుగుతుందని శాస్త్ర వచనం.

గర్భాధనం అనే శబ్దార్ధమును పరిశీలిస్తే ఋతుమతి అయిన స్త్రీ భర్తతోడి ప్రధమ సాంగత్యంలోనే గర్భాన్ని ధరిస్తుందని గోచరిస్తుంది. ఇప్పుడు గర్భాదానానికి కూడ ప్రత్యేక ముహూర్తం చూడటం ఎక్కడనో కాని కానరావటం లేదు. గర్భాదాన మంత్రాలన్నీ వివాహంలోనే చెప్పి పూర్తి చేయడం కూడా ప్రచారంలో ఉంది.

"దాంపత్యోః ఆయుర్భోగా శోభావృద్ధ్యర్ధం, అస్యాం, భార్యాయాం ప్రధమ గర్భ సంస్కార ద్వారా సర్వగర్భ శుద్ధ్యర్ధం. గర్భాధానాఖ్యం కర్మ కరిష్యే" అని గర్భాధాన సంకల్పం. అంటే గర్భాధానం భార్యాభర్తలిద్దరికి ఆయుర్వృద్ధిని, వర్చస్సును, యశస్సును, బలాభివృద్ధిని కలిగిస్తుందని, ప్రధమ గర్భానికి మాత్రమే కాక తరువాత గర్భాలకు కూడా శుద్ధి చేకూరుస్తుందని భావం. సంతానాన్ని కని వంశాభివృద్ధికి పాటుబడవలెను.

ప్రాతఃకాలంలో పునస్సంధాన హోమం నిర్వహించి రాత్రి మాత్రమే గర్భాధాన ముహూర్తాన్ని చూడాలి. అధిక మాసాలు ఆషాడం, భాద్రపదం, పుష్యమాసం గర్భాధాన ముహూర్తానికి శ్రేష్ఠం కావు. మౌడ్యాలలో పనికి రాదు.
విదియ, తదియ, పంచమి, సప్తమి, త్రయోదశి తిథులు గర్భాధానానికి ఉత్తమం. పర్వదినాలు, తిథి సంధులు, పౌర్ణమి, అమావాస్య, సంక్రాంతి మొదలైనవి పనికిరావు. సోమ, బుధ, గురు, శుక్రవారాలు గర్భాధానానికి ఉత్తమమైన రోజులు.

రోహిణి, హస్త, స్వాతి, అనురాధ, మూల, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతీ నక్షత్రాలు ఉత్తమమైనవి. మతాంతరంలో మృగశిర, చిత్త కూడా పనికి వస్తాయని కొంతమంది అభిప్రాయం.

మేష, వృషభ, కర్కాటక, కన్యా, తులా, మీన లగ్నాలు గర్భాధానానికి తగిన లగ్నాలు. మతాంతరంలో ధనుర్లగ్నం కూడా పనికి వస్తుంది. లగ్న, అష్టమ శుద్ధి చూడాలి. అష్టమ చంద్రుడు పనికి రాడు. తారాబలం చూడాలి.

అలాగే శనివర్గ జాతకులకు అనగా జన్మ లగ్నం వృషభం,మిథునం,కన్యా,తులా,మకరం,కుంభం ఈ లగ్నాలలో జన్మించిన జాతకునికి రా:09గం!!ల నుండి అర్ధ రాత్రి 12:00లోపు వృషభ,కన్యా,తులా లగ్నాలలో లగ్న శుద్ధి,అష్టమ శుద్ధి మరియు లగ్నధిపతి మీద గాని లగ్న అనుబంద బావాలమీద గాని,అష్టమాధిపతి మీద గాని అష్టమ అనుబంద బావాలపై గాని ప్రతికూల గ్రహాలు గురు,రవి,చంద్ర,కుజ,కేతు ల దృష్ఠి లేకుండా చూసుకోని ఆ సమయంలో శని వర్గ గ్రహాల అంతర్దశా కాలాలు ఉండేట్టుగా ఆ అంతర్దశా నాథుడు మీద ప్రతికూల గ్రహాల దృష్ఠి లేకుండా చూసి శని వర్గ జాతకులకు గర్భాదాన ముహుర్తం నిర్ణయించాలి.

అదేవిధముగా గురువర్గ జాతకులకు రాః12:00 నుండి 03:00గం!! ల లోపు మేష,కర్కాటక,ధనస్సు, మీన లగ్న ములలో లగ్నబావత్రయానికి,అష్టమ బావ త్రయానికి ప్రతికూల గ్రహాలైన శని,బుధ,శుక్ర,రాహు గ్రహాల దృష్ఠి లేకుండా చూసి ఆరోజు ఆ సమయంలో అనుకూల గ్రహాలైన రవి,చంద్ర,కుజ,గురు,కేతు అంతర్దశలు ఉండి ఆ దశానాథుని పై ప్రతికూల గ్రహాల దృష్ఠి లేకుడా చూసి గురువర్గ జాతకులకు గర్భాదారణ ముహుర్తములు నిర్ణయించవలెను.

## తిథులు వాటి ఫలాలు

మనం నిత్యవ్యవాహారంలో శుభాశుభ కర్మలన్నిటికి విశేషాలను గమనించడానికి ఉపయోగపడే గ్రంధానికి పంచాగం అని పేరు.తిధి,వార,నక్షత్ర,యోగాకరణాలకు పంచాంగం అని పేరు. ఈ ఐదుఅంగాలే కాక లగ్న, ముహూర్త, ప్రయాణ సంబంధమైన ఎన్నో విశేషాలను వివరించడానికి ఈ కరదీపికను ఉపయోగిస్తారు.

భారతీయుల నిత్యజీవన వ్యవహారంలో పంచాంగం లేకుండా పని జరగదు.అన్ని విశేషాలకు పర్వాలకు,శుభాశుభ వ్యవహారాలకు పంచాంగం అవసరం అవుతుంది. తిథులు, సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాలు, శుభాశుబ సమయాలు, నక్షత్రాలు, వివిధ యోగాలు ,లగ్నాలు అన్నింటి విషయాలు పంచాగంలో తెలుస్తాయి.

**పంచాంగం అంటే ఏమిటి?**

అయిదు అంగాలు కలది పంచాంగం.దీనికి తిథి పతి అని పేరు కూడా కలదు. దీనిలో తిథి, వార, నక్షత్రం, యోగం, కరణం అనే అయిదు అంగాలు ఉంటాయి. ఇవి ప్రతిదినం ఏ సమయం వరుకు ఉన్నాయో తెలిపేది పంచాంగం. ఈ అయిదు అంగాలతో పాటు రావ్యాదులస్థిత్యాది విశేషాలు ఉంటాయి.

**పంచాంగం యొక్క ప్రయోజనాలు:** వైదిక కర్మలు చేయవలిసిన కాలాన్ని తెలపడం, ఆకాశంలో ఉన్న మొదలు అయిన వాటి సరి అయిన స్థితిని తెలపడం,దాని వలన మానవులకు,దేశానికి కలిగే మంచి చెడులను తెలపడం ప్రయోజనాలు. ఉత్తమ తిథివార నక్షత్ర యోగ కరణాలు గ్రహించి సుముహుర్తలు పెట్టుకోవటానికి, చెడ్డ తిథివారదులను సుముహుర్తలలో వదిలిపేయటానికి పంచాంగం ఉపయోగపడుతుంది. కొన్ని తిథి వార నక్షత్రాదులు కొన్ని పనులకు విధించబడ్డాయి.

స్నానం, పూజ, జపం, హోమం మొదలగునవి ధార్మిక కార్యాలను చేసేందుకు కాలసంకీర్తనం చేయాలి. దానిలో సంవత్సరం, ఆయనం, ఋతువు, మాసం, పక్షం, తిథి, వారం చెప్పాలి.వీటిని పంచాంగం ద్వార గ్రహించాలి. ఇప్పుడు మనం పంచాంగాలు గురించి వివరం గా తెలుసుకొందాం. ఇవి ఐదు సూర్య,చంద్ర గమనాలపై ఆధారపడి ఉంటాయి. మొదటిది తిథి .

**తిథి:** చంద్రుడు సన్నని రేఖలా కనిపించి క్రమంగా వృద్ధి చెందుతూ 15వ రోజుకి పూర్తిగా పూర్ణ చంద్రుడుగా కనిపిస్తాడు, మరల క్రమంగా క్షీణిస్తూ 15వ రోజుకి అసలు కనిపించకపోవటం మనం గమనిస్తూ ఉంటాము. చంద్రుడు పూర్తిగా కనిపించిన రోజుని పూర్ణిమ అని, అస్సలు కనిపించని రోజుని అమావాస్య అని అంటాము.ఈ ప్రక్రియ మొత్తం 29½ రోజులలో జరుగుతుంది.సూర్యుడు నుండి 12 డిగ్రీల దూరానికి ఒక తిథి ఏర్పడుతుంది. ఎలా 180 డిగ్రీల దూరం ఇద్దరి మధ్య ఏర్పడే సమయానికి పౌర్ణిమ ఒకే డిగ్రీలో కలిసినప్పుడు అమావాస్య ఏర్పడుతుంది.

**తిధులు వాటి ఫలాలు గురించి తెలుసుకొందాం .**

**•పాడ్యమి:** ఈ తిథి యందు జన్మించిన దేవపూజ తత్పరుడు, జ్ఞానం కలిగినవాడు,శిల్ప విద్య విశారదుడు,మంత్రమందు అభిచార (చేతబడి) కర్మయందు సమర్ధుడు .

**•విదియ:** ఈ తిథి యందు జన్మించిన, శత్రువులను హతమార్చువారు,పశువులు యందు దయ కలవాడు,పరాక్రమము కలిగిన వాడు, అభిమానము ,సంపద గలిగినవాడు అయి ఉండును.

**•తదియ:** ఈ తిథి యందు జన్మించిన అమితమైన సౌందర్యం,అభిమానం ధనం కలవాడు,విద్యగలవాడు,మనస్సున అహంకారి,బంధువుల కార్యమందు ఇష్టము కలవాడు .

**•చవితి:** ఈ తిథి యందు జన్మించిన సర్వకార్య విఘ్నము చేయువాడు,క్రూరుడు,ప్రపీడనానికి ఉన్న మార్గాన్ని అన్వేషించు వాడు,అత్యాశ కలవాడు, లావాటి శరీరం కలవాడు వ్యసములు కలవాడు అయి ఉండును.

**•పంచమి:** ఈ తిథి యందు జన్మించిన సౌభాగ్యము,పాండిత్యము,సంపద కలవాడు,మాలావస్త్రము మొదలగు అలంకార వస్తువులందు ఇష్టము కలవారు ఇతరులకు ఉపకారం చేయువాడు.

**•షష్టి:** ఈ తిథి యందు జన్మించిన బలము,చాల సేవకాజనులు కలవాడు,ముక్కోపి, జ్ఞానం కలవాడు,దైవపూజయందు ఇష్టము కలవాడు, క్షేమము గలవాడు,ఇతరములు యొక్క మంచిని గుణములను స్వీకరించు వాడు.

**•సప్తమి:** ఈ తిథి యందు జన్మించిన క్రూరముగా పలుకువాడు,చెడ్డ మనస్సు గల సేవకాజనులు కలవాడు,శుభకర్మ యందు ఇష్టము కలవాడు,ఇంద్రియ నిగ్రహం కలవాడు,బలవంతుడు,రోగపీడితుడై ఉండును.

**•అష్టమి:** ఈ తిథి యందు జన్మించిన పరాక్రమము,స్వాతంత్రము కలవాడు,పీడించువాడు,వెంటనే కోపించే వాడు, మంచి శరీరం,కామశీలం కలవాడై ఉండును.

**•నవమి:** ఈ తిథి యందు జన్మించిన కోపము,స్వకార్య ఇష్టతయు,ఇతరులను ద్వేషించుట,చెడ్డ భార్యా పుత్రులు కలవాడు,దొంగలకు నాయకుడై ఉండెను.

**•దశమి:** ఈ తిథి యందు జన్మించిన ధర్మశీలము,సుఖము,సత్ స్వభావము, సంపదయు, వాక్ సామర్ధ్యము కలవాడు, కాముకుడు, బంధు స్నేహం కలవాడు, పరస్త్రీలందు ఆసక్తి గలవాడు అయి ఉండును.

**•ఏకాదశి:** ఈ తిథి యందు జన్మించిన పూజ్యుడు,సదాచారం కలవాడు,మంచి సేవకులు కలవాడు, సౌభాగ్యము, సంపద, మంచి స్వభావము కలవాడు అయి ఉండును.

**•ద్వాదశి:** ఈ తిథి యందు జన్మించిన విష్ణు భక్తుడు, త్యాగి, ధనవంతుడు, ప్రభువు, సర్వజన ప్రియుడు, నిర్మల మనస్సు కలవాడు,విద్యావంతుడు,పుణ్యవంతుడు అయి ఉండును.

**•త్రయోదశి:** ఈ తిథి యందు జన్మించిన కామియు,దర్బల శరీరుడు, సత్యం పలుకువాడు, మనోహరుడు, లుబ్ధుడు, ధనహీనుడు అయి ఉండును.

**•చతుర్దశి:** ఈ తిథి యందు జన్మించిన పరస్త్రీలను, ఇతరులను ద్రవ్యం అడుగువాడు, తెలివి తక్కువు వాడు, అందరికి శత్రువై ఉండును. కోపము, దుస్వభావము.భయంకరుడు అయి ఉండును.

**•పౌర్ణమి:** ఈ తిథి యందు జన్మించిన పరిపూర్ణమయిన అంగములు కలవాడు, విద్య, వినయము, యశస్సు కలవాడు, శాస్త్ర అర్ధములు తెలిసినవాడు ప్రధాని అయి ఉండును.

**•అమావాస్య:** ఈ తిథి యందు జన్మించిన దేవతలను,తల్లితండ్రులను పూజించు వాడు,కామి,పశుసంపదను నాశనం చేయువాడు, రోగి, బలం లేని శరీరం కలవాడు, దరిద్రుడు అయి ఉండును.

శుక్ల పక్షం యందు తిధులకు చెప్పిన శుభఫలములలో వృద్ధి,అశుభ ఫలములకు హానియు, బహుళ పక్షము నందు తిధులలో శుభఫలములు తగ్గుత, అశుభ ఫలములు పుష్టియు అగును. చంద్రుడు బలాబలములను అనుసరించి శుభ ఆశుభములను అనుసరించవలెను.

## పంచాంగం ప్రకారము వార ఫలితములు

**•ఆదివారము:** ఈ వారము జన్మించిన వారు ఆత్మజ్ఞాని, ధనవంతుడు, శూరుడు, ఇష్టము అయిన భార్య కలవాడు, చతురస్ర రూపశరీరం కలవాడు, బుద్ధిమంతుడై ఉండును.

**•సోమవారము:** ఈ వారము జన్మించిన వారు ప్రసన్నమైన ముఖము, కామాధిక్యతయు, స్త్రీలకు ఆనందాన్ని ఇచ్చువాడు, కోమలమైన శరీరము కలవాడు, మితమైన మాటలు పల్కువాడు అయి ఉండును.

**•మంగళవారం:** ఈ వారం జన్మించిన వారు క్రూరుడు, సాహసకర్మములను చేయువాడు, కోపము, వివాదము, బుద్ధిచాపల్యము, బంధుజనులను ద్వేషించు వాడు అయి ఉండును.

**•బుధవారము:** ఈ వారము జన్మించిన వారు బుద్ధిమంతుడు, మంచి మాటలు పల్కువాడు, సంపద కలవాడు ,స్వతంత్రుడు, శాస్త్ర నందు పట్టు తెలిసినవాడు, దేవబ్రహ్మన భక్తి కలవాడు, ఇతరుల కార్యములందు ఇష్టము కలవాడు అయి ఉండును.

**•గురువారం:** ఈ వారము జన్మించిన వారు కుటుంబీకుడు, యశస్సు, పుణ్యము, కులశ్రేష్ఠుడు, దేవబ్రాహ్మన భక్తి కలవాడు, మంచి స్వభావ గుణము కలవాడు అయి ఉండును.

**•శుక్రవారము:** ఈ వారము జన్మించిన వారు వ్యవసాయ స్థలాలు, సంపద కలవాడు, స్త్రీలకు ఇష్టుడు, కామియు, ప్రసన్న ముఖము, కళ్ళు గలవాడు, శ్రీమంతుడు, జనులకు ఇష్టుడు అయి ఉండును .

**•శనివారము:** ఈ వారము జన్మించిన వారు క్షుద్రకర్మలు చేయువాడు, దరిద్రుడు, ఉన్మాద చిత్తుడు, వర్ణసంకరము గలవాడు, పరాన్నభోజి, కృశమైన శరీరము గలవాడు, వాత రోగి అయి ఉండును.

పై చెప్పబడిన వారఫలములు రాత్రి కాలము పూర్ణముగా ఉండవు.వారధిపతి ఉదయకాలము లేక దశా భుక్తి కాలము పై ఫలములు పూర్ణముగా ఉండును.

## జ్యోతిషం

జ్యోతిష్యం లేదా జోస్యం, భవిష్యత్తును తెలుసుకొనుటకు ప్రపంచ వ్యాప్తంగా అనేకమంది విశ్వసించే విధానం. ఇది నిర్దిష్టమైన హిందూ ధర్మ శాస్త్రము. జీవి జీవితంలో జరిగినది, జరుగుతున్నది, జరగబోయేదీ జననకాల గ్రహస్థితి ప్రకారము, శరీర లక్షణాలు, అర చేతులు, మొదలగు వివిధ అంశాలను ఆధారం చేసుకొని చెప్పబడుతుంది. ఆరు వేదాంగాలలో జ్యోతిషము ఒకటి. ఇప్పటికీ ఆదరణ పొందుతున్న ప్రాచీనశాస్త్రాలలో ఇది కూడా ఉంది. మొట్టమొదటిగా జ్యోతిష్య శాస్త్రాన్ని గ్రంధరూపంలో వరాహమిహిరుడు అందించాడు. హిందూ సాంప్రదాయాల మరియు విశ్వాసాలలో జన్మ సిద్ధాంతం ఒకటి. జన్మసిద్ధాంతం ప్రకారము పూర్వ జన్మ పాపపుణ్యాల ప్రభావం ప్రస్తుత జన్మలో ఉంటుంది. దానికి తగిన విధంగా, తగిన సమయంలోనే జీవి జననం ఈ జన్మలో జరుగుతుంది. అనగా అటువంటి గ్రహస్థితి లో జీవి జననం జరుగుతుంది. ఇది అంతా దైవలీలగా హిందువులు భావిస్తారు. కావున ప్రతి జీవి భూత భవిష్యత్ వర్ధమాన కాలములు జననకాల గ్రహస్థితి ప్రకారము జరుగుతాయి. ఇది హిందువుల ప్రగాఢ విశ్వాసము.హస్తసాముద్రికము, గోచారము, నాడీ జ్యోస్యము, న్యూమరాలజీ, ప్రశ్న చెప్పడం, సోది మొదలైన విధానాలుగా జ్యోస్యం చెప్పడం వాడుకలో ఉంది.

### పురాణాలలో జ్యోతిష్యం

శ్రీనివాసుడు పద్మావతిని చేపట్టడానికి సోది చెప్పే స్త్రీ రూపంలో వచ్చి తన ప్రణయ వృత్తాంతాన్ని ఆకాశరాజు దంపతులకు తెలిపి వారిలో తమ వివాహం పట్ల సుముఖత కలిగించి పద్మావతిని పరిణయమాడటంలో విజయం సాధించనట్లు పురాణ కథనాలు చెప్తున్నాయి. కంసుడికి మేనల్లుడి రూపంలో మరణం పొంచివున్నట్లు ఆకాశవాణి ముందుగానే వినిపించింది.

శిశుపాలుని మరణం కృష్ణుని ద్వారా సంభవించనున్నదని పెద్దలు చెప్పినట్లు అందువలన శిశుపాలుని తల్లి కృష్ణుని నుండి నూరు తప్పుల వరకు సహించేలా వరం పొందినట్లు భారతంలో వర్ణించబడింది. ఆ తరువాత నూరు తప్పులు చేసి శిశుపాలుడు కృష్ణుని చేతిలో మరణించడం లోక విదితం.

త్రిజటా స్వప్నవృత్తాంతము శ్రీ రాముడు రావణుని వధించి సీతమ్మను విడిపించినట్లు త్రిజట ద్వారా వాల్మీకి పలికించడం స్వప్న ఆధారిత జ్యోస్యం వాడుకలో ఉన్నదని చెప్పడానికి నిదర్శనం.

### జానపదుల జోస్యం

చిలుక జోస్యం, పుల్లల జోస్యం, రాగుల జోస్యం, చిప్పకట్టె జోస్యం, అంజన పసరు జోస్యం, చెంబు జోస్యం మొదలైనవి **జానపదుల జోస్యాలు.**

బాలసంతు వారు శైవులు.తెల్లవారు ఝామున గంట వాయిస్తూ ఇంటింటికి వచ్చి ఇంటి యజమాని విన్నా వినకపోయినా జోస్యం చెప్పి వెళతారు.

**ప్రశ్నా శాస్త్రం**

జ్యోతిష శాస్త్రంలో ప్రశ్నాశాస్త్రం ప్రాముఖ్యత సంతరించుకుంది. ప్రశ్నా శాస్త్ర సంబంధిత విషయాలు శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణంలో లభ్యమవుతాయి. కనుక ఈ శాస్త్రం అతి పురాతన కాలం నుండి ప్రాచుర్యం పొంది ఉంది. ప్రశ్నఅడగడం అన్నది అప్పటి నుండి ఇప్పటి వరకు వాడుకలో ఉన్న విషయమే. అనేక రూపాలలో ప్రశ్నలకు సమాధానం చెప్పేవాళ్ళున్నా జ్యోతిష శాస్త్ర పండితులు అతి జాగరూకతతో గణించి చెప్పే సమాధానాలు విశ్వసించ దగినవి. ప్రశ్నా శాస్త్రానికి సమాధానం చెప్పాలంటే సాధారణంగా జాతక చక్రాన్ని చూసి చెప్పే కంటే విశేష పాండిత్యం అవసరమౌతుంది. పురాణాలలో ప్రశ్నా శాస్త్రాన్ని గురించి ప్రత్యేకంగా ప్రస్తావించబడింది. పృచ్ఛకుడు ఎలా ఉండాలి, ఏ సమయంలో ప్రశ్న అడగాలి. ఎలాంటి ప్రదేశంలో అడగాలి మొదలైన అనేక విషయాలు ప్రస్తావించబడ్డాయి. అలాగే ప్రశ్నను చెప్పే పండితుడు ఎలా చెప్పాలి అనే విషయాలు ప్రస్తావించబడ్డాయి. వాటిలో శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణంలో ప్రస్తావించబడిన విషయాలు ఇక్కడ చూడవచ్చు.

ప్రశ్నచెప్పే జ్యోతిష పండితుడు శుభ్రమైన వస్త్రధారణ చేసి ఉండాలి. శ్వేతవస్త్రధారణ మరింత శ్రేష్టం.
ప్రశ్నచెప్పే జ్యోతిష పండితుడు మంచి మనసు కలవాడై ఉండాలి.
ప్రశ్నచెప్పే జ్యోతిష పండితుడు శుభసమయంలో సమాధానం చెప్పాలి.
చెప్పే జ్యోతిష పండితుడు తలంటుకున్న సమయంలో, దుఃఖితుడై ఉన్న సమయంలో, వికలమై మనస్సు కల్లోలితమైన సమయంలో, తల విరబోసుకున్న సమయంలో, భూమి మీద నిలబడి ఉన్న సమయంలో సమాధానం చెప్పకూడదు. అలాంటి సమయంలో పండితుడిని ప్రశ్న అడగకూడదు. ఆ పరిస్థితిలో చెప్పే సమాధానం అశుభాన్ని కలిగిస్తుంది. ప్రశ్న అడిగే ప్రదేశం పట్టి ఫలితాలు ఉంటాయి. పూలున్న ప్రదేశం, వృక్షములు ఉన్న ప్రదేశం, పచ్చిక మైదానాలు, నదీతీరాలు, సరస్సు తీరాలు, చక్కగా లక్ష్మీకళుట్టిపడుతున్న భవనాలలో చెప్పే సమాధానం శుభఫలితాలు ఇస్తాయి.

ప్రశ్న అడుగు పృచ్ఛకుడు స్మశానం, కటేళా (మాంసవిక్రయ శాల), కారాగారం, నడి రోడ్డు, బురదగల ప్రదేశం, పాడుబడిన కట్టడాలు, పాడుబడిన గృహములు, ఎలుకలు కలుగులు, పాము కన్నాలు, పురుగులు ఉన్నప్రదేశంలో అడిగిన అశుభఫలితాలు కలుగుతాయి.
దండహస్తులు (చేత కర్రలు పట్టుకున్న వాళ్ళు), కాషాయ వస్త్ర ధారులు, తల అంటుకున్న వాళ్ళు, జాతి భ్రష్టులు, నపుంసకులు, స్త్రీలు, సంకెళ్ళు తాళ్ళు పట్టుకున్న వాళ్ళు, తాడి పండ్లు చేత పట్టున్న వాళ్ళు అడిగిన ప్రశ్నకు ఫలితం భయంకరం ఫలితాలను ఇస్తుంది.

సంధ్యా సమయం, మిట్ట మధ్యాహ్నం, మధ్యాహ్నానికి ముందు సమయం, రాత్రి వేళలు అడిగిన అశుభ ఫలితం ఇస్తుంది. ఉత్తర దిక్కు, ఈశాన్య మూల, తూర్పు దిక్కున నిలిచి అడిన శుభ ఫలితం ఇస్తుంది.

**సాయన, నిరయణ సిద్ధాంతాలు**

రాశి చక్రానికి ప్రారంభ బిందువు ఎక్కడ అన్నదొక వివాదం. ప్రతీ సంవత్సరం సూర్యుడు భూమధ్య రేఖ పైకి వచ్చే బిందువుని వసంత విషువద్బిందువు (Vernal Equinox) అని అంటారు. అది సుమారుగా మార్చి 21వ తేదీన జరుగుతుంది. ఆరోజు భూమధ్య రేఖమీద పగలు, రాత్రి సమానంగా ఉంటాయి. ఈ బిందువే రాశి చక్రానికి ప్రారంభ బిందువు అని ఒక సాంప్రదాయం. ఇలా లెక్కపెట్టే రాశిచక్రాన్ని సాయన రాశిచక్రం అంటారు. కానీ భూమి తనచుట్టూ తాను తిరగడమే కాక బొంగరంలా ధృవాల దగ్గర అటూ ఇటూ ఊగుతూ ఉంటుంది. ఈ ఊగే చలనం ఫలితంగా ప్రతి ఏడాదీ సూర్యుడు భూమధ్య రేఖ మీదకి వచ్చే బిందువు కొద్దిగా వెనక్కి వెళ్ళిపోతూ ఉంటుంది (Precession of the Equinoxes).

దీని ఫలితంగా రాశిచక్రపు ప్రారంభ బిందువు కూడా మారిపోతూ ప్రతీ డెబ్బైరెండు సంవత్సరాలకు ఒక డిగ్రీ చొప్పున వెనక్కి జరిగిపోతూ ఉంటుంది. కాబట్టి సాయన రాశి చక్రం అంటే ప్రతీ ఏడాదీ ప్రారంభ బిందువు మారిపోయే రాశిచక్రం (Tropical Zodiac). దీన్ని ప్రధానంగా పాశ్చాత్య జ్యోతిషంలో ఉపయోగిస్తారు.

అయితే ప్రస్తుతం ప్రాచుర్యంలో ఉన్న భారతీయ జ్యోతిశ్శాస్త్రం ఇలా మారిపోయే రాశిచక్రాన్ని పరిగణనలోకి తీసుకోదు. ఒకానొక స్థిరమైన బిందువునించి రాశిచక్రాన్ని లెక్కిస్తుంది. ఆ రాశిచక్రాన్ని నిరయణ రాశి చక్రం అంటారు. వసంతవిషువద్బిందువుకీ (అంటే పాశ్చాత్య రాశిచక్రపు ప్రారంభ బిందువుకీ) ఈ స్థిర బిందువుకీ మధ్య ప్రస్తుతం సుమారు 23 డిగ్రీల తేడా ఉన్నది. దాన్నే అయనాంశ అంటారు. అయితే ఈ స్థిరబిందువు ఎక్కడ ఉండాలి అన్నదానిపై కూడా జ్యోతిష్కులకి ఏకాభిప్రాయం లేదు. భారతీయ జ్యోతిషంలో కూడా ఒక సంప్రదాయానికీ మరొక సంప్రదాయానికీ ఈ స్థిరబిందువు కొద్దిగా మారుతుంది. అంటే అయనాంశ మారుతుంది. ఈ అయనాంశలో లాహిరి, రామన్, దేవదత్త, కృష్ణమూర్తి మొదలైన రకాలు ఉన్నాయి.

**గోచారము**

గోచారము అంటే గోళాలు యొక్క సంచారం ఆధారంగా జోస్యం చెప్పడం. చంద్రగోళం భూప్రదక్షణం చేసే సమయంలో ఒక్కొక్క రోజు ఒక్కొక్క నక్షత్రం సమీపంలో కనిపిస్తుంది. చంద్రుడు సమీపంలోని నక్షత్రాన్ని జాతకుని జన్మ నక్షత్రం. ఈ నక్షత్రాలను వాటి ప్రక్కన కనిపించే నక్షత్రాతో కలిపి ఒక ఊహా రేఖతో గుర్తించి వాటిని రాసులుగా గుర్తించారు. దీని ఆధారంగా చంద్రుని సమీపంలో ఉన్న నక్షత్రరాసిని జాతకుని రాశిగా వ్యవహరిస్తారు. సూర్యుడు ఒకరాశినుండి ఇకంకొక రాశి మారటానిని సంక్రమణ లేక సంక్రాంతి అంటారు. సూర్యుడు జ్యోతిష్యశాస్త్రాన్ననుసరించి ఒక్కొక్క మాసంలో ఒక్కొక్క రాసిలో ప్రవేసిస్తాడు. సంవత్సరాకాలంలో 12 రాసులలో సంచరిస్తాడు. తమిళులు తమ సంవత్సరాన్ని సూర్య సంచారాన్ని అనుసరించి గణిస్తారు. సుర్యుడు మేషంలో ప్రవేసించే రోజు వారికి నూతన సంవత్సర ఆరంభం అవుతుంది. సూరుడు మకరరాశిలో ప్రవేసించినపుడు హిందువులు పెద్ద పండుగగా ఆచరించే సంక్రాంతి పండుగ పర్వదినం. సంక్రాంతిని మకర సంక్రాంతి అనే పేరుతో కూడా పిలవడం హిందువుల అలవాటు. ఒక సంవత్సర కాలంలో 12 సంక్రాంతులు వస్తాయి. ఈ విధంగా సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని మొదలైన గ్రహాలు ఛాయా గ్రహాలుగా జ్యోతిష్యశాస్త్రాలలో పిలవబడే రాహువు, కేతువు యొక్క సంచారము జ్యోతిష్య గణనలో భాగాలు. ఇవి కాక తెలుగు, మళయాళ జ్యోతిష్కులు శని గ్రహ ఉపగ్రహాలలో పెద్దదైన మందిని శని పుత్రునిగా వ్యహరిస్తూ గణనలోకి తీసుకుంటారు.

తమిళ జ్యోతిష్యంలో మాంది గణనలోకి తీసుకొనే ఆచారం లేదు. గ్రహాలు సూర్యుని చుట్టూ ప్రదక్షిణ చేసే కాలాన్ని 12 రోజులుగా విభజించి జ్యోతిష్య గణన చేస్తారు. వీటి ఆధారంగా గోచార ఫలితాలు ఉంటాయి.

**రాశులు నక్షత్ర పాదాలు**

సాధారణంగా ఒక రాశిలో తొమ్మిది పాదాలు ఉంటాయి.ఒక నక్షత్రానికి 4 పాదాలు ఉంటాయి.

**రాశి నక్షత్రపాదాలు దినారంభంలో లగ్నం**

మేషరాశి అశ్విని 1,2,3,4 పాదాలు భరణి 1,2,3,4 పాదాలు కృత్తిక 1 పాదం మేష సంక్రాంతి నుండి వృషభ సంక్రాంతి వరకు మేషలగ్నం

వృషభరాశి కృత్తిక 2,3,4 పాదాలు రోహిణి 1,2,3,4 పాదాలు మృగశిర 1,2 పాదాలు వృషభ సంక్రాంతి నుండి మిధున సంక్రాంతి వరకు వృషభ లగ్నం

మిథునరాశి మృగశిర 3,4 పాదాలు ఆరుద్ర 1,2,3,4 పాదాలు పునర్వసు 1,2,3 మిధున సంక్రాంతి నుండి కటక సంక్రంతి వరకు మిధిన లగ్నం

కర్కాటకరాశి పునర్వసు 4వ పాదం పుష్యమి 1,2,3,4 పాదాలు ఆశ్లేష 1,2,3,4 పాదాలు కటక సంక్రాంతి నుండి సింహ సంక్రాంతి వరకు కటక లగ్నం

సింహరాశి మఖ 1,2,3,4 పాదాలు పూర్వఫల్గుణి 1,2,3,4 పాదాలు ఉత్తర ఫల్గుణి 1 పాదం సింహ సంక్రాంతి నుండి కన్యా సంక్రాంతి వరకు సింహ లగ్నం

కన్యారాశి ఉత్తర ఫల్గుణి 2,3,4 పాదాలు హస్త 1,2,3,4 పాదాలు చిత్త 1,2 పాదాలు కన్యా సంక్రాంతి నుండి తులా సంక్రాంతి వరకు కన్యా లగ్నం

తులారాశి చిత్త 3,4 పాదాలు స్వాతి 1,2,3,4 పాదాలు విశాఖ 1,2,3 పాదాలు తులా సంక్రాంతి నుండి వృశ్చిక సంక్రాంతి వరకు తులా లగ్నం

వృశ్చికం విశాఖ 4వ పాదం అనూరాధ 1,2,3,4 పాదాలు జ్యేష్ట 1,2,3,4 పాదాలు వృశ్చిక సంక్రాంతి నుండి ధనస్సు సంక్రాంతి వరకు వృశ్చిక లగ్నం

ధనూరాశి మూల 1,2,3,4 పాదాలు పూర్వాషాఢ 1,2,3,4 పాదాలు ఉత్తరాషాఢ 1 పాదం ధనస్సు సంక్రాంతి నుండి మకర సంక్రాంతి వరకు ధనుర్లగ్నం

మకరరాశి ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు శ్రవణం 1,2,3,4 పాదాలు ధనిష్ట 1,2 పాదాలు మకర సంక్రాంతి నుండి కుంభ సంక్రాంతి వరకు మకర లగ్నం

కుంభరాశి ధనిష్ట 3,4 పాదాలు శతభిష 1,2,3,4 పాదాలు పూర్వాభద్ర 1,2,3,పాదాలు కుంభ సంక్రాంతి నుండి మీన సంక్రాంతి వరకు కుంభలగ్నం

మీనరాశి పూర్వాభద్ర 4వ పాదం ఉత్తరాబాధ్ర 1,2,3,4 పాదాలు రేవతి 1,2,3,4 పాదాలు మీన సంక్రాంతి నుండి మేష సంక్రాంతి వరకు మీన లగ్నం

జ్యోతిష శాస్త్రంలో నక్షత్రాలను మూడు గణాలుగా విభజిస్తారు. ఇరపై ఏడు నక్షత్రాలలో అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి,అనూరాధ, శ్రవణం, రేవతి అను తొమ్మిది నక్షత్రాలు దేవగణ నక్షత్రాలు. భరణి, రోహిణి, ఆరుద్ర, పుబ్బ (పూర్వ ఫల్గుణి), ఉత్తర(ఉత్తర ఫల్గుణి), పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, పూర్వబాధ్ర, కృత్తిక, ఉత్తరాబాధ్ర అను తొమ్మిది

నక్షత్రాలు మానవ గణ నక్షత్రాలు. ఆశ్లేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ట, మూల, ధనిష్ట, శతభిషం(శతతార) అనే తొమ్మిది నక్షత్రాలు రాక్షస గణ నక్షత్రాలు.

**నక్షత్రాలు అధిదేతలు వర్ణం రతం**

నక్షత్రం అధిదేవత వర్ణం రత్నం నామం గణం జంతువు నాడి దిక్కు వృక్షం గ్రహం

అశ్విని అర్ధనారీశ్వరుడు పసుపు వైడూర్యం చూ,చే,చో,ల దేవగణం గుర్రం ఆది నైఋతి అడ్డరస కేతువు

భరణి రవి ఆకాశనీలం వజ్రం లీ,లూ,లే,లో మానవగణం ఏనుగు మధ్య దేవదారు శుక్రుడు

కృత్తిక అగ్ని కావి మాణిక్యం ఆ,ఈ,ఊ,ఏ రాక్షసగణం మేక అంత్య ఔదంబర సూర్యుడు

రోహిణి చంద్రుడు తెలుపు ముత్యం ఒ,వా,వ్,వో మానవగణం పాము అంత్య జంబు చంద్రుడు

మృగశిర దుర్గ ఎరుపు పగడం వే,వో,కా,కి దేవగణం పాము మధ్య చంద్ర కుజుడు

ఆరుద్ర కాళి ఎరుపు గోమేధికం కూ,ఘ,ఙ,చ మానవగణం కుక్క ఆది రేల రాహువు

పునర్వసు రాముడు పసుపు పుష్పరాగం కే,కో,హా,హీ దేవగణం పిల్లి ఆది వెదురు గురువు

పుష్యమి దక్షిణామూర్తి పసుపు,ఎరుపు నీలం హూ,హే,హో,డా దేవగణం మేక మధ్య పిప్పిలి శని

ఆశ్లేష చక్రత్తాళ్వార్ కావి మరకతం డి,డూ,డె,డొ రాక్షసగణం పిల్లి అంత్య నాగకేసరి బుధుడు

మఖ ఇంద్రుడు లేతపచ్చ వైడూర్యం మా,మి,మూ,మే రాక్షసగణం ఎలుక అంత్య మర్రి కేతువు

పూర్వఫల్గుణి రుద్రుడు శ్వేతపట్టు పచ్చ మో,టా,టి,టూ మానవగణం ఎలుక మధ్య మోదుగ శుక్రుడు

ఉత్తరఫల్గుణి బృహస్పతి లేతపచ్చ మాణిక్యం టే,టో,పా,పీ మానవగణం గోవు ఆది జువ్వి సూర్యుడు

హస్త అయ్యప్ప ముదురునీలం ముత్యం పూ,ష,ణ,డ దేవగణం దున్న ఆద కుంకుడు చంద్రుడు

చిత్త విశ్వకర్మ ఎరుపు పగడం పే,పో,రా,రీ రాక్షసగణం పులి మధ్య తాటి కుజుడు

స్వాతి వాయువు తెలుపు గోమేధికం రూ,రే,రో,త దేవగణం దున్న అంత్య మద్ది రాహువు

విశాఖ నక్షత్రము మురుగన్ పచ్చ పుష్పరాగం తీ,తూ,తే,తో రాక్షసగణం పులి అంత్య నాగకేసరి గురువు

అనూరాధ మహాలక్ష్మి పసుపు నీలం నా,నీ,నూ,నే దేవగణం లేడి మధ్య పొగడ శని

జ్యేష్ట ఇంద్రుడు శ్వేతపట్టు మరకతం నో,యా,యీ,యూ రాక్షసగణం లేడి ఆది విష్టి బుధుడు

మూల నిరుతి ముదురుపచ్చ వైడూర్యం యే,యో,బా,బీ రాక్షసగణం కుక్క ఆది వేగిస కేతువు

పూర్వాషాఢ వరుణుడు బూడిద వజ్రం బూ,దా,థా,ఢా మానవగణం కోతి మధ్య నెమ్మి శుక్రుడు

ఉత్తరాషాఢ గణపతి తెలుపు మాణిక్యం బే,బో,జా,జీ మానవగణం ముంగిస అంత్య పనస రవి

శ్రవణా మహావిష్ణు కావి ముత్తు ఖీ,ఖూ,ఖే,ఖో దేవగణం కోతి అంత్య జిల్లేడు చంద్రుడు

ధనిష్ట చిత్రగుప్తుడు పసుపుపట్టు పగడం గా,గీ,గూ,గే రాక్షసగణం గుర్రం మధ్య జమ్మి కుజుడు

శతభిష భద్రకాళి కాఫి గోమేదికం గో,సా,సీ,సూ రాక్షసగణం గుర్రం ఆది అరటి రాహువు

పూర్వాబాధ్ర కుబేరుడు ముదురుపసుపు పూస సే,సో,దా,దీ మానవగణం సింహం ఆది మామిడి గురువు

ఉత్తరాబాధ్ర కామధేను గులాబి నల్లపూస దు,శం,ఛా,దా మానవగణం గోవు మధ్య వేప శని

రేవతి అయ్యప్ప ముదురునీలం ముత్యం దే,దో,చా,చీ దేవగణం ఏనుగు అంత్య విప్ప బుధుడు

**గోచార ఫలదర్శన చక్రం**

స్థానం రవి చంద్రుడు కుజుడు బుధుడు గురువు శుకృడు శని రాహువు కేతువు

1 స్థానచలనం సౌజన్యం దుఃఖం బంధనం గమనం ఆరోగ్యం విపత్తు భయం భయం

2 భయం వ్యయం వ్యయం లాభం ధనలాభం భాగ్యం హాని కలహం విరోధం

3 సంపత్తు లాభం లాభం వ్యయం విపత్తు సౌభాగ్యం సంపద సౌఖ్యం సుఖం

4 మానభంగం హాని రిపుభయం శుభం వ్యయం సుఖం రోగం మానహాని మానహాని

5 భయం కార్యనాశం రిపుభయం సంపద పుత్రలాభం సుతక్షయం ధనవ్యయం క్లేశం

6 రిపుహాని శుభం ధనలాభం భూషణం దుఃఖం వ్యయం సంపద సుఖం సంతోషం

7 దేహపీడ లాభం కలహం వ్యసనం ఆరోగ్యం క్లేశం రాజాగ్రహం భయం భీతి

8 రోగం వ్యయం భయం సంతోషం హాని భయం దుఃఖం మృత్యువు హాని

9 భయం వ్యాకులం వ్యయం దుఃఖం ధనాగమం ధనలాభం రోగం సంతానం కలహం

10 లాభం లాభం చలనం శుభం హాని సౌఖ్యం జాడ్యం కలహం విరోధం

11 ఆరోగ్యం శుభం లాభం సుఖం సంతోషం సౌఖ్యం లాభం లాభం ధనాగమం

12 వ్యయం దుఃఖం రోగం వ్యయం పీడ లాభం క్లేశం హాని హాని

**మహర్ధశ అంతర్ధశ**

**మహర్ధశాకాలం**

1.రవి 0-3-18 0-6-0 0-4-6 0-10-24 0-9-18 0-11-12 0-0-6 0-4-6 1-0-0 6 సంవత్సరాలు

2.చంద్రుడు 0-6-0 0-10-0 0-7-0 1-6-0 1-4-0 1-7-0 1-5-0 0-7-0 1-8-0 10 సంవత్సరాలు

3.కుజుడు 0-4-6 0-7-0 0-4-27 1-0-18 0-11-6 1-1-9 0-11-27 0-4-27 1-2-0 7 సంవత్సరాలు

4.రాహువు 0-10-24 1-6-0 1-0-18 2-8-12 2-4-24 2-10-6 2-6-18 1-0-18 3-0-0 18 సంవత్సరాలు

5.గురువు 0-9-18 1-4-0 0-11-6 2-4-24 2-1-18 2-6-12 2-3-6 0-11-6 2-8-0 16 సంవత్సరాలు

6.శని 0-11-12 1-7-0 1-1-9 2-10-6 2-6-12 3-0-3 2-8-9 1-1-9 3-2-0 19 సంవత్సరాలు

7.బుధుడు 0-10-6 1-5-6 0-11-27 2-6-18 2-3-6 2-8-9 2-4-27 0-11-27 2-10-0 17 సంవత్సరాలు

8.కేతువు 0-4-6 0-7-0 0-4-27 1-0-18 0-11-6 1-1-9 0-11-27 0-4-27 1-2-0 7 సంవత్సరాలు

9.శుకృడు 1-0-0 1-8-0 1-2-0 3-0-0 2-8-0 3-2-0 2-10-0 1-2-0 3-4-0 20 సంవత్సరాలు

గ్రహాలు శత్రువులు మిత్రులు సములు

గ్రహం మిత్రుడు శత్రువు సముడు

రవి చంద్రుడు, కుజుడు, గురువు శని,శుకృడు బుధుడు

చంద్రుడు రవి, బుధుడు శత్రువులు లేరు మిగిలిన వారు సములు

కుజుడు గురువు, చంద్రుడు, రవి బుధుడు శుక్రుడు, శని

బుధుడు శుకృడు, రవి చంద్రుడు కుజుడు, గురువు, శని

గురువు కుజుడు, చంద్రుడు బుధ, శుకృడు రవి, శని

శుక్రుడు శని, బుధుడు రవి, చంద్రుడు కుజుడు, గురువు

శని శుక్రుడు, బుధుడు రవి, చంద్రుడు, కుజుడు గురువు

రాహువు శని, శుక్రుడు రవి, చంద్రుడు, కుజుడు గురువు, బుధుడు

కేతువు రవి, చంద్రుడు, కుజుడు శని, శుక్రుడు బుధుడు, గురువు

దశ వర్గులు రాశి, హోర, ద్రేక్కాణ, సప్తమాంశ, నవాంశా, దశాంశ, షోడాంశ, త్రిశాంశ అన్న పది విధానాలు రాశిచక్ర నిర్మాణ విధములు.

**జన్మలగ్నము [మార్చు]**

భూమి తనచుట్టూ తాను తిరిగే ఆత్మ ప్రదక్షిణ కాలంలో ప్రతి రెండు గంటలకు లగ్నం మారుతూ 24 గంటల సమాయాన్ని 12 రాశుల లగ్నాలుగా విభజిస్తూ జ్యోతిష్య గణన చేస్తారు. చైత్రమాసం పాడ్యమి సూర్యోదయం మేష లగ్నంతో ఆరంభం ఔతుంది. ఒక రోజుకు నాలుగు నిమిషాల కాలం ముందుకు జరుగుతూ చేర్చుకొని ఒక మాసకాలంలో 120 నిమిషాలు లగ్న కాలం మారుతూ వైశాఖమాస ప్రారంభం వృషభ లగ్నంతో ఉదయం ఆరంభం ఔతుంది. ఈ విధంగా లగ్న గణన చేస్తూ జాతకుడు పుట్టిన లగ్న నిర్ణయం చేస్తారు.

**ఛాయాగ్రహాలు**

జ్యోతిష్య శాస్త్రంలో రాహుకేతువులు ఛాయా గ్రహాలు. వీటికి జ్యోతిష్య శాస్త్రంలో ఇల్లు లేదు. రాహుకేతువులు అపసవ్య మార్గంలో ప్రయాణం చేస్తాయి. రాహువు కేతువుకు సరిగ్గా ఏడు రాశులు దూరంలో ప్రయాణం చేస్తాయి. కనుక ఈ రెండు గ్రాహాలు ప్రయాణకాలం సమమే. రాహువును కాలసర్పంగా వ్యవహరిస్తారు. రాశి చక్రంలో రాహువు కేతువుకు మధ్యలో అన్ని గ్రహాలు ఉంటే దానిని కాలసర్ప దోషంగా నిర్ణయిస్తారు.

**గ్రహస్థితి బలాబలాలు**

జ్యోతిష శాస్త్రమున గ్రహములు దిగ్బలం, స్థానబలం, కాల బలం, చేష్టాబలం అను నాలుగు విధముల బలనిర్ణయం చేస్తారు , లగ్నంలో గురువు, బుధుడు ఉన్న బలవంతులు. నాలుగవ స్థానములో చంద్రుడు, శుక్రుడు ఉన్న బలవంతులు. పదవ స్థానమున సూర్యుడు, కుజుడు బలవంతులు. స్వ స్థానమున, ఉచ్ఛ స్థానమున, త్రికోణమున, మిత్ర స్థానమున, స్వ నవాంశ అందు ఉన్న గ్రహములు, శుభ దృష్టి గ్రహములు బలముకలిగి ఉంటాయి. స్త్రీ క్షేత్రములైన వృషభము, కటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనములందు చంద్రుడు, శుక్రుడు బలవంతులు. పురుష రాశులైన మేషము, మిధునము, సింహము, తుల, ధనస్సు, కుంభములందు సూర్యుడు, కుజుడు, గురువు, బుధుడు, శని బలవంతులు. సూర్యుడు, కుజుడు, శుక్రుడు పగటి అందు బలవంతులు. రాత్రి అందు బుధుడు, శని, గురువు బలవంతులు. సర్వ కాలమందు బుధుడు బలవంతుడు. శుక్ల పక్షమున శుభగ్రహములు, కృష్ణ పక్షమున పాపగ్రహములు బలవంతులు. యుద్ధమున జయించిన వాడు, వక్రగతి కల వాడు, సూర్యుడికి దూరముగా ఉన్న వాడు చేష్టా బలం కలిగిన వాడు. అంటే ఉత్తరాయణమున కుజుడు, గురువు, సూర్యుడు, శుక్రుడు దక్షిణాయనమున చంద్రుడు, శని రెండు ఆయనముల అందు స్వక్షేత్రమున ఉన్న బుధుడు చేష్టా బలము కల వారు. స్త్రీ గ్రహములైన చంద్రుడు, శుక్రుడు రాశి మొదటి స్థానమున ఉన్న బలము కలిగి ఉంటారు. పురుష గ్రహములైన సూర్యుడు, కుజుడు, గురువు రాశి మధ్యమున ఉన్న బలము కలిగి ఉంటాయి. నపుంసక గ్రహములైన బుధుడు, శని రాశి అంతమున ఉన్నచేష్టా బలము కలిగి ఉంటాయి. రాత్రి అందు

మొదటి భాగమున చంద్రుడు, అర్ధరాత్రి అందు శుక్రుడు, తెల్లవారు ఝామున కుజుడు, ఉదయకాలమున బుధుడు, మధ్యహ్న కాలమున సూర్యుడు, సాయం కాలమున శని సర్వ కాలమందు గురువు బలవంతులు. శనికంటే కుజుడు, కుజుని కంటే బుధుడు, బుధునికంటే గురువు, గురువుకంటే శుక్రుడు, శుక్రునికంటే చంద్రుడు, చంద్రునికంటే సూర్యుడు బలవంతులు.

**గ్రహావస్థలు**

గ్రహావస్థలు పది రకాలు. (1) స్వస్థము, (2) దీప్తము, (3) ముదితము, (4) శాంతము, (5) శక్తము, (6) పీడితము, (7) దీనము, (8) వికలము, (9) ఖల, (10) భీతము అనేవి ఆ అవస్థలు.

**స్వస్థము:** స్వక్షేత్ర మందున్న గ్రహము స్వస్థావస్తను పొందును.
**దీప్తము:** ఉచ్ఛక్షేత్ర మందున్న గ్రహము దీప్తావస్త నందుండును.
**ముదితము:** మిత్ర క్షేత్ర మందున్న గ్రహము ముదితావస్తను పొందును.
**శాంతము:** సమ క్షేత్ర మందున్న గ్రహము శాంతావస్తను పొందును.
**శక్తము:** వక్రించి యున్న గ్రహము శక్త్యావస్తను పొందును.
**పీడితము:** రాశి అంతమున 9 నక్షత్ర పాదములలో చివరి పాదము నందున్న గ్రహము పీడావస్థను పొందును.
**దీనము:** శత్రు క్షేత్ర మందున్న గ్రహము దీనావస్థను పొందును.
**వికలము:** అస్తంగత మయిన గ్రహము వికలావస్థను పొందును.
**ఖల:** నీచ యందున్న గ్రహము ఖలావస్థను పొందును.
**భీతము:** అతిచారము యందున్న గ్రహము భీత్యావస్థను పొందును.

ఉచ్ఛ స్థానమున ఉన్న దీప్తుడు, స్వక్షేత్రమున ఉన్న స్వస్థుడు, మిత్రక్షేత్రమున ఉన్న ముదితుడు, శుభవర్గమున ఉన్న శాంతుడు, సూర్యునకు దూరమున ఉన్న శక్తుడు, అస్తంగతుడైన వికలుడు, యుద్ధమున పరాజితుడైన పీడితుడు, పాప వర్గమున ఉన్న ఖలుడు, నీచ అందు ఉన్న భీతుడు అని అంటారు. అలాగే సూర్యుడి సామీప్యాన్ని ఆధారంగా చేసుకుని గ్రహగతులను నిర్ణయిస్తారు. సూర్యునితో చేరి ఉన్న గ్రహము అస్తంగత గ్రహం అంటారు.సూర్యునికి రెండవ స్థానంలో ఉన్నశీఘ్రగతిని పొందిన గ్రహం అంటారు. సూర్యుని నాల్గవ స్థానమున ఉన్న గ్రహాన్ని మందుడు అంటారు. సూర్యునికి అయిదు ఆరు రాశులలో ఉన్న గ్రహం వక్రగతిని పొందిన గ్రహం అంటారు. సూర్యునికి ఏడు ఎనిమిది స్థానాలలో ఉన్న గ్రహం అతి వక్రగతిని పొందిన గ్రహం అంటారు.సూర్యునికి తొమ్మిది, పది స్థానాలలో ఉన్న గ్రహం కుటిలగతి పొందిన గ్రహం అంటారు. సూర్యునికి పదకొండు, పన్నెండు స్థానాలలో ఉన్న గ్రహాన్ని అత్యంత శీఘ్రగతిన ఉన్న గ్రహం అంటారు.

**విమర్శలు**

జ్యోతిష్యాన్ని హేతువాదులు, శాస్త్రవేత్తలు తీవ్రంగా విమర్శిస్తున్నారు. జ్యోతిష్యులు ఇప్పుడు కూడా భూకేంద్రక సిద్ధాంతాన్ని ప్రామాణికంగా భావిస్తున్నారు. వీరు నికోలాస్ కోపర్నికస్ ప్రతిపాదించిన సూర్య కేంద్రక సిద్ధాంతాన్ని అంగీకరించరు. భూమి నీడ చంద్రుని మీద పడడం వల్లే గ్రహణాలు ఏర్పడతాయన్న ఆర్యభట్టు సూత్రీకరణని కూడా వీరు అంగీకరించరు. వీరు ఇప్పుడు కూడా ఉనికిలో లేని రాహుకేతువులని నమ్ముతారు.

**సమాధానాలు**

జ్యోతిషం సూర్య కేంద్రక సిద్ధాంతప్రకారము చెప్పబడినదే. భూమి సూర్యుని చుట్టూ తిరగడం వలన ఏర్పడే మార్పులు జ్యోతిష శాస్త్రం స్పష్టంగా వివరిస్తున్నది. జీవులు భూమి మీద బ్రతుకుతున్నాయి కానీ సూర్యుని మీద కాదు. అందుకే భూమిని కేంద్రంగా తీసుకోవడం జరిగింది. ఇది చాలా అంతరార్థం కలిగిన విషయము. జ్యోతిష శాస్త్రజ్ఞానం ఖచ్చితంగా అవసరం.

రాహుకేతువులు భూకక్ష్య మరియు సూర్యకక్ష్యల ఖండనబిందువులు. అందుకే జన్మకుండలిలో అవి ఎదురెదురుగా ఉంటాయి. అందుకే వాటిని ఛాయాగ్రహాలు అంటున్నాము.

## పంచకరహితం అంటే

ఏదైనా ముహూర్తమును నిర్ణయించ దలచుకున్నప్పుడు ఆ ముహూర్తమునకు పంచక రహితం అయ్యిందో లేదో చూసుకోవాలి. ముహూర్త సమయానికి ఉన్న తిథి - వార - నక్షత్ర - లగ్న ములు అను నాలుగింటిని కలిపి తొమ్మిదిచే భాగించగా వచ్చిన శేషం 1 తప్ప మిగిలిన బేసి సంఖ్యలైతే శుభం.
అదే శేషం 1 అయితే మృత్యు పంచకం. ఇది అస్సలు మంచిదికాదు. ఆ ముహూర్తమునకు చేసే శుభకార్యము వలన మృత్యువు సంభవించ వచ్చును.

2 అయితే అగ్ని పంచకం. దీని వలన అగ్నిప్రమాదములు జరుగుతాయి.
4 అయితే రాజ పంచకం. అనుకోని అవాంతరాల వలన కార్యం ఆగిపోవచ్చు.
6 అయితే చోర పంచకం. కార్యక్రమంలో కొన్ని దొంగలచే దొంగిలించ బడతాయి.
8 అయితే రోగ పంచకం. కార్యక్రమంలో ప్రధాన వ్యక్తులు రోగముచే బాధపడతారు.

కనుక శేషంగా 1,2,4,6,8 అను ఐదు సంఖ్యలు ( పంచకములు ) వస్తే అవి శుభప్రదం కాదు. ఆముహూర్తమును వదిలి పెట్టవలెను.

అయితే తప్పని సరి పరిస్థితులలో .....
చోర రోగ త్యజే రాత్రౌ దివారాజాగ్ని మేవచ
అహోరాత్రం త్యజేత్ మృత్యుః పంచకాని విచారయేత్
అని చెప్పుటచే చోర, రోగ పంచకములను రాత్రి ముహూర్తంలో త్యజించాలి( పగలైతే ఉపయోగించ వచ్చును ). రాజ, అగ్ని పంచకములను పగటి ముహూర్తాలలో వదిలిపేయాలి ( రాత్రి స్వీకరించ వచ్చును ). మృత్యు పంచకమును ఎల్లప్పుడూ వదిలిపేయాలి.

మృత్యు, అగ్ని, రాజ, చోర, రోగ ములను 'పంచకము' అంటారు. ఇవి 'రహితం' చేసుకుని ముహూర్తము నిర్ణయించడాన్నే " పంచక రహితం " అంటారు.
ఉదాహరణ : 19- 01-2012 సా.గం. 17-04 ఏదైనా శుభముహూర్తం నిర్ణయించాలనుకున్నాం.
ఈ సమయానికి ( ముహూర్తానికి ) పంచక రహితం అయ్యిందో లేదో చూద్దాం.

తిథి మొదలైనవి పంచాంగంలో చూసుకోవాలి.

19 తేదీ నాడు గురువారం, ఏకాదశి రా. 7.30 వరకు, అనూరాధ నక్షత్రం రా. 7-10 వరకు ఉన్నాయి. ఈ రోజు సా. 03-14 నుండి 05-26 వరకు మిథున లగ్నం ఉంది.

వారం గురువారం - ఆదివారంనుంచి మొదలుపెడితే గురువారం ఐదవది. అనగా దీని సంఖ్య 5 అవుతుంది.

తిథి సాయంత్రం 7-30 లోపే మన ముహూర్తం ఉంది కనుక ఏకదశి తిథినే తీసుకోవాలి. తరువాత అయితే ద్వాదశి తిథిని తీసుకోవాలి. ( కొందరు సూర్యోదయానికి ఉన్నతిథినే ఆ రోజంతా లెక్కించాలి అంటున్నారు. కానీ అది సరి అయినది కాదు. ఆ సమయానికి ఏ తిథి ఉంటే అదే తీసుకోవాలి. ) కనుక ప్రస్థుతం ఏకాదశి తిథి. అంటే పాడ్యమి నుండి మొదలు పెడితే ఏకాదశి 11 వ తిథి అవుతుంది. అనగా దీని సంఖ్య 11 అవుతుంది.

నక్షత్రం అనూరాధ. అశ్వని మొదలు అనూరాధ 17 వ తార. కనుక దీని సంఖ్య 17 అవుతుంది.

లగ్నం మిథునం. మేషం మొదలు మిథునం 3 వ రాశి కనుక దీని సంఖ్య 3 అవుతుంది.

ఇప్పుడు ఇవన్నీ వరసగా రాసుకుని కూడదాం.

తిథి + వారము + నక్షత్రము + లగ్నము

ఏకదశి + గురువారం + అనూరాధ + మిథునం

11 + 5 + 17 + 3 = 36 దీనిని 9 తో భాగహరించాలి.

9) 36 ( 4
   36
----------

**శేషం 0**

-----------------

సున్నా అంటే 9 గా భావించాలి. తొమ్మిది 'బేసి' సంఖ్యకనుక ఈ ముహూర్తానికి పంచక రహితం అయినది.

## కరణం

తిథిని రెండు భాగాలు చేస్తే కరణం అవుతుంది. కరణం అనగా చేయునది అని అర్థం. ఒక పక్షంలో కరణాలు రెండు సార్లుగా వస్తాయి.

**1. భవ (సింహ):** ఈ కరణం నందు జన్మించిన సాహసము కలవాడు, ప్రసిద్ధుడు, బలము పరాక్రమము కలవాడు, గుణవంతుడు, వనము పర్వతములందు సంచరించువాడు, దీర్ఘాయుష్షు గలవాడు, అరిష్టం గలవాడు అయి ఉండును.

**2. బాలవ (పులి):** ఈ కరణం నందు జన్మించిన హింసాశీలుడు, పరులకు ఉపద్రవం చేయువాడు, తేజస్వి, అల్పాయుష్కుడు, బంధువులు తక్కువ ఉన్నవాడు, స్వతంత్ర శీలుడు అయి ఉండును.

**3. కౌలవ (పంది):** ఈ కరణం నందు జన్మించిన ఒకొక్కసారి సుఖం, ఒకొక్కప్పుడు దుఃఖం అనుభవించు వాడు, రాజ్యము, యశస్సు, పశువులు, వీర్యము, గలవాడు అయి ఉండును.

**4. తైతిల (గాడిద):** ఈ కరణం నందు జన్మించిన చపలుడు, దారణశక్తి గలవాడు, స్థిరవాసము లేని వాడు, పరాధీనుడు, స్వతంత్రం లేనివాడు, బుద్ధి శక్తి లేని వాడు అయి ఉండును.

**5. గరజి (పీనుగా):** ఈ కరణంలో జన్మించిన విశాలమైన ముఖం, చాల కాలం విరోధం ఉంచుకొనే వాడు, బలవంతుడు, చాల భక్షించువాడు, సుందరుడు, ప్రసిద్ధుడు, చాల వ్రతములు చేయువాడు అయి ఉండును.

**6. వనిజ (పశువు):** ఈ కరణంలో జన్మించిన పరస్త్రీ ఆశక్తి కలవాడు, భయ చంచలుడు, చెడు వ్యాపారములు చేయువాడు, వ్యాధి పీడితుడు, ఎక్కువ కోర్కెలు కలవాడు అయి ఉండును.

**7. విష్టి (చద):** ఈ కరణం లో జన్మించిన బంధువులతో కలహించువాడు, జీవించుటకు మార్గం తక్కువ ఉన్నవాడు, భారం వహించువాడు, విషనేత్రుడు, అల్పబుద్ధి గలవాడు అయి ఉండును.

**8. శకున (పక్షి):** ఈ కరణం లో జన్మించిన త్రికాలములు తెలిసినవాడు, అల్పధనం కలవాడు, ఎల్లప్పుడూ దుఃఖం కలవాడు, అన్ని పనుల యందు ఆశక్తి కలవాడు అయి ఉండును.

**9. చతుష్పాద (జంతువు):** ఈ కరణం లో జన్మించిన సర్వ శాస్త్రములు యందు సమర్థుడు, రోగి, మాటకారి, బుద్ధిమంతుడు, విద్య గలవాడు, సంపద, , దీర్ఘాయుష్షు గలవాడు అయి ఉండును.

**10. నాగవ (పాము):** ఈ కరణం లో జన్మించిన ప్రసిద్ధుడు, బుద్ధి మరియు విద్య గలవాడు, అందరిని కోపించువాడు, పాప కార్యములు రహస్యముగా ఉంచువాడు, స్వతంత్రుడు అయి ఉండును.

**11. కింస్తుఘ్న (పురుగు):** ఈ కరణంలో జన్మించిన ఇతరుల పనులు చేయువాడు, అల్పాయుష్షు గలవాడు, అనుభవ సుఖం లేనివాడు, పాపకార్యాలు రహస్యముగా చేయువాడు అయి ఉండును.

**కరణఫల విశేషములు:**

శుద్ధ పక్షం నందు జన్మించిన వారికి కరణ ఫలములు పుష్టిగాను, కృష్ణ పక్షం నందు జన్మించిన కరణ ఫలములు ధనం, బంధం, మొదలగు వాటికి హాని చెప్పవలెను. శకున, చతుష్పాద, నాగవ, కింస్తుఘ్న ఈ నాలుగు స్థిర కరణములు. ఈ కరణములు నందు జన్మించిన స్థిరమయిన కర్మములు చేయును.

భవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వనిజ, విష్టి ఈ 7 చర కరణములు నందు జన్మించిన అనేక రకములు అయిన కార్యములను చేయును.

## గ్రహాలు గృహ భాగాలు.

1. **రవి** : సింహ ద్వారం .
2. **చంద్రుడు** : స్నాన శాల నీటి తోటి
3. **కుజుడు** : వంటిల్లు, బొగ్గులు కట్టె
4. **బుధుడు** : పఠన మందిరం
5. **గురువు** : ధనాగారం పూజ మందిరం.
6. **శుక్రుడు** : ఆహార పదార్థాల గది శయన మందిరము గృహ ఆలకరణం ఉద్యనవనం.
7. **శని** : పాత సామాను గోడుకు చెప్పులు పెట్టె గది సేవకుల గది మరుగు దొడ్డలు.
8. **రాహు** : అవసరం లేని వస్తువులు దాచే చోటు.
9. **కేతువు** : ధ్యాన మందిరము ఏకాంత మందిరం.

## ప్రమాణిక గ్రంథం లో జాతకుని యెక్క ఉపాధి వివరాలు .

**రవి** : ఉన్నత అధికారి, ప్రభుత్వ అధికారి రాజకీయ నాయకుడు.

**చంద్రుడు** : నీటి పారుదల శాఖ, ధాన్యం వస్త్రం , గృహ నిర్మాణం పాల వ్యాపారం.

**కుజుడు** : రక్షణ శాఖ పోలీసు శాఖ ఆయుధ పరికరాల అమ్మకం లోహ యంత్రాలు మార్షల్ ఆర్ట్స్ అగ్ని కర్మ బంగారం వస్తువులు తయారు చేయుట

**బుధుడు** : గణకులు లేఖికులు అనువాదకులు ప్రచారం ప్రసారం వార్త తంతి తపాలా నిఘంటువు నిర్మాణం రాయబారి అనుకరణ నాటక రంగం

**గురుడు** : కోశాగారం ద్రవ్య ముద్రణ ఆద్యుడు నిధి నిక్షేపాలు.

**శుక్రుడు** : లలిత కళలు వినోదాల శాఖ ఆహార శాఖ ప్రదర్శనలు క్రీడలు అలకరణలు వ్యవసాయ శాఖ.

**శని** : కూలి పని కాలి నడక తో చేసే పనులు కర్మాగారం పూరతన వస్తు శాఖ మట్టి పని కసాయి తోళ్ళు పరిశ్రమ కేశాలతో చేసే పని.

**రాహు** : వాహనాలు రిపేర్ చేయు పని నకిలీ సరుకుల అమ్మకం రహదారీ నిర్మాణం రిప్రజెంటేటివ్స్.

**కేతువు** : తరచుగా ఉపాధి లో మార్పులు కలిగి వుండుట చెయు పని ఆశ్రద్ధ సాధువులగా జీవించుట.

## జాతకము - నవమ భావము

ఈ భావము వలన పిత్రుభాగ్యము, గురువు, దయ తపస్సు, స్వభావము, దానము మొ విషయములు చెప్పవచ్చును.

తండ్రి జన్మలగ్నమునకు 10 వ రాసి యందు జన్మించిన పుత్రుడు, తండ్రితో సమానమైన గుణములు కలిగి యుండును.

తండ్రి జన్మ లగ్నమునందును, దానికి మూడవ లగ్నమున జన్మిచిన వాడు పిత్ర ధనము ఆశించును.

తండ్రి జన్మ లగ్నమునకు 7వ, 8వ రాసులలో పుట్టిన వాడు తండ్రి మాటవినక దూషించును.

తండ్రి జన్మ నక్షత్రమునకు 8, 9, 10 నక్షత్రములలో పుట్టిన జాతకుడు, పుత్రులు మనుమలు కలిగి తండ్రి మాట నేరవేర్చును.

తండ్రి జన్మ నక్షత్రమునకు 11వ, 12వ,13వ నక్షత్రములలొ జన్మించిన, దూరదేశములలో ఉండి, తండ్రికి కష్టము కలిగించును.

9వ ఇంటి అధిపతి, లగ్నమున 3వ ఇంట, 9వ ఇంట ఉన్న జాతకులు ఉత్తములు, శ్రేష్ఠులు అగుదురు. నవమాధిపతి కేంద్ర, కోణములలో నుండి శుభాగ్రహములు కలిసిన, చూచుచున్న, అట్టి జాతకుడు ఎక్కువ ధనము సంపాదించును.

లగ్నాధిపతి ఏకాదశ స్థానమున ఉండి, భాగ్యాదిపతి భాగ్యస్తానమున, దశామాధిపతి దశమస్థానమున నున్న అమిత ధనము సంపాదిమ్చును.

భాగ్యాధిపతి, త్రుతీయాదిపతితో కలిసి శుభగ్రముల చూపు కలిగియున్న సోదర సౌఖ్యము కలుగును. పంచామాధిపతి 9వ ఇంటనున్న, నవమాధిపతితో కలిసియున్న, వీక్షణ కలిగిన, పుత్రకారకుడు 5వ ఇంట నున్న పుత్రులవలన ధనము కలుగును.

సప్తమాధిపతి నవమున, నవమాధిపతి సప్తమమున ఉండి కళత్రాకారకునితో (శుక్రుని తో) కలిసియున్న భార్యమూలక ధనలాభము ఉండును. అనగా భార్య ఉదోగము చేయుటయో, ఆస్తికలిగి ఉండుటయో సంభవించును.

జాతక చక్రంలో శుక్రుడు బలయుతుడై దశమ భావం తో సంబంధం కలిగి లగ్నాత్ మరియు చంద్ర లగ్నాత్ బలమైన స్థానం లో బుధుడు తో యతి పోందిన జాతకుడు ఇంజనీరింగ్ విభాగం లో ఉద్యోగం చేయును.

దశమాధిపతి కర్కాటకాంశములో శనితో యతి లేదా వీక్షణ కలిగి వుంటే జాతకుడు వ్యయసాయ ప్రదర్శకులు అవుతారు.

దశమాధిపతి బుధుడుతో యతి వలన లేదా చూడబడిన దశమ భావం బుధుడు తో కలిసినను లేదా చూడబడినను జాతకుడు ఉపాధ్యాయుడు అవుతారు.

## గ్రహములు

గ్రహమనగా గ్రహించునది. లాగబడునది అని యర్థము. రవి, చంద్రుడు, కుజుడు, రాహువు, గురువు, శని, బుధుడు, కేతువు, శుక్రుడు అనునవి నవగ్రహములు. ఇందులో రవి, చంద్రుడు-మండల గ్రహములు.

కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని-తారాగ్రహములు. రాహువు, కేతువు-ఛాయాగ్రహములు.

ఈ గ్రహములు చారసలుపు మార్గమనబడు (అండాకారకక్ష్య) కాంతి వృత్తమును చూపు సప్తవింశతి నక్షత్రములున్నవి. ఈగ్రహములు సూర్యకుటుంబములోనవి. మధ్యస్థడగు సూర్యుణ్ణాశ్రయించి నియమబద్ధములైఖగేమున సంచారమొనర్చుచున్నవి. ఈచక్రమును జోతిశ్చ క్రమనుచున్నారు.

### రవి (సూర్యుడు)

విశాఖ అతని జన్మ నక్షత్రము. కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢల కధిపతి. ఆత్మకారకుడు, క్షత్రియుడు, నల్లబడియు, ఎర్రనికాంతి గలశరీరము కలవాడు. 50 సంవత్సరముల వయస్సు గలవాడు. దండనీతి కధిపతి. తిర్యగ్లోకాధిపతి ఆస్తి ఎముకలు, దేవ పూజాగృహములు కధిపతి. బ్రహ్మాంశనొందినాడు. దేహతాపము పీడ, ఊర్ధ్వ దృష్టి గలవాడు.రాజసుడు, రాజగ్రహము, దయ, స్థిరత్వము, సత్వార్జితములు, దేవబ్రాహ్మణ భక్తి, వినయముల ప్రసాదించును. తూర్పుదిక్కున కధిపతి. ధశమ

భావస్థితిబలయుతము. చతుర్థ భావస్థితి బలహీనము. అగ్నివ్యాధి, జ్వరము, క్షయ, అతిసారము, మనోవ్యసనములకు కారకుడు. నమస్కారసమయము శుభము. శ్రీమన్నారాయణుడు అధిదేవత. శుష్కగ్రహము శ్రీరామావతార రూపము. తేజోతత్వ గ్రహము తేనె వలె నేత్రములు కలవాడు. చతురస్రాకారము, మేధావి, పొట్టి కేశసంద కలవాడు. దినమందు, గ్రీష్మఋతువునందు, బలవంతు, అర్థపాపి, పృష్టోదయగ్రహము, పక్షిరూపము, తామ్రవర్ణము కలిగినవాడు. చతుష్పాదుడు. సదాశివరూపి, పంచేంద్రియములలోత్వర్కునధిపతి. 1, 4 సంఖ్యరూపి, పాడ్యమి, ఏకాదశి, ఈతని తిధులు సామాన్యపు ఎత్తగలవాడు. కాలుడు-ఉపగ్రహము.

**బలస్థానములుః-** స్వోచ్చరాసి, స్వరాసి,స్వహోర, ద్రేక్కాణ నవాంశలు,ఆదివారము ఉత్తరాయణము.
మధ్యహ్నకాలము.రాత్రి ప్రవేశకాలము,మిత్ర గ్రహ నవాంశారంభమున,దశమ భావ మిత్రక్షేత్రములదు మధ్యమబలండు. ఏ రాసియందైనను ప్రధమద్రేక్కాణమున బలంవంతుడు.

**బలహీనస్థానములపః-** అంత్య ద్రేక్కాణము, అస్తమయమందు, గ్రహణ సమయమున చతుర్థ భావమున, మేషం, సింహ, ధను, మీనములు లగ్నలేక దశమ భావములై అందున్న, మేష, సింహ, ధనురాసుల ప్రధమ నవాంశనుబలమంతుడు.
వ్యాధులుః అగ్నిరోగము, జ్వరము, దీపనము, క్షయ, అతిసారము, మనోవ్యసనము.
**పర్యాయనామములుః** ఆదిత్యః, అర్కః, భానుః, భాస్కరః, దివాకరః, మార్తాండః, సవితాః, హేళిః, తీక్ష్ణాంశుః, మిహిరః, తపనుడుః, దినకరుడు, భానుడు, పూష అరుణుడు, అర్కుడు.

**చంద్రుడు.**

కృత్తిక ఈతనిజన్మనక్షత్రము. రోహిణి హస్తశవణముల కధిపతి,మనః కారకుడు. తెల్లని దేహచ్ఛాయగలవాడు. జలాశయములందువసించును. జలతత్వగ్రహం ఉప్పురుచి గలవాడు. వాతశ్లేష్మములు మనోవ్యాధిని కలుగజేయను. సమదృష్టి గలవాడు. రాజగ్రహము, దయసత్వార్జతము, దేవబ్రాహ్మణ భక్తి వినయము లక్షణములు, స్త్రీ గహము, అద్రి ప్రదిక్షణ సమయము అశుభము. లక్ష్మీదేవి అధిదేవత. గుండ్రని ఆకారము గలవాడు.నూతన వస్త్రములను ధరించుట వాతశరీరి. శ్రీకృష్ణావతారము, అందమగు నేత్రద్వయము గలవాడు. చతురతతో సంభాషించువాడు. కాముకుడు. పూర్ణకళావంతుడై శుభుడు. కళాహీనుడైపాపి, సర్వాకారి, సంచార శీలుడు. మృదువాక్కుగల వివేకి, ధీమంతుడు, అల్పపుత్రకారకుడు బహుపాదములు గలవాడు. గణపతి, శక్తి శ్రీవిద్యలకధిపతి విదియ, ద్వాదశి తిధులు, యవర్గము ఈతని సంబంధము 70 సంవత్సరముల వయస్సు గలవాడు. పొట్టివాడు పరిధి ఉపగ్రహము, అధిపత్యములు దాననీతి, పితృలోకము, రక్తము, మనుష్యులు, శిరలు, ధనములు, పెద్దనరములు, కండరములు, శుక్లము, స్త్రీగుహ్యావయవములు. స్థానములు నూలు వస్త్రములు, వ్యాధులు-పాండురోగము, జలదోషము, కామెర్లు, స్త్రీ సంధవ్యాధులు, మత్తు, ఉబ్బసము, నీళ్ళవిరేచనములు, ఉన్మాదము, రుచిహీనత, నీరసము, అజీర్ణము, పచ్చకామెర్లు, రక్తదోషము, బాలగ్రహపీడ, జలప్రమాదములు,కలరామొదలగున్నవి.
**బలస్థానములుః-** స్వక్షేత్రము, స్వోచ్చ, స్వవార, ద్రేక్కాణ, హోర, నవాంశలందు, రాశ్యంత మున శుభగ్రహ విక్షణ నొంది రాత్రులందు దక్షిణాయన కాలమున, ఋక్ష సందులు తప్ప ఇతర సంధికాలములు, శుభగ్రహయుతి లేక వీక్షణ నొందినప్పుడు భావ అంత్యద్రేక్కాణములన, మిధున, కన్య, ధను, మీనముల, ప్రధమహోరను, లగ్నలేక సప్తమ భావస్థితి

నొందినప్పుడు, మిధున,కన్య లగ్నములైనను, ధను ప్రధమభాగము, మీనము సప్తమభావములైనను, వృషభము, ధనుద్వితీయ హోర 7 లేక 10 భావములైనను, మిధున, కర్కాటకములు చతుర్థము లైననుబలవంతుడు.

**వ్యాధులుః-** పాండురోగము, జలదోషము, కావిలా రోగము, పీనస, స్త్రీమూలకమైన రోగము, శ్వాశ, బోద, జరము.

**పర్యాయనామములుః-** శశీ, శశాంకః, విధుః, సోమః, నిశాకరః, శీతాంశుః, ఉడునాధః ఇందుః, శీతద్యుతి, ఉడుపతి, మృగాంకుడు, ఇందువు, గ్లే.

## కుజుడు

పూర్వషాడ ఈతని జన్మనక్షత్రము, మృగశిర, చిత్త, ధనిష్టల కధిపతి, శ్రీలక్ష్మీనృసంహావతారము, క్షత్రియుడు, సంరక్తబలము గలవాడు. బాలుడు, శైలాటడవు లయందు సంచరించును. చేదు-రుచి-తిర్యగ్లోకము నొందును. తేజోతత్త్వ గ్రహము, ఊర్ధ్వ దృష్టి గలవాడు. తామసుడు వంచన, మూర్ఖత, కోపము, అల్పత్వము నిద్ర-గుణములు పురుషుడు. బలమునకు కారకుడు. తిలకధారణ సముయము శుభము. అగ్ని-అధిదేవత, శుష్కగ్రహము, పొట్టివాడు, ఎర్రని ఛాయగలవాడు ఉదారుడు. సామాన్య ఎత్తుగలిగిన దత్తపుత్రకారకుడు. పక్కల చుూచు దృష్టియుండును, త్వక్ జిహ్వ, చక్షుగలవాడు, 9సంఖ్య, షష్టి కవర్గములకు చెందిన గ్రహము డమరుకాకాములుగల పురుష గ్రహము, తెలుగుభాష నొందినవాడు. సహజ ముప్పాతిక పాపి. ధూముడు-ఉపగ్రహము

**ఆదిపత్యముః-** దండనీతి, రక్తము, ఎముకలు మజ్జ, అగ్ని, పాకశాలలు, సామవేధము, అహోరాత్రులు, అగ్నియున్న సర్వస్థానములు, యుద్ధములు, ఇంజనీరింగు విద్య, హృదయభాగము.

**బలస్థానములుః-** గ్రహ యుద్ధమందు బలము నొంది, కుంభము లగ్నము కాగా అందుండి సప్తమ భావములగు కర్కట, వృశ్చికము లందు, దశముభావములగు మిధున మకరముల ప్రధమ హోరను, మిధునము దశమమైనను, ధును ప్రథమ ద్రేక్కాణము చతుర్ధమైనను స్వవారమున స్వనవాంశను, స్వద్రేక్కాణమున, మేష వృశ్చిక మకర కుంభ మీనములందు, రాత్రులందు, వక్రించినప్పుడు, రాస్యారంభమున దశమ భావస్థితి నొంది, నీచనొంది సుఖప్రదుడగును. లగ్న అధిభాగలందు శుభఫలదాత.

**వ్యాధులుః** సమస్త శరీర పీడలకు కారకత్వము వహించును. బృహద్బీజము, కఫము, శస్త్రము, అగ్ని, చర్మవ్యాధి, అతిమూత్తము, దంతవ్యాధి, కురుపులు, వ్రణములు, మశూచి దారిద్ర్యము.

**పర్యాయనామములుః-** ఆరః, వక్రః, మహీజః, రధిరః, రక్తః, అంగారకః, కుజః, భౌమః, లోహితాంగః, మహీసుతః, క్రూరనేత్ర.

## రాహువు

భరణి ఈ గ్రహనక్షత్రము. ఆరుద్ర, స్వాతి, శతభిషముల కధిపతి. వరహావతార అంశ నొందిన గ్రహము. భేదనీతికి అధిపతి మ్లేచ్ఛుడు మిక్కిలి నల్లని దేహి. పైశాచికత్వముకలిగిన శుక్లసంబధ పీడాకరుడై దక్షిణ దిశకధిపతి. విచారము, దుఃఖము కర్మ ఈతని అధీనములు. తిలలు దర్భలు-ద్రవ్యములు, రత్నపరీక్షా సముయము శుభము. రాక్షసుడు అధిదేవత విచిత్ర వర్ణము గల క్రూర గ్రహము. పూర్ణపాపి. 100 సంవత్సరములు వయస్సు గలవాడు. గృహకోణము నివాసస్థానము. అధోవృష్టి గలిగి మరణ కాలము, సర్పము, దాచిన ధనము జూదముల తన ఆధీనమందుంచుకొన్నవాడు. శాస్త్ర ధర్మములకు విరోధి. తామసుడు బహు పాదములుగల శీర్షోదయ గ్రహము పొడగరి పాత-ఉపగ్రహము.

**బలస్థానములుః-** మేష వృశ్చిక కుంభ కన్య వృషభ కర్కటములందు, దశమ భావమున బలవంతుడు 9, 10, 11 భావములందుండియొగప్రదుడు. పంచమస్థితి ఉపాసకులకు శుభము.

**వ్యాధులుః-** అపస్మారము, మశూచి, క్రిమివ్యాధి, భూతపీడలు అరుచి, కుష్ఠు క్రిమిరోగము తానున్న స్థానము నుండి 3, 11 స్థానములు వీక్షించును.
**పర్యాయనామములుః-** తమః, సురోగః, స్వర్భానుః, విధుంతుదః, పాతః, సైంహికేయః, భుజగాఖ్యః, అసర్పము, అసురుడు, ఫణి, తమస్సు, సైంహికేయుడు అగును.

## గురువు

పూర్వఫల్గుణి ఈగ్రహ జన్మనక్షత్రము నామతార పునర్వసు, విశాఖ, పూర్వభాద్రల కధిపతి, వామరుూపి, ఆకాశతత్వ గ్రహము, పూర్ణశుభుడు. జ్ఞానసుఖకారకుడు, బ్రాహ్మణుడు, గౌరవర్ణము గలిగి 30 సంత్సరములు వయస్సుకలవాడు. సామనీతి కధిపతి. విద్వత్ గ్రామవాసి, దేవలోకమీతనిస్థానము. ధనపుత్ర పీడలుగలవాడు. ఉత్తరదిక్కున కధిపతి. మెదడు ఋగ్వేదము. ధనాగారము, విష్ణ్వంశ ఈతని కారకత్వములు, గుణాధికుడు, ధనజ్ఞాన విజ్ఞానాది లక్షణ యుతుడు. దేవతాధిపతి. పురషుడు సత్వగుణ ప్రధానుడు. మనస్థైర్యము, విశాల బుద్ధిగలవాడు. విష్ణుభక్తి పరాయణుడు శ్లేష్మాదిక స్వభావి. బలసిన శరీరము, స్వర్ణచాయ, బంగారు వర్ణపు కండ్లు శిరోజాలములు కలవాడు. మాసమీతని కాలము. తూర్పుదిక్కును సూచించును. పసుపు పచ్చని వస్త్రము ధరించును. ఉభయోదయ గ్రహము. బహు పుత్రప్రాప్తికి కారకుడు. దేవమంత్రి, ఋగ్వేద, వేదాంత యోగాదుల యందు ప్రీతియుండును.
అండాకారము గలద్విపాదగ్రము. శీర్షోదయగ్రహము, పంచేద్రియముల శక్తిగలవాడు. 3.సంఖ్య. అష్టమి, తదియ, త్రయోదశి తిధులు, త వర్గు గ్రహము, పుణ్యనదులు ఈతని స్థానములు. జీర్ణశక్తి అధికముగా కలవాడు. యమ కంటకము ఉపగ్రహము.
**బలస్థానములుః-** మేషవృ షభ, సంహ, వృశ్చిక, ధను, మీనములు, లగ్నలేక చతుర్ధ లేకదశమ భావములై అందు స్థితినొంది అధిక బలవంతుడు గ్రహయుద్ధమందు జయమునొందు బలవంతుడు. మీన, వృశ్చిక, ధను, కర్కటకముల నిజవర్గ మందు నిజవారమున ఉత్తరాయనమున, రాసి మధ్యమున, కుంభమందుబలవంతుడు. లగ్నచతుర్ధ దశమ బావములందుండి విశేష ధనదాత, మధ్యద్రేక్కాణమున బలవంతుడు.
**బలహీనస్థానములుః-** సప్తమ భావస్థితిని, తృతీయ ద్రేక్కాణమున, పంచమ భావగతుడై సర్వజాతకముల అనిష్ట ప్రదుడు.
**వ్యాధులుః-** గుల్మవాధి, చెవి భాధలు, పైత్యరోగము, శాపదోషము, సన్నిపాతజ్వరము, శంకరుడు అధిపతి. హేమంత ఋుతువు కాలము-ద్రాక్షరసము, తియ్యని పానీయములు ప్రీతికరము.
**పర్యాయనామములుః-** జీవః, అంగీరసః, వాచస్పతిః, చిత్ర శిఖండిజః, ఆర్యః, బృహస్పతిః, సూరిః, వాగీశః, వచసాంపతిః, మంత్రి, వాచస్పతి, సురాచార్యుడు, దేవేజ్యుడు, జీవుడు.

## శుక్రుడు

పుష్యమి ఈగ్రహ జన్మనక్షత్రము.భరణిపుూర్వ ఫల్గుణి పూర్వాషాఢల కధిపతి.భార్గవరాముని అంశ నొందిన గ్రహము.బ్రాహ్మణుడు. జలతత్త్వముగ స్త్రీగ్రహము. కామము వాంఛలు ఈతని ఆధీనములు. సామునీతికి అధిపతి. జలాశయమునందుండువాడు. తెల్లని దేహకాంతికలిగి 16 సంవత్సరములు వయస్సుకలవాడు. పులుపు రుచి పితృలోకము నొందువాడు. రేతస్సు, శయనగృహములు, సుఖములు, యజుర్వేదములుకధిపతి. సామాన్య దృష్టిగలవాడు. ఆగ్నేయముదిక్కు. రాజసుడు.విష్ణువు ఆధిదేవత, పరిమళ ద్రవ్యముల ప్రీతి గలవాడు. ముత్యము-మణి-తెలుగు భాషప్రియభాష, నిత్యసుఖీసక్తుడు. సుందర శరీరి. గృహసౌఖ్యము. భోగముల ననుభవించును

పక్షముకాలసూచకము. విద్యావంతుడు, ముప్పాతిక సహజ శుభత్వమునొందినవాడు. శీర్షోదయగ్రహము, కర్జూర వర్ణముకలవాడు. వసంతఋతువునకధిపతి-కామశీలుడు. సుఖబల సుగుణములకు స్థానభూతుడు. బంగాళదుంపలు, కృబేజి ఫలవృక్షములు ఈతనిఆధీనములు. త్వక్కు, జిహ్వ, చక్షు ఆఘ్రాణశక్తులు కలవాడు. 6 సంఖ్య, చతుర్థి, నవమి, చతుర్థిని, చ వర్గము ఈగ్రహసంబంధములు, అష్టకోణ రూపమునొందిన సంస్కృత భాషాప్రవీణుడు, కోదండము ఉపగ్రహము.

**బలయుత స్థానములుః-** మధ్యమ ద్రేక్కాణము, మేష సంహ వృశ్చిక కుంభములు లగ్నమై అందు స్థితినొంది బలవంతుడు. దను ద్వితీయహోర వృశ్చికము. మీనము దశమభావము లైనను మకర ద్వతీయహోర చతుర్థ భావమైనను, అందుండి అధిక బలవంతుడగుచున్నాడు. స్వోచ్చను, స్వర్గమందు, స్వవారమందు అవరాహ్ణమందు చంద్ర సంయోగకాలమందు వక్రించి అతిచారమందు బలవంతుడు. బలయుతుడై రవికిముందున్న శుభఫలదాత సప్తమస్థితి పాపము.

**వ్యాధులుః-** రక్తహీనత, కాలేయము, మరియు పైత్యవ్యాధి, పసిరిగ, వీర్యనష్టము, మూత్రవ్యాధి, కాంతిహీనత్వము, మేహరోగము, మూత్రరోగములు, మన్మధవికారము, సుఖవ్యాధి.

**పర్యాయనామములుః-** భృగుః, భృగుసుతః, అచ్ఛజః, శితః, ఉశనాః, దైత్యపూజ్యః, కావ్యః, కవిః, కావ్యుడు, సితుడు, భృగుసుతుడు, అచ్ఛుడు, అస్ఫుజిత్తు, దానవేజ్యుడు.

## శని

రేవతి ఈతని జన్మ నక్షత్రము. పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్రల కధిపతి. కూర్మావతారరూపి. వాయుతత్త్వగ్రహము, శూద్రుడు, నల్లనిదేహముగల వృద్ధగ్రహము. దుఃఖములకు నిలయము, భేదనీతి కధిపతి. అధోదృష్టికలవాడు.పశ్చిమ దిక్కునకధిపతి, శైలాటవులందు సంచరించును, నరలోకవాసి, వగరు-రుచితామసుడు, మూర్ఖత అల్పగుణము, కోపము నిద్రగలవాడు, నరకాధివాసులకు నిలయుడు, నపుంసకుడు, వైశ్వదేవసమయు అశుభము. కలిపురుషుడు అధిపతి. ఈశాన్యదిక్కుయందు ప్రీతిగలవాడు. రతియందు ధృడవాంఛగలవాడు. కఠిన చిత్తము కృశంచినశరీరము కుత్సిత స్వభావములుండును. ఆకస్మిక ప్రమాదములకు మూలము, పసుపు పచ్చని నేత్రములు, వాతనొప్పులు, పెద్దపలువరస, సోమరి తనము గల కుంటి రూపము గలవాడు. సంవత్సర కాలరూపి, పూర్ణపాపి, కూరుడు, పృష్ఠోదయ చతుష్పాద గహము. శైలాటవులందు సంచరించును. కషాయము రసము-దత్తపుత్రకారుడు. శిశిర ఋతువునకధిపతి. 8సంఖ్య, పంచమి, దశమి పూర్ణిమ, అమావాస్య, పవర్గ ఈతని సంధంములు మాందిఉపగ్రహము.

**బలస్థానములుః-** అంత్యమ ద్రేక్కాణము, తుల కుంభములు లగ్నలేక చతుర్థములైనను, సింహము దశమమైనను, పృష్టోదయ రాసల తప్పఇతరములు సప్తభావములు కాగా అందుండి అధిక బలవంతుడు. తులా మకర కుంభములు. సప్తమభావమున దక్షిణాయనమున, స్వద్రేక్కాణ, స్వకవాంశ, స్వదయందు రాస్యంతమున, కృష్టపక్షమున, వక్రించిబలవంతురు.

**వ్యాధులుః-** మల మూత్రవ్యాధులు, ప్లీహము, జలుబు, దంత శైధిల్యత, డిఫ్తీరియా పయోరియా, వెన్నుముక జబ్బు, ఎముకల వ్యాధులు, క్షయ, కీళ్ళవాతము, చర్మవ్యాధులు, కాన్సర్, సంధిరోగము, పిశాచభాధ, దొంగలవలనబాధ, అజీర్ణము, ఆస్తమా, దారిద్ర్యము, చెముడు, గర్భదోషము.

**పర్యాయనామములుః-** కోణః, మందః, శనిః, కృష్ణః, సూర్యపుత్రః, యమః, పంగః, శనైశ్చరః, సౌరిః, కాలః, ఛాయాసుతః, తరణి తనయుడు, కోణుడు, అర్కిమందుడు.

## బుధుడు

శ్రవణము ఈగ్రహ జన్మనక్షత్రము, ఆశ్లేష, జ్యేష్ఠ, దేవతలు, కధిపతి బౌద్ధావతార, కరూపి, వాక్కు చర్మము స్థలములు, దూర్వాశ్యామలు కాంతి గలిగిన కౌమార వయస్సుడు, షడ్రుచులు కలవాడు. నరలోక వాసి, అధర్వణ వేదాధిపతి, తిరగ్ద్రుష్టి కలవాడు. వాయువ్యస్థానము, రాజస గుణవంతుడై రాజ్యాధికారము, కావ్యాదిరచనలు, విద్యాభిలాషలు కలవాడు. తిర్యగ్జంతువులు కధిపతి. నపుంసకుడు సత్వగుణప్రధానుడు. గంధపుష్పాద్యాభరణ సమయము శుభము. వాయువు ఆధిదేవత శుష్కగ్రహము.

మాతామహరూపము, ఉత్తమలోక సూచకుడు, ఆంధ్రభ్యాషా పాండిత్యము గలవాడు. సౌమ్యభాషి హాస్యప్రియుడు, పాపగ్రహయుతినొంది పాపి, శుభులతోచేరిశుభుడు. సహజ అర్ధశుభత్వము కలవాడు. శీర్షోదయ గ్రహము పక్షివంటి ఆకారము కలవాడు. విద్వద్గ్రమవాసి, హరితకలవాడు. నీట నుదికిన ప్రస్తదారి. క్రీడాలయము స్థానము. కటాక్ష దృష్టికలవాడు. దత్తపుత్రకారుడు. అధోదృష్టికలవాడు. త్రికోణాకారుడు. ద్విపాదగ్రహము, పొగడరి, పంచేంద్రియములందు త్వక్ జిహ్వల కధిపతి. సప్తమి తిధి, ట వర్గ గ్రహము, 5వసంఖ్య 20సంవత్సరములు వయసు కలవాడు, పృధ్వీతత్వ గ్రహము.

**వ్యాధులుః-** గుహ్యరోగములు, ఉదరవ్యాధి, కుష్టు, అగ్నిరోగము, శూలవ్యాధి, గ్రహణి, ఉన్మాదము, చర్మవ్యాధి, అదృశ్చ వాయురోగము, మందాగ్ని శూలవ్యాధులు.

**పర్యాయనామములుః-** సౌమ్యః, విట్ః, జ్ఞానః, హేమః, సోమజః, భోధనః, తారాతనయుడు, విత్తేబోధన, ఇంద్రపుత్ర.

## కేతువు

ఆశ్లేష ఈతని జన్మనక్షత్రము.అశ్వని,మఖ,ములలకధిపతి.మత్సావతార అంశకలవాడు, చండాల గ్రహము. విచిత్రదేహి, వైరాగ్య ప్రియుడు, జ్ఞానపీడగలవాడు. ఉత్తరదిక్కునకధిపతి. నీచస్నేహము, పరాభవము, శత్రుపీడగలవాడు. ఉపాసనా సమయుడు అశుభము. రాక్షసుడు అధినేత. ఉపకేతు-ఉపగ్రహము. 100 సంత్సరముల వయస్సు గలవాడు. గృహకోణము-నివాస స్థానము-అధోదృష్టి గలవాడు. వ్యసనము గలిగించును. తామసి, సర్పాకారుడు, పీలికల ధరించును. తృతీయ మందుండి రాజయోగ ప్రదుడు లగ్నమందున్న బాలారిష్టముండును.ఏకాదశమున జ్ఞానదీక్షనొసగును.

**వ్యాధులుః-** దురద, విఘూచి, అంటువ్యాధులు, గాయములు, చర్మవ్యాధులు, తీవ్రమగు నొప్పులు, పైత్యవ్యాధి, అధికచెమట, దుఃఖములు, టైఫాయిడు జ్వరము, ఉబ్బసము, విషజ్వరములు తేలుకాటు.

**పర్యాయనామములుః-** శిఖీ, ధ్వజః, ధూమ్రః, ఉత్పాతః, బహురూప్రకృత్, శిరోహీనః, ఘోరరూపః, చిత్రవర్ణః, సుకీతనః.

# నవాంశ రాశి లెక్కించడానికి చాలా సులభమైన పద్ధతి

నవాంశ లెక్కించడానికి రెండు పద్ధతులున్నాయి.ఒకటేమో సూర్యాది గ్రహాల యొక్క నక్షత్ర/పాద సంచారం ఆధారంగా.రెండవది సూర్యాది స్ఫుట గ్రహ పట్టికల ఆధారంగా.ప్రస్తుతం మనం మొదటి పద్ధతిని పరిశీలిద్దాం. మన కుడిచేతి నాలుగు వేళ్ళతో సులువుగా నవాంశ రాశులను లెక్కించవచ్చును.ఏ పట్టికా (Table/Chart) అవసరం లేదు. మన కుడిచేతి నాలుగు వేళ్ళకు ఒక్కొక్క వేలికి మూడు కణుపుల చొప్పున మొత్తం పన్నెండు కణుపులు ఉన్నాయి. చిటికెనవేలు,ఉంగరంవేలు,మధ్యవేలు మరియు చూపుడువేలు పై కణుపులను వరుసగా మేషం, వృషభం, మిథునం, కర్కాటకం రాశులుగా భావించాలి. పై వేళ్ళ మధ్య కణుపులను వరుసగా సింహం, కన్యా, తుల మరియు వృశ్చిక రాశులుగా భావించాలి. పై వేళ్ళ క్రింది కణుపులను వరుసగా ధనుస్సు,మకరం,కుంభం మరియు మీన రాశులుగా భావించాలి. నక్షత్రాలను చిటికెన వేలు మూడు కణుపుల పైననే లెక్కించాలి. అశ్విని నక్షత్రాన్ని చిటికెన వేలు పై కణుపుపై లెక్కించాలి. అంటే అశ్విని నక్షత్రం 4 పాదాలు వరుసగా మేష, వృషభ, మిథున, కర్కాటక నవాంశలౌతాయి. అలాగే భరణి నక్షత్రాన్ని చిటికెన వేలు మధ్య కణుపుపై లెక్కించాలి. అంటే భరణి నక్షత్రం 4 పాదాలు వరుసగా సింహ, కన్యా, తులా, వృశ్చిక నవాంశలౌతాయి. కృత్తికా నక్షత్రాన్ని చిటికెన వేలు క్రింది కణుపుపై లెక్కించాలి.అంటే కృత్తికా నక్షత్రం 4 పాదాలు వరుసగా ధనుస్సు, మకర, కుంభ, మీన నవాంశలౌతాయి. రోహిణి నక్షత్రాన్ని తిరిగి చిటికెన వేలు పై కణుపుపై, మృగశిర నక్షత్రాన్ని మధ్య కణుపుపై, ఆర్ద్ర నక్షత్రాన్ని క్రింది కణుపుపై ఇదే వరుసలో మనకు అవసరమున్న నక్షత్రం/పాదం వరకు లెక్కించడం ద్వారా సులభంగా నవాంశ రాశిని గుర్తించవచ్చును.

ఉదాహరణ : 1) నవంబర్ 6 న సూర్యుడు విశాఖ నక్షత్రం మొదటి పాదంలో ప్రవేశిస్తున్నాడు. పై విధంగా లెక్కించగా 5 పర్యాయాల తదుపరి 6వ పర్యాయంలో చిటికెన వేలు పై కణుపు పైనే విశాఖ నక్షత్రం మొదటి పాదం వస్తుంది.అంటే సూర్యుడు మేష నవాంశంలో ఉంటాడని అర్థం.

2) నవంబర్ 8 న కుజుడు హస్త నక్షత్రం మూడవ పాదంలో ప్రవేశిస్తున్నాడు. పై విధంగా లెక్కించగా 4 పర్యాయాల తదుపరి 5వ పర్యాయంలో చిటికెన వేలు పై కణుపు పై హస్త నక్షత్రం, 3 వ పాదం మధ్యవేలు పై కణుపుపై వస్తుంది.అంటే మిథున నవాంశ.కుజుడు మిథున నవాంశలో ఉంటాడని అర్థం.

3) నవంబర్ 6 న బుధుడు అనురాధ నక్షత్రం రెండవ పాదంలో ప్రవేశిస్తున్నాడు. పై విధంగా లెక్కించగా 5 పర్యాయాల తదుపరి 6వ పర్యాయంలో చిటికెన వేలు మధ్య కణుపు పై అనురాధ నక్షత్రం, 2వ పాదం ఉంగరం వేలు మధ్య కణుపుపై వస్తుంది. అంటే కన్యా నవాంశ.బుధుడు కన్యా నవాంశలో ఉంటాడని అర్థం.

4) నవంబర్ 8న శుక్రుడు స్వాతి నక్షత్రం మొదటి పాదంలో ప్రవేశిస్తున్నాడు.పై విధంగా లెక్కించగా 5వ పర్యాయం చిటికెన వేలు క్రింది కణుపుపైనే స్వాతి నక్షత్రం మొదటి పాదం వస్తుంది.అంటే ధనుస్సు నవాంశ.శుక్రుడు ధనుర్నవాంశలో ఉంటాడని అర్థం. ఈ విధంగా నవాంశ రాశులను లెక్కించాలి.

## తారాబలం

ముహూర్త నిర్ణయంలో ప్రధానమైనది తారాబలం. ఏ చిన్న ముహూర్తానికైనా మన జన్మ నక్షత్రానికి సరిపోయే నక్షత్రమును మాత్రమే తీసుకోవాలి. జన్మ నక్షత్రం నుండి ముహూర్త సమయానికి ఉన్న నక్షత్రం వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను 9 చే భాగహరించాలి. వచ్చిన శేషాన్ని బట్టి ఫలితం క్రింది విదంగా నిర్ణయించాలి.

1 వస్తే 'జన్మతార' అలా వరుసగా....

1) జన్మతార, 2) సంపత్తార, 3) విపత్తార, 4) క్షేమ తార, 5) ప్రత్యక్తార, 6) సాధన తార, 7) నైధన తార, 8) మిత్ర తార, 9) పరమమిత్ర తార.

ఇవేవో అశ్వని, భరణి, కృత్తికల వలే వేరే కొత్త తారలు అనుకోకండి. ఆ 27 నక్షత్రాలకే మన జన్మతారను బట్టి ఈ తొమ్మిది పేర్లు అన్వయించాలి. అంటే 'విద్యార్థి' అనే పేరు గల వ్యక్తి ఉన్నాడు. అతను ఒకరికి కొడుకు, ఒకరికి తమ్ముడు, ఒకరికి భర్త అవుతాడు. అలాగే అశ్వనీ నక్షత్రం ఒకరికి జన్మతార అయితే, మరొకరికి సంపత్తార (సంపదలు కలిగించే తార) అవుతుంది. మరొకరికి విపత్తార (విపత్తులు కలిగించే తార ) అవుతుంది. ఎవరికి ఏమవుతుంది అన్నది వారి జన్మనక్షత్రాన్ని బట్టి నిర్ణయించుకోవాలి.

పైవాటిలో సంపత్తార, క్షేమ తార, సాధన తార, మిత్ర తార, పరమమిత్ర తారలు (2,4,6,8, 9 తారలు) సకల శుభకార్యాలు చేసుకోవడానికి పనికి వస్తాయి. వృత్తి,వ్యాపార సంబంధమైన విషయాలు 'సంపత్తార' లోను, ప్రయాణాది కార్యాలు 'క్షేమతార' లోను, సాధించి తీరాలనుకునే కార్యాలు 'సాధనతార' లోను ప్రారంభించడం మరింత మంచిది.

జన్మతార కొన్ని శుభకార్యాలకు పనికొస్తుంది. కొన్నిటికి పనికి రాదు.

చెవులు కుట్టడం, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, ఉపనయనం, నిషేకం, యాగం, పట్టాభిషేకం, వ్యవసాయం, భూసంపాదన మొదలైన వాటికి జన్మతారను గ్రహించ వచ్చు.

ప్రయాణం, పెండ్లి, క్షౌరము, ఔషధ సేవనం, గర్భాదానం, శ్రార్ధం, సీమంతం, పుంసవనము మొదలైనవి జన్మనక్షత్రంలో చేయరాదు.

ఉదాహరణ : రేవతి నక్షత్రం జన్మ నక్షత్రం అనుకుంటే, ముహూర్త నిర్ణయంరోజు పూర్వాభాద్ర నక్షత్రం ఉంది అనుకుంటే, రేవతికి పూర్వాభాద్ర సరిపోతుందో లేదో తెలుసుకోవాలి. అంటే రేవతి నుండి పూర్వాభాద్ర ఎన్నో నక్షత్రమో లెక్క పెట్టాలి. 26 వ నక్షత్రం అవుతుంది. దానిని తొమ్మితో భాగహరించగా శేషం 8 వస్తుంది. అంటే రేవతికి - పూర్వాభాద్ర ఎనిమిదో తార (మిత్ర తార) అవుతుంది. అంటే శుభం కనుక ముహూర్తము పనికొస్తుంది. శేషం సున్నా వస్తే అది తొమ్మిదిగా గుర్తించాలి.

తప్పని సరి పరిస్థితులలో ముహూర్త నిర్ణయం చేయవలసి వస్తే .....

ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషువర్జయేత్ !

ప్రథమ నవకం లో (1 నుండి 9 తారలలో) మెట్ట మొదటి తారను,

2 వ నవకం లో (10 నుండి 18 తారలలో ) మూడవ తారను,

3 వ నవకంలో( 19 నుండి 27 తారలలో ) పంచమ తారను,

ప్రతీ నవకంలో 7 వతారను ఎల్లప్పుడు వదిలి పెట్టవలెను.

అంటే జన్మనక్షత్రము లగాయతు 1, 7, 12, 16, 23 మరియు 25 నక్షత్రాలను ఎల్ల వేళలా శుభకార్యములలో వదిలిపెట్టాలి.

అంటే సాధారణంగా జన్మ నక్షత్రం నుండి 1,3,5,7,10,12,14,16,19,21,23 మరియు 25 నక్షత్రాలను శుభకార్యములలో వదిలిపెట్ట వలసి ఉన్నది. కానీ కావలసిన సమయము లోపల ముహూర్తములు కుదరని పక్షమున 1, 7, 12, 16, 23 మరియు 25 తారలు మాత్రం వదిలి మిగతావి రెండవ ఎంపికగా గ్రహించ వచ్చును.

## ఏ వారం.. ఏ పూజ... ఏ ఫలితం?

కొంతమంది భక్తులు ఎప్పుడు ఏ దేవుడికి పూజ చేస్తే ఎలాంటి పుణ్యఫలితం దక్కుతుందో తెలిస్తే కచ్చితంగా ఆ పూజ మాత్రమే చేసుకుని త్వరగా ఫలితాన్ని పొందాలనుకుంటుంటారు. అలాంటి వారికోసమేనన్నట్టు శివమహా పురాణం విద్యేశ్వర సంహిత పద్నాలుగో అధ్యాయంలో దీనికి సంబంధించిన విషయాలున్నాయి. దేవతల ప్రీతి కోసం అయిదు విధాలైన పూజ ఏర్పడింది. మంత్రాలతో జపం, హోమం, దానం, తపస్సు, సమారాధనలు అనేవే అయిదు విధాలు. సమారాధనం అంటే దేవుడి ప్రతిమ నుంచే వేదిక. ప్రతిమ, అగ్ని, లేక బ్రాహ్మణుడిని షోడశోపచారాలతో పూజించటం ఈ నాలుగు రకాలలో ఒక దానికంటే ఒకటి ఉత్తమమైనది. పూజలు మనకున్న ఏడు వారాలలో ఒక్కొక్క వారం ఒక్కొక్క దేవతకు చెయ్యాల్సి ఉంటుంది.

**ఆదివారం:** ఆదివారం ఆదిత్యుడిని, ఇతర దేవతలను, వేద పండితులను పూజించాలి. ఆదిత్య పూజ వల్ల నేత్రరోగం, శిరోరోగం, కుష్ఠురోగం తగ్గుతాయి. ఆదిత్యుడిని పూజించి వేద పండితులకు భోజనం పెట్టాలి. ఇలా ఒక రోజు నుంచి ఒక మాసం, ఒక సంవత్సరం లేక మూడు సంవత్సరాల పాటు రోగ తీవ్రతననుసరించి పూజ చేయాలి. దీనివల్ల సూర్యానుగ్రహప్రాప్తి కలుగుతుంది.

**సోమవారం:** సోమవారం సంపద కోరుకోనేవాడు లక్ష్మీదేవిని ఆరాధించాలి. ఆ రోజున పూజ తర్వాత వేద పండిత దంపతులకు నెయ్యితో భోజనం పెట్టాలి.

**మంగళవారం:** రోగాలు తగ్గటం కోసం మంగళవారం కాళీదేవతను పూజించాలి. మినుము, కంది, పెసరపప్పులతో చేసిన పదార్థాలతో వేద పండితులకు భోజనం పెట్టాలి.

**బుధవారం:** బుధవారం పెరుగు అన్నాన్ని విష్ణువుకు నివేదించాలి. ఈ పూజ, నివేదనల వల్ల పూజ చేసిన వారి కుమారులు, మిత్రులు, భార్య తదితరులకు చక్కటి ఆరోగ్యం ప్రాప్తిస్తుంది.

**గురువారం:** గురువారం ఆయుష్షును, ఆరోగ్యాన్ని కోరేవారు తమ ఇష్టదైవం ఎవరైతే వారికి పాలతో, నెయ్యితో చేసిన పదార్థాలను నివేదించాలి. వస్త్రాలను కూడా నివేదించి అర్చన చేయడం మేలు.

**శుక్రవారం:** శుక్రవారం కూడా ఇష్టదైవాన్ని శ్రద్ధతో ఆరాధించి భోగాలను పొందవచ్చు. ఆ రోజున పూజానంతరం వేదపండితుల తృప్తి కోసం షడ్రుచులతో కూడిన భోజనాన్ని పెట్టాలి. స్త్రీల తృప్తి కోసం మంచి మంచి వస్త్రాలను బహూకరించాలి.

**శనివారం:** శనివారం రుద్రాది దేవతల ఆరాధన మంచిది. అపమృత్యువు నుంచి తప్పించుకోవాలనుకునేవారు ఆనాడు నువ్వులతో హోమం చేసి నువ్వులను దానం ఇచ్చి నువ్వులు కలిపిన అన్నంతో పండితులకు భోజనం పెట్టాలి. ఇలా చేయటం వల్ల పూజ చేసిన వ్యక్తికి మంచి ఆరోగ్యం చేకూరుతుంది.

ఇలా ఏడు రోజులతో ఏ దేవతకు పూజ చేసినా ముందుగా సంతోషపడేవాడు శివుడేనని శివపురాణం వివరిస్తోంది. ఆ వారాలకు సంబంధించిన దేవతల ఆనందమే తన ఆనందంగా శివుడు భావించుకొంటాడు. ఆ పూజాఫలాన్ని ఆ దేవతలుకాక శివుడే స్వయంగా ఆ భక్తులకు ప్రసాదిస్తాడు. సృష్టికి ఆదిలో ముల్లోకాల అభివృద్ధి కోసం పాప పుణ్యాలు రెండిటినీ శివుడు కల్పించాడు. పాపం చేయటం లేదా పుణ్యం చేయటమనేది మానవుల పూర్వజన్మ కర్మఫలాన్ని అనుసరించి ఉంటుంది. చేస్తున్నది పాపమని పెద్దలు లేదా గురువుల నుంచి తెలుసుకొని ఆ పాపకార్యాలను విడిచిపెట్టి పుణ్య సంపాదన కోసం మనిషి ప్రయత్నం చేయాలి. ఈ క్రమంలోనే కర్మఫలాన్ని అనుసరించి వచ్చిన కొన్ని రోగాలను, కష్టాలను తప్పించుకోవడం కోసం పూజలు రూపొందాయి. ఈ విషయాన్ని గ్రహించి ఎవరు ఏ ఫలితం కావాలనుకొంటే ఆ రోజున ఆ పూజ చేసుకోవచ్చన్నది శివపురాణం ఇస్తున్న సూచన.

## లగ్నం

జ్యోతిష శాస్త్రంలో లగ్నం ప్రధాన మైనది. లగ్నం శిశువు పుట్టిన సమయాన్ని ఆధారంగా చేసుకుని నిర్ణయించ బడుతుంది. ఒక రాత్రి ఒక పగటి సమయంలో మొత్తం పన్నెండు లగ్నాలు ఆవృత్తం ఔతాయి. సాధారణంగా సూర్యుడు మేషరాశి ప్రవేశ కాలం అయిన మేష సంక్రాంతి నుండి ఉదయకాలమున మేష లగ్నంతో ప్రారంభం ఔతాయి. ఒక లగ్న కాలం రెండున్నర ఘడియలు. ప్రస్తుత కాలంలో రెండు గంటల సమయం. అంటే నూట ఇరవై నిముషాలు. ఒక రోజు అనగా సూర్యోదయము మొదలు మరల సూర్యోదయము వరకు గల కాలము. ఒక రోజుకు 24 గంటలు లేదా 60 ఘడియలు. ఒక్కోరోజుకు ఈ లగ్నం నాలుగు నిముషాలు వెనుకకు జరిగి తిరిగి ఒక మాస కాలానికి వృషభ సంక్రాంతి నాటికి వృషభ లగ్నంతో మొదలౌతుంది. దానికి కారణము ప్రతి దేశ అక్షాంశముల సహాయముతో మేషాది సాయన లగ్న ప్రమాణములు తెలుసుకొనవచ్చును. ఈ సాయన లగ్న ప్రమాణములు యెన్ని యుగములు అయిననూ ఏ విదమైన మార్పు చెందవు. ఒక భూప్రదిక్షిణ కాలానికి పన్నెండు లగ్నాల ఆవృత్తం పూర్తి ఔతుంది. పన్నెండు లగ్నాలకు పన్నెండు రాశులు అధిపత్యం వహిస్తాయి. ఒక రోజు 12 రాశులు లేదా లగ్నములు వలన యేర్పడినది. అందువలన ఒక రోజునకు 24 గంటలు లేదా 60 ఘడియలు లేదా 12 లగ్నములు అని భావించ వలయును. ఒక రోజులో 12 లగ్నములును ఒకే ప్రమాణము కలిగి వుండవు. కానీ ఈ 12 లగ్నములు ప్రమాణము మొత్తము కలసిన 60 ఘడియలు లేదా 24 గంటలు ఔతుంది. సాధారణంగా లగ్నం నుండి వ్యక్తి జాతక గణన జరుగుతుంది. లగ్నం నుండి పన్నెండు స్థానములకు లేక భావములకు పన్నెండు కారకత్వములు ఉంటాయి.

లగ్నం మొదటి (తను) స్థానం లగ్నాధిపతి, అందు ఉండే గ్రహాలను అనుసరించి వ్యక్తి గుణగణాలను గణిస్తారు.

రెండవ (ధన) స్థానముకు ధనస్థానం

మూడవది (భ్రాతృ) సోదర స్థానం.

నాలుగవ (మాతృ) స్థానం గృహం, సుఖం, తల్లి స్థితిని తెలుపుతుంది.

అయిదవ (పుత్ర) స్థానం పూర్వపుణ్య స్థానం.

ఆరవ (శత్రు) స్థానం శత్రువులు, రోగముల స్థానం.

ఏడవ (కళత్ర) స్థానం.

ఎనిమిదవ (ఆయువు) స్థానం మారక స్థానం.

తొమ్మిదవ (భాగ్య) స్థానం తండ్రి పితరులు, పిత్రార్జితం సూచిస్తుంది.

పదవ (రాజ్య) స్థానం కర్మస్థానం ఇది వ్యక్తి చేయు వృత్తిని సూచిస్తుంది.

పదకొండు (లాభ) స్థానం.

పన్నెండవ (వ్యయ) స్థానం.

<u>లగ్నం కొన్ని విశేషాలు</u>

లగ్నం నుండి 1, 5, 9 కోణస్థానములు 5, 9 స్థానములను త్రికోణ స్థానములని అంటారు.

లగ్నం నుండి 1, 4, 7, 10 స్థానములు కేంద్ర స్థానములు. వీటిని కంటక స్థానములు, చతుష్టయములు అంటారు. కేంద్రములో ఉన్న గ్రహములు బలమైనవి.

లగ్నంలో ఉన్న గ్రహం కంటే 4 వ స్థానంలో ఉన్న గ్రహం బలమైనది 4 షానంలో ఉన్న గ్రహం కంటే 7వ స్థానంలో ఉన్న గ్రహం బలమైంది. 7 వ స్థానంలో ఉన్న గ్రహం కంటే 10వ స్థానంలో ఉన్న గ్రహం బలమైంది.

చంద్రుడి నుండి 3, 6, 10, 11 స్థానాలు ఉపజయ స్థానాలు. 1, 2, 4, 5, 7, 8, 9, 12 స్థానములు అనుపజయ స్థానములు.

లగ్నము కంటే పంచమ స్థానం పంచమ స్థానం కంటే నవమ స్థానం బలమైనది.

2, 5, 8, 11 స్థానములు పణపర స్థానములు. ఇవి పూర్వ జన్మలో చేసిన పుణ్యకార్యములు తెలియజేస్తాయి.

3, 6, 9, 12 స్థానములు అపోక్లిమ స్థానములు. ఇవి విచక్షణ, హేతు బుద్ధిని తెలియజేస్తుంది.

6, 8, 12 స్థానములు మరుగు స్థానములు దుస్థానములు.

3, 6, 12 స్థానాధిపతులు త్రిషడాయన స్థానములు అంటారు. వీటి అధిపతులు శుభగ్రహాలే అయినా అశుభమే చేస్తారు.

1, 2, 4, 5, 7, 9, 10, 11 శుభ స్థానములు. ఈ స్థానములో ఉన్న గ్రహాలు శుభఫలితాలు ఇస్తాడు. ఈ స్థానాధి పతులు శుభం కలిగిస్తారు.

2, 7, 11 స్థానములు మారక స్థానములు.

3, 6, 8, 12 స్థానములు పాప స్థానములు. ఈ స్థానములో ఉన్న గ్రహములు గ్రహాధిపతులు శుభాన్ని కలిగిస్తారు.

ఉపజయ స్థానములో ఉన్న పాపగ్రహములు కూడా శుభఫలితాలు ఇస్తాయి.

**భావాలు కారకత్వాలు**

**<u>లగ్నం:-</u>** లగ్నం తనూభావాన్ని సూచిస్తుంది. శరీరం, రూపము, వర్ణము, జ్ఞానము, బలాబలాలు, స్వభావం, సుఖదు:ఖాలు మొదలైన వివరాలు తనూభావం నుండి తెలుసుకోవచ్చని పరాశరుని శ్లోకం వివరిస్తుంది. ఉత్తరకాలామృతం దేహమూ, కాళ్ళు, చేతులూ, అవయవములు, సుఖదు:ఖములు, ముసలితనం, జ్ఞానం, జన్మభూమి, కీర్తి, స్వప్నము, బలము, ఆకారము లగ్నం వివరిస్తుందని చెప్తుంది.

**<u>ద్వితీయ భావం :-</u>** ఇది ధన భావం, కుటుంబ భావంగా భావించబడుతుంది. ధనార్జన, ఆహారం స్వీకరించుట, కంఠ ధ్వని, మాట తీరు, కంఠ వ్యాధులు, నాలుక. ముఖము, జీవనం, ఉపన్యాసం, వాక్కు, వాగ్ధాటి, విద్య. ఐశ్వర్యము, ఆభరణములు, భోగము, దుస్తులు, ఆచారం, దాతృత్వం, వజ్రము, మారకము, మణులు, ధనధాన్యము, వ్యాపారం. నాసిక, సుగంధ ద్రవ్యములు, నివయము, కోమలత్వం. కుటుంబం, పాండిత్యం, స్నేహం, స్నేహితులు, స్థిరభావం.

**<u>త్రితీయ భావం :-</u>** ఇది పరాక్రమ భావం మరియు కనిష్ఠ సోదర భావంగా భావించ బడుతుంది. తమ్ముళ్ళు, ధైర్య సాహసాలు, కార్య భారం వహించుట, రౌద్రము, కనిష్ఠ సోదరులు, ఆభరణములు, సత్ప్రవర్తన, వర్ణాశ్రమ ధర్మం, పెద్దలు, యుద్ధము, గురువులు, చెవులు, వాహన సౌక్యము, కాళ్ళు, శారీరక బలం, చిత్త చాంచల్యం, మృష్టాన్న భోజనం, సామర్ధ్యం, శారీరక పుష్టి, సర్వసౌఖ్యము, సంపన్న జన్మ, స్వల్ప ప్రయాణములు, సామర్ధ్యము, కోపము, లాభము, శాంతం, దాసదాసీలు, కార్య సంధానం మొదలైనవాటికి కారకత్వం వహిస్తాడు.

**<u>చతుర్ధభావం</u>:-** మాతృభావం. తల్లి సౌఖ్యం, వాహనం, సుఖం గురించి తెలియజేయును. అనేక విధ వాహన సంపద, కష్టార్జితం, శీలము, తల్లి బంధువులు, భూమి, గృహములు, చెరువులు, నూతులు, సాధన మొదలైనవి తెలియజేయును.

**<u>పంచమ భావమనే సంతాన భావము</u>:-** మంత్ర స్థాన, పూర్వపుణ్య స్థానం, బుద్ధి స్థానం కూడా ఔతుంది. వ్యాపారము, బుద్ధిబలం, వివేకము, ఉన్నత విద్య, సంతానం, పితృధనం, సత్కథా పఠనం, వినయము, గౌరవం, స్త్రీ మూలక భాగ్యము, అన్నప్రధానం, మంత్రోపాసన, మంత్ర జపం, పాప పుణ్యములు, గ్రంధరచన, వార్తాలేఖనం, ఆలోచన, వంశపారంపర్య అధికారం, సంతృప్తి, తండ్రి చేసిన పుణ్యము, మనసు, ఛత్రము, గర్భము, శుభలేఖలు, కోరికలు సిద్దించుట, దూరదృష్టి, రహస్యము, క్షేమము, కార్యాచరణ వైభవము, ప్రతిభ, పాండిత్యము, సంగీత వాద్యములు మొదలైన వాటికి కారకత్వం వహిస్తుంది.

**<u>షష్టమ భావము</u>:-** శత్రువు, రుణం మరియు రోగ స్థానం. రోగములు, ఋణబాధలు, తగాదాలు, పేచీలు, క్రూర కార్యములు, పిసినారితనం, అపవాదులు, యాచకత్వం, అకాల భోజనం, జైలు, అన్నదమ్ములతో వైషమ్యాలు, దొంగతనం, మేనమామలు, ఆపదలు, ప్రేగులు, జీర్ణాశయం మొదలైన వాటికి కారకత్వం వహిస్తుంది.

సప్తమ భావము కళత్ర స్థానం. వ్యాపారములో భాగస్వాములు, భార్య, ద్వికళత్రం, దాంపత్య సుఖం, దొంగతనం, బుద్ధి మాంద్యము, వస్త్రములు, అలంకారములు, సుగంధద్రవ్యములు, పానీయములు, విదేశీ ప్రయాణములు, ధనార్జన, మూత్రము, మర్మస్థానముల మొదలైన వాటికి కారకత్వం వహిస్తాడు.

**<u>అష్టమ స్థానం</u>:-** ఆయుర్భావం. మరణము, మరణకారణము, వారసత్వము గురించి తెలియ జేయును. ఇంకా సుఖము, ఆపద, తగాదాలు, సోమరితనం, ధనవ్యయం, దురదృష్టం, మానసిక స్వభావం, అవమానం, పరధనము మొదలైన వాటికి కారకత్వం వహిస్తుంది.

**నవమభావాన్ని భాగ్యభావం అంటారు**:- పూర్వజన్మ పుణ్యం కారణంగా కలుగు అదృష్టం, స్థితిగతులు, దూరప్రయాణాలు, ఆధ్యాత్మిక స్థితి, మంత్రోపాసన, గురువులను గౌరవించుట, విద్యార్జన, పిత్రార్జన, సంతానం, ఐశ్వర్యం, ఆచార సంప్రదాయాలు, దైవభక్తి, ఊరువుల మొదలైన వాటికి కారకత్వం వహిస్తుంది.

**దశమభావం రాజ్యభావం అంటారు**:- ఉద్యోగం, వ్యాపారం, పేరు ప్రఖ్యాతులు, అధికారం, వృత్తి గురించి తెలియజేస్తుంది. దయాగుణం, యంత్రము, మంత్రము, అభిమానము, మాతృ దేవత.

పదవి స్థానం, ఔషధము, బోధన, ముద్రాధికారం, సన్మానం, దేవతలు, పుణ్యము, దత్త పుత్రుడు మొదలైన వాటికి కారకత్వం వహిస్తుంది.

**ఏకదశ భావమును లాభభావం అంటారు**:- అగ్ర సోదరులు, స్నేహితుల గురించి తెలియజేస్తుంది. వివిధ ఆదాయములు, వివిధలాభములు, తండ్రి సోదరులు, అలంకారములు, నగలు, కార్యసిద్ధి, ఆశయసిద్ధి, చిత్రలేఖనం, లలిత కళలు, మంత్రోపాసన, విద్య, బంగారం గురించి తెలియ జేయును.

**ద్వాదశ భావం వ్యయభావం అంటారు**:- ధనవ్యయం, సమయ వ్యయం, పూర్వజన్మలు, రహశ్య శ్త్రువులు గురించి తెలియ జేస్తుంది. అది బంధనం, ఋణ విమోచనం, స్త్రీలోలత్వం, కళత్రహాని, విదేశప్రయాణం, ఉద్యోగ విరమణ, అధికార పతనం, మనోచంచలం, అహంకారం, శరీర అనారోగ్యం, మారకం మొదలైన వాటికి కారకత్వం వహిస్తుంది.

**లగ్నపాదాలు నవాంశ చక్రం:**

జ్యోతిష శాస్త్రంలో నవాంశానికి ఒక ప్రత్యేకత ఉంది. ఒక రాశిని తొమ్మిది సమ భాగాలుగా విభజించి ఆ రాశిలో ఉన్న గ్రహం ఏ నక్షత్రపాదంలో ఉందో నిర్ణయిస్తారు. నవాంశ ఆధారిత ఫలితాలు కచ్చితంగా ఉంటాయని పలు జ్యోతిషశాస్త్ర పండితులు అభిప్రాయపడతారు. ఉత్తర భారతంలో జ్యోతిష పండితులు నవాంశ చక్కటి ఆధారంగా చాలా నిర్దుష్ట ఫలితాలు చెప్పగలరని ప్రతీతి. జ్యోతిష శాస్త్రంలో నవాంశకు చాలా ప్రాధ్యనత ఉంది.

## జన్మ లగ్నములు - వాటి ఫలములు

**1. మేష లగ్నము – లగ్న ఫలములు :-**

మేష లగ్నమున జన్మించిన వారికి గురుభక్తి, దైవభక్తి, అధికముగా ఉండును. శాంతి స్వభావులు, మంచిగ మాట్లాడుదురు, గుణవంతులు, మంచి దేహ ఛాయ కలవారు, ధైర్యవంతులు, కార్యశూరులు, అందరికి ఇష్టమైన వారు, జీవితంలో కొద్దిగానే సుఖ పడుదురు. వీరికి స్వాభిమానము అధికము, ప్రయానములు ఎక్కువుగా చేయుదురు, కాస్త లోభిగునముగా ఉందురు. ఓర్పు తక్కువ, కోపం ఎక్కువుగానే ఉండును, మాట్లలలో తొట్రుపాటు, సవరణలు ఉండును. వెనుక చూపు తక్కువ గా ఉండును. పదవులకై పాకులడుతారు, ఒకరికై తలవంచరు. ఒకోసారి తెలివియిన వారి చేతిలో పడి కష్టనష్టములు పడుట జరుగును. అనుకొన్న పనిని సాధించడానికి యెంతటి ఖర్చుకు అయిన వెనకాడరు. పట్టుదల వల్ల ఒకోసారి చెడ్డ అలవాట్లుకు లోను అవుతారు. దాని వల్ల అపార నష్టము కలుగును. ఇతరులు యందు ఆదరణ చుపెదరు, తన వారు యందు అనాదరణ దృష్టి కలిగియుందురు. పరాక్రమము వలన కీర్తిని సంపాదించుకోనుటకు ప్రయత్నిస్తారు. ప్రతీదాని యందు చొరవ, శక్తి, ఆసక్తి కలిగి యుందురు.

వీరు జంకు బొంకు లేకుండా యెంతటి వారియందు అయిన నిర్భయం గా, నిస్సంకోచంగా, మాట్లాడుతారు. మంచి చెడులతో సంబంధం లేకుండా ఆలోచించక ధైర్యసహసములే లక్ష్యంగా పెట్టుకొని కార్యరంగమున దూసుకొని పోవుదురు. ఉద్రేకముతో పనిచేయుడురు, దాన బుద్ధి కలవారు, ఎదుట వారి కష్టములు చూసి కరుగుట ఎక్కువ. కల్లబొల్లి మాట్లలకు, ఏడుపులకు మోసపోవుదురు. తత్ఫలితంగా అపాత్రదానము చేసి, స్త్రీలచే మోసపోవటం జరుగును. వీరు సాధ్యమైనంత వరుకు ఎవరి జోలికి పోరు, అవసరమైతే పోట్లాట కూడా వెనుకాడరు. కాస్త కలహ్ స్వభావం అనే చెప్పాలి. వీరు స్వలాభం కోసం ప్రయత్నిస్తారు, అవసరము అయిన చోట సంపాదించినా దానికన్నా ఎక్కువ ఖర్చు చేస్తారు. అవసరాన్ని బట్టి అభిప్రాయాలని మార్చుకొంటారు.
వీరిలో ఈర్ష్య, లోభత్వము, కోపము, మొండితనము, ధైర్యము, తొందరపడి దూషించటం అనునవి వీరి ముఖ్య లక్షణములు. వీరు కార్యదక్షత కలవారు, ఇతరులలోని నిగూఢమైన విషయములను బయటకు లాగుదురు. వీరు చిన్నతనం లో చాల కష్టములు అనుభవించి భవిషత్తులో అభివృద్ధిలోకి వచ్చెదరు. ఒకోసారి చెడు సాహసాలు వల్ల నష్ట పోవుదురు, ఇలాటి విషయాలో ఆలోచన శక్తి తక్కువ. ఎలాంటి విషయములు అయిన తొందరగా తేలుస్తారు. వీరు కాస్త బక్క పల్చగా సామాన్యముగా మధ్య దేహము కలవారు అయిఉండును. ఒత్తుఐన కనుబొమ్మలు, గుండ్రని కళ్ళు, వాడి అయిన దృష్టి కలవాడు అయి ఉండును. వీరికి శిరస్సుకు సంబంమైనా, పొట్ట, మూత్రమునకు సంబంధించిన అనారోగ్యములు కలుగును. వీరికి పైత్య ప్రకోపంగ ఉందురు. ముఖము నందు వ్రణములు, కురుపులు, చర్మ సంబంధమైన అనారోగ్యములు గుర్తులుండును.

వీరికి నీటి భయము ఉండెను. వేడి వల్ల ఎక్కువుగా జ్వరములు వచ్చును, ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపడుకోవలెను. వీరికి మధ్య వయస్సు వచ్చు సరికి ఇంకొక స్త్రీ జీవితంలోకి ప్రవేశసించును. కుటుంబంలో కల్లోలాలు చెలరేగును. ఉద్యోగంలో పై వారితో సరిపడదు. వృతిలో నిలకడ తక్కువ. ధనమును సులభంగా సంపాదించును. అప్పులు కూడా సులభంగా దొరుకును. విద్య యందు ఆటంకములు యేర్పడును. పుట్టిన ఊరికి దూరంగా జీవించెదరు.

**2. వృషభ లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

వృషభ జన్మ లగ్నమున పుట్టిన వారు ధనికులు, సుఖమును అనుభవించువారు. తేజస్వి, కష్టములకు ఓర్చుకొని జీవితంలో నిలబడగలరు. ఎదుటవారి యొక్క స్వభావమును బట్టి మాట్లాడువారు, తద్వారా శత్రువులను నివారించువారు. తెలివియిన వారు, విశాలమైన నుదురు, వక్షస్టలము గలిగిన వారు అయి ఉండును. సుందర స్వరూపులు, కంటికి ఇంపుగా కనిపింతురు. కొద్దిగా కాముకులుగా ఉందురు. గురుభక్తి, దైవభక్తి కలిగి ఉందురు. స్నేహపాత్రులు, ప్రియముగా మాట్లాడువారు, ప్రశాంతమైన మనస్సును గలిగి, తద్వారా సుఖమైన జీవితాన్ని గడిపెదరు.
రహస్య ప్రవర్తన, స్వార్ధము, ఆత్మస్తుతి, దీర్ఘకోపం, కొన్ని విషయాలు నందు పెడసరంగా ప్రవర్తించటం, వీరికి తోచిన విధంగా పనులు చేసుకోవటమే కాని ఇతరుల అభిప్రాయలతోను, సలహాలు పాటించకపోవుట వీరి ముఖ్య లక్షణము. తమలోని అభిప్రాయాలను తొందరపడి బయటకు వ్యక్తం చేయరు. ఏ పనిలోనూ అయినా తొందరపాటు నిర్ణయం తీసుకోకుండా నిదానంగా అలోచించి అడుగులు వేస్తారు. తరుచు సౌఖ్యం గురించి తాపత్రయ పడుతుంటారు. వీరికి చాల మంది సేహ్నితులు ఉంటారు. వీరితో ఒకోసారి పెడసరంగా మాట్లాడతారు.

కీళ్ళవాతము, ముఖము ఉబ్బుట, మూత్రాశయ వ్యాధులు ఏర్పడగలవు. ఏది తిన్నపడదు, అజీర్ణం చేస్తుంది. ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించాలి. వీరికి అనారోగ్యం వచ్చిన తొందరగా తగ్గుతుంది. అపస్మారక, గొంతుకు,మధుమేహం, మెదడు సంబంధించిన వ్యాధులు వచ్చే అవకాశం ఉంది. ఆరోగ్య విషయంలో చాల జాగ్రత్తగా ప్రవర్తించవలెను.

వీరికి ఆభరణములందు మక్కువ ఎక్కువ. సంగీత ప్రియులు. బాల్యము నందు అనేక కష్టములు అనుభవించెదరు. యవ్వనము, వృద్ధాప్యం దశల యందు వీరి జీవనము సుఖసంతోషములతో గడిచిపోవును. వీరు భోజన ప్రియులు, మధుర పదార్ధములు నందు మక్కువ కలిగి ఉంటారు. వీరిలో క్షమగుణము మరియు కోపము రెండు ఉన్నటాయి కానీ తొందరగా కోపం రాదు. వీరు ధనం విషయంలో కాదు జాగ్రత్తగా ఉంటారు. వీరికి నిర్దిష్టమైన అభిప్రాయములు ఉండును, పట్టిన పట్టు విడువక అనుకొన్న పనిని సాధిస్తారు. ఎదుటవారి యొక్క మనోగాతాభిప్రాయలను లాగుత వీరి లక్షణము. మనస్సు లో ఉన్న అభిప్రాయానికి వ్యతిరేకంగా వాదిస్తారు. కష్టములను, ఓటములను మనస్సులోనే ఉంచుకొని తమ ఉద్దేశ్యమునకు అనుకూలంగా పనిని చేయుదురు. ఎంత కాలముయిన ఎంత కష్టమైన విసుకు చెందక శారీరిక శ్రమ ఓర్చి పనిని సాధించును. అట్టి క్రమమునందు ఇతరులను ఓడించెదరు.

వీరు ప్రభుత్వ ఉద్యోగాలలో రాణించాలేరు. సుఖపడుట తెలిసినవారు.యెంత కష్టపడుదురో అంత సుఖపడుదురు. పనికి రాని వస్తువులను, కాగితాలను పారివేయక దాచుకొందురు. తనకు ఉన్న ఆస్తిని, అంతస్తులను, ఆభరణాలను పదిమందికి చెప్పుకొనుట వీరి జీవిత ఆశయం. వీరు జీవించు పద్ధతి చూసి, తానూ ఉన్న స్థితి కన్నా ఎక్కువ ధనవంతుడు అని, ఇతరులు పొరాపడుదురు. వీరి స్నేహితులు ఇంకొకరితో చనువుగా ఉంటె ఓర్వలేరు. వీరికి అతి శ్రమ, అతి భోజనం, అతి స్త్రీ సాంగత్యము ఉండును. బంధువులలో ముఖ్యంగా సోదర, సోదరిమణుల వల్ల అకారణంగా దుఃఖం, కష్టములు కలుగును. వృత్తిలో చిన్నవారితోనూ, అధికారులతోను, పేచి ఉండును. దాని వల్ల ఒకోసారి శ్రమ మీది ఫలితం వేరుకోకరిది అగును. వయస్సు నందు భార్య కాక మరొక స్త్రీ తో సాంగత్యము, లేదా వేరొక సంసారము ఏర్పడే అవకాశం ఉన్నది. తండ్రి సంప్రదాయము, సాంఘిక గౌరవము, పరిసరములందు పలుకబడి కలవాడు అయి ఉండును. 30 సంవత్సరములలోపు కలిగిన సంతతి మాట వినదు. సంతతితో అభిప్రాయ భేదాలుండును.

**3. మిధున లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

ఈ లగ్నము నందు జన్మించిన వారు బుద్ధిమంతులు, తెలివితేటలుకలవారు, పుణ్య కార్యక్రమములు , క్రతువులు చేయుదురు. వీరికి తమవారి నందు మాత్రమే అభిమానము ఉండును. తమయొక్క తెలివిని ఉపయోగించి అనేక పద్ధతులు అనుసరించి వారి యొక్క పనులలో విజయం సాదించెదరు. భోగవంతులు, దాతలు,శౌర్యవంతులు, పెద్దలవద్ద, పండితులు వద్ద స్నేహంగాను, నమ్రతగా ఉందురు. వీరికి స్నేహితులు, బంధువులు ఎక్కువగా ఉంటారు. వీరికి విశ్రాంతి తక్కువ, మనోవ్యధ ఎక్కువ. వీరు పొడువుగా, నిట్టనిలువుగా, నిశితమైన దృష్టి కలిగి చామన ఛాయ రంగులో ఉందురు. వీరికి సంగీతం అన్న ఇష్టము. శాస్త్రములు నందు ఆసక్తి ఉన్న దేనిని పరిపూర్ణంగా సాధించలేరు.

వీరి మాటలలో చతురత, చురుకుతనము ఉంటాయి. వారసత్వము వలన ఆస్తి కలిసివచ్చును. వీరు వృత్తి లో మార్పులు, భేదములు ఎక్కువగా చేయుదురు. వీరు అసలు యదార్ధమును గ్రహించి సమయాసమయములను బట్టి స్వామి ద్రోహం చేయటానికి కూడా వెనుకాడరు. మనస్సులోని అభిప్రాయమును బయటకు ప్రకటించరు. ఏ విషయమైన ఇతరులకు అర్ధమగు రీతిలో చెప్పగలరు. వీరు ఇతరులకు ఇచ్చే సలహాలు ఫలితాలను ఇస్తాయి. వీరు ప్రయాణాలు వెక్కువ చేయకుండా ఉండుట మంచిది, దాని వల్ల శరీరం పూర్తిగా దెబ్బతింటుంది. వీరికి మనస్సు నిలకడగా ఉండకపోవటం వల్ల మొదలు పెట్టిన పనిని పూర్తి కాక ముందే వదిలేస్తారు. కానీ ఇతరుల పర్యవేక్షణలో ఐతే కార్యాని పూర్తి చేస్తారు.

వీరికి విశ్రాంతి అవసరము. విశ్రాంతి వలన ఆరోగ్యము బాగుపడును. అతి ఆలోచన, అకారణంగా భయపడటం, నిద్ర పట్టకుండుట, నరములు లాగుట, తలనొప్పి లేదా పిచ్చిగా బాధపడుట, హిస్టీరియా సంబంధమైన బాధలు గాని, హైబీపి, లోబీపి వంటివిగాని వచును. జీర్ణకోసము సరిగా పనిచేయదు. దానివల్ల కడుపు మంట, నొప్పి, వాంతులు, మొదలగునవి కలుగుచుండును. అందువలనే వీరికి విశ్రాంతి అవసరం.

ఆర్థికంగా లెక్కల్లోనూ, కొలతలలోను అతి జాగ్రత్త వల్ల పెద్ద పెద్ద అవకాశాలు కోల్పోదురు. ఈ లోభత్వము వల్ల స్నేహితులు సలహాలు ఇచ్చిన మళ్లీ అవి కలహాములకు దారితీయును. దాని వల్ల బంధువులు కూడా విడిపోవును. దానికి కరణం తానే అగును. వీరికి చొరవ తక్కువ, సందేహము ఎక్కువ. ఎదుటవారిలో లోపములను సులువుగా కనిపెట్టెదరు. వీరికి చిరాకు, కోపము రెండును ఎక్కువ గానే ఉండును. వారికి అనుకూలం గా ఉన్న వాతావరణము అయినచో వీరి ప్రతిభ, బుద్ధి చురుకుగా పని చేయును. లేనిచో భయము, కోపము తో వీరి తెలివి సరిగా పనిచేయదు.అవసరము అయిన చోట తలవంచక తప్పదు. అనుకూలమైన అధికారము చేయగలరు. వీరి కొత్త అంశాలను తొందరగా కనిపెట్టెదరు. భార్యభర్త లలో ఒకరి అదృష్టం బట్టి ఇంకొకరిది బాగుంటుంది. ఒకరిదే బాగుంటే సరిపోదు. మొత్తం మీద ఈ లగ్నం వారు మంచి నిపుణులు, నేర్పులు, తెలివి గా ప్రవర్తింతురు.

**4. కర్కాటక లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

కర్కాటక లగ్నమునందు జన్మించి వారిలో చాల మంది మొదట కష్టములను, అనుభవించి, క్రమంగాఅభివృద్ధిలోకి వస్తారు. కష్టంగాని, సుఖం గాని, ధనం గాని, మీ జీవితంలోకి అనుకోకుండా వస్తాయి. అలాగే ఖర్చుకుడా అనుకోకుండానే జరుగుతుంది. వీరులో ప్రేమ, కోపం, అనుగ్రహం, ఆగ్రహం, ఆదరణ, అనాదరణ ఎలాటివి వీరికి ఎప్పుడు వస్తాయో చెప్పలేము. కోపం కూడా ఎక్కువ సేపు ఉండదు. కంగారు ఎక్కువ ఇవి వీరి ముఖ్య లక్షణములు.

వీరు ధర్మమమును బాగా పాటిస్తారు. ధర్మ కర్మచరణములు యందు ఆసక్తి కలవారు. వీరికి పెద్దలయందు గౌరవము, వినయంతో నడుచుకొందురు. భార్యాపిల్లల్ని ఎక్కువ ప్రేమిస్తారు.వీరికి కొత్త వస్తువులందు, విచిత్రమైన వస్తువులందు ఇష్టం ఉంటుంది. వీరికి బంధుప్రీతి గలవారు. స్వార్జితం తోనే జీవితంలో పైకి వస్తారు. పిత్రార్జితము ఉండదు. ఉన్న దాని యందు ఆపేక్ష ఉండదు.

కీళ్ళ నొప్పులు, కఫం, క్షయ మద్యపాన వ్యాధులు. మూత్ర వ్యాధులు, అంటు వ్యాధులు మొదలగు బాధల వల్ల ఇబ్బంది పడతారు. వీరు ప్రతీ విషయాని అతిగా ఆలోచించటం వల్ల మానసికంగా ఇబ్బందిపడతారు. ఈ మానసికమైన ఆలోచనలే అనారోగ్యానికి కారణం. తరుచు మందులు మింగుతూ ఉంటారు. వీరికి జల గండములుండును. జాగ్రత్త అవసరం. వీరికి దైవభక్తి చాల ఎక్కువ గా ఉండును. భవిషత్తులో జరుగు విషయములను వీరు ముందుగానే చెప్పలగలరు. ఈ లగ్నములో పుట్టిన స్త్రీలు ఎప్పుడూ శారీరక శ్రమ కోరిమరి చేస్తారు, అది కూడా ఎదుటవారు దృష్టిలో పడటానికి.వారి మెప్పుదలకై పాకులాడతారు.

**5. సింహ లగ్నం (జనన లగ్న ఫలములు) :-**

ఈ లగ్నమందు జన్మించిన వారు స్వశక్తితో అభివృద్ధి లోకి వస్తారు. జీవితం లో పలుకుబడి, ఉన్నత స్థితికి ఎదగటం వారి కృషి వల్లనే వచ్చును. ఎటువంటి పొడగ్తలకు కరిగిపోరు. వీరు అన్యాయమును ఒప్పుకోరు. వీరికి కోపము, మాటలలో దరుసుతనము, ఎక్కువ వచ్చును. వీరికి లేని వారిని చూస్తే మనసు కరిగిపోయి, వారికీ సహాయము పడును. సహజంగా

తండ్రితో అభిప్రాయ భేదములు, పట్టుదలలు వచ్చును. ఇష్టము లేని వారితో చనువుగా ఉండలేరు. దురప్రయానములు నందు వాహనములు వేగము తగ్గించి నడుపుట మంచిది లేనిచో దెబ్బలు తగిలే అవకాశాలు ఉన్నది.
శారీరక, మానసిక శ్రమ నిరంతరం పనిచేయును. ప్రభుత్వ కార్యాలయాలల్లో, వ్యాపార సంస్థలందుగాని ఉద్యోగం చేయుదురు. మంచి పదవిలోకి వచ్చెదరు. తన గురించి నలుగురు మంచిగా చెప్పుకున్నచో మనసు నిండిపోవును వీరికి పదవులుపైన వాంఛ ఎకువగా ఉండును. వారి యొక్క సమస్యలను ఇతరలుకు చెప్పుట వీరికి ఇష్టం ఉండదు. తనకు అనారోగ్య సమయమునందు కూడ ఎవరీని సహాయము అడగరు.
సింహ లగ్నము నందు జన్మించిన వారలకు మంచి ఆరోగ్యము కలిగి చక్కని నిర్మనముతో కూడిన దేహము కలిగి ఉండును. వీరు అన్ని రకములు అయిన భోగభాగ్యములను అనుభవించి సుఖముగా ఉండురు. స్నేహితులు శత్రువులు వీరిపై గొడవలకు కాలు దువ్వరు. సంగీతము, కవిత్వములనందు ఇష్టము. సుగంద ద్రవ్యములు, శుభ్రమైన వస్త్రములను కోరుకుందురు. కొన్ని కొన్ని సమయాలలో వీరిపైన వీరికే నమ్మకం ఉండదు. భక్తి భావన, దూరపు ఆలోచనలు, ధైర్యము,నీతిమంతులు, కీర్తిమంతులు, స్వచ్చమైన ప్రేమ, ఆవేశము, వెంటనే ఆలోచన, ఉదారస్వభావము, శౌర్యము చూపుట, అల్పభోజనం, భోగములు అనుభవించటం వీరి ప్రధాన లక్షణములు .
వీరికి అప్పుడప్పుడు కడుపు నొప్పి, పళ్ళు సలుపులు వెన్నుముక సంబందిత వ్యాధులు, అతి శ్రమ వల్ల దడ, నీరసం, గుండె పట్టుట వచ్చును. కళత్రముకు నరములకు సంబందించిన వ్యాధి ఉండును.

**6. కన్యా లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

ఈ లగ్నము నందు జన్మించిన వారు, సత్యశీలుడు, తెలివితేటలు కలవారు, ధర్మము ఆచరించు వాడు, గురు భక్తి కలవాడు, నిత్యము ధనలాభాపేక్ష కలవాడు, అన్ని శాస్త్రములు తెలిసిన వాడు అయి ఉండును. వీరు సన్నని పొడవు అయిన శరీరము, నల్లని దట్టమైన వెంట్రుకులు, మంచి కనుబొమ్మలు కలిగి ఉందురు. సన్నని లేక కాస్త కీచు గొంతుక ఉండును. వీరికి మంచి తెలివితేటలు కలిగి ఉంటారు. ఇతరులకు మొహమాట పడక పనులు చెప్పెదరు. ఒక పని ప్రారంభంలో దానిని గురించి పూర్తి గా తెలుసుకోరు. సంగీతము, లలిత కళలు అన్నా, శాస్త్రములు మీద మక్కువ ఎక్కువ. తమ స్వభావము ఇట్టిది అని ఎవరికీ తెలియనివ్వకుడా జాగ్రత్త పడతారు. వీరికి జాలి తక్కువ . అనవసరం గా వీరి దగ్గర ఉన్న డబ్బును ఖర్చు పెట్టుటకు ఇష్టపడక, ఇతరులచే ఖర్చు పెట్టిస్తారు. మనస్సుకు నచిన పనిని మాత్రమే చేస్తారు.
వీరికి చిన్న తనమునుంచే అన్ని పనులు నేర్పవలెను లేనిచో పెద్ద అయ్యాక చాల కష్టపడతారు. వీరు ఎత్తి రంగంలో అయిన మంచి ప్రావీణ్యత సాధిస్తారు. ఇతరులు ఒక రోజులో చేసేపనిని వీరు ఒక్క గంటలో చేయుదురు. అలంకారము నందు ఎక్కువ సేపు సమయము కేటాయిస్తారు. ఇతరులనుండి సానుభూతి కోరుకొంటారు. పుట్టిన ప్రదేశమును విడిచి దూరంగా జీవించెను.
వీరికి కుటుంబంలో జవాబు దొరకని సమస్యలు ఉండును. వీరికి వివాహమునకు సంబంధించిన కలతలు ఉండును. సామాన్యం గా వీరు చేయు పనులలోను , వృత్తులు లలోను ఎక్కువ మార్పులు ఉండవు. ఇల్లు మాత్రము చాల మారును. అప్పులు తెచ్చుట మరియు తీర్చుట చాల కాలము చేయును. నరములకు సంబంధించిన వ్యాధులు, మల బద్ధకం, కడుపు నొప్పి, ఊపిరి పట్టుట, స్త్రీలకు గర్భాశయ వ్యాధులు వచ్చును. స్త్రీలకు మానసిక వ్యాధులు, దిగులు, చింత, భయము ఉండును. పురుషులకు దీర్ఘ వ్యాధులు, చర్మ వ్యాధులు వచ్చును. జాగ్రత్త అవసరము. మొత్తం మీద వీరు జీవితములో సుఖములను, భోగములను అనుభవించెదరు.

**7. తుల లగ్నము (లగ్న జనన ఫలములు ):-**

ఈ లగ్నము వారు స్వయకృషి వల్ల వృద్ధి లోకి వస్తారు. మంచి మనస్సు మరియు ధర్మము తెలిసిన వారు అయి ఉండును. మొదట లేదా చివరిలో గాని కొద్దిగా పేదరికం అనుభవించి వృద్ధి లోకి వచ్చెదరు. చక్కని ప్రవర్తన, వినయ విధేయతలు, గౌరవము, నిజాయితి ఉందురు, విద్య యందు ఇష్టము, విద్య లో ప్రతి విషయమును లోతు అలోచించి అందుగల విషయాన్నీ తెలుసుకొంటారు. వీరు పొడుగు లేదా మధ్య రకమైన దేహము కలవారు. సన్నగా కనిపించినను బలమైన శరీరం కలిగి ఉందురు. వీరి లో సోమరితనము ఉండును. వీరి యొక్క చిరునవ్వుతో అందరిని ఆకట్టుకొందురు. హాస్యంగా, వ్యంగ్యంగా మాట్లాడుదురు. వీరికి దైవభక్తి ఎక్కువ ఉండును. పెద్దల యందు గౌరవ భావంతో ఉంటారు.

పురాణాలు చదవడం ధర్మ కార్యము లందు ఆశక్తి, మంచి కలుపుకోలు తనము, ఏ పనినైనను న్యాయ స్వభావముతో చేయుదురు. వీరికి కోపము యెంత తొందరగా వచునో అంట తొందరుగాను పోవును. వీరికి కావ్య రచనా సమర్ధత ఉండును. మర్మములేని స్వభావముతో మాట్లాడుట, తమ అభిప్రాయాలను సూటిగా, సున్నితనముగా చెప్పెదరు. ఒక్కొక్క సారి ఆనందంగా, ఉత్సాహంగాను, మరొక్కప్పుడు విచారంగాను, నిరుత్సాహంగాను ఉంటారు. తమకు నచని విషయములు వచ్చినచో తమ యొక్క బంధువులను, మిత్రులను, భార్యా బిడ్డలను కూడా విడిచిపెడతారు.

వీరికి ప్రతికూల పరిస్థితులు వచినప్పుడు నిద్ర పట్టదు, అన్నపానీయాలు హితవు కావు. చిన్నతనములో తల్లిగాని, తండ్రి గాని చనిపోవటం వల్ల భాద్యతలు వహించును. ఈ లగ్నము జన్మించిన వారు ఉత్తమ న్యాముర్తులుగా ఉందురు. సుఖమైన జీవనం కోరుకొంటారు, ఎక్కువ శ్రమ పడలేరు. ఆహారము. వస్త్రములు, గృహము, పరిసర ప్రాంతాలు శుభ్రముగా ఉండవలెను. కాలేయము, ముత్రపిండములు, రక్త నాళములకు సంబంధించిన వ్యాధులు వచ్చును. ముసలితనములో నడుమునొప్పి, అరిచేతులు, అరికాళ్ళు చెమటలు పట్టటం జరుగును. చివరి దశలో పేరు ప్రఖ్యాతులు కలిగి అఖండ కీర్తిమంతులు అగుదురు.

**8. వృశ్చిక లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

ఈ లగ్నము జన్మించిన వారికి ఊహబలము, అనుకరణ, ఒకసారి ధైర్యం, మరొకసారి పిరికితనము కలిగి ఉందురు. సాదారణంగా ఇతరుల ఆలోచనలు నచ్చవు. ఇతరులు చెప్పింది కాదు అనటం, ఎదిరించటం, అవకాశం దొరికినప్పుడు ఎదుటవారిని సాధించటం వీరి తత్వము. వీరికి దాన గుణము, అపకారము సిన వాళ్ళకి కూడా ఉపకారము చేయును. వీరు మంచి ఉద్యోగము చేస్తారు. వీరు జీవితం లో ప్రధమ భాగంలో కంటే రెండవ భాగంలో అభివృధిని సాదిస్తారు. ఈ లగ్నము లో జన్మించు కొంతమంది దొంగలు గా, అసత్యం ఆడువారు, నకిలీ వ్యాపారం చేయువారు, విషప్రయోగాలు, విష వస్తువులు వ్యాపారం చేయు వారు ఈ లగ్నము నాడు జన్మింతురు. ఇట్టివారిని పట్టుకోను వారు కూడా గూఢచారులగా కూడా ఈ లగ్నము నందే జన్మింతురు.

వీరు చూచుటకు అందంగా కనిపింతురు. ముఖవర్చస్సు, దృఢమైన శరీరము, మనోశక్తి కలిగిఉండురు. వీరికి ఊహ శక్తి ఎక్కువ ఐనను నిలకడ లేని స్వభావము కలిగి ఉండును. వీరు 30 సంవత్సరాలు లోపు అనేక కష్టములు అనుభవించి క్రమముగా వృద్ధిలోకి వస్తారు. వీరికి తండ్రి తోగాని, సోదరులతో గాని వైరము ఉండును.తమ వారిని విడిచి దూర ప్రదేశాలు యందు ఉంది అభివృద్ధి లోకి వస్తారు. వీరికి మూత్రపిండాలకు సంబంధించిన వ్యాధులు వచ్చును. మొత్తం మీద ఈ లగ్నం వారు అన్ని సుకములు అనుభవించెదరు. వీరు తమ యొక్క కోపములను అదుపులో ఉంచుకోవాటం చాల మంచిది అని చెప్పాతగిన సూచన.

**9. ధనుర్లగ్నమము (లగ్న జనన ఫలములు) :-**

ఈ లగ్నము నందు జన్మించిన వారి మనస్సు గంటకొక రీతిగ మారిపోతుంది. వీరు దయ కూడిన మనస్సు కలవారు అయి ఉండును. వీరి కోపం ఎక్కువ గా ఉంటుంది కనుక వీరి మనస్సు ఇట్టిది అని ఇతరులకు త్వరగా తెలుసుకోలేరు. పిత్రార్జితమును వృద్ధి చేయుదురు. భోగభాగ్యాలు అనుభవిస్తారు. వీరు ఉన్నది ఉనట్టు గా మాట్లాడతారు. జీవితం గడిచిన కొద్ది వీరు ప్రాపంచిక విషయాలు అన్ని అశాశ్వతము అని తెలుసుకొని వేదాంత మార్గమును వైపు సాగేదారు. వీరు కొద్దిగా లావుగాను మరియు శరీర బలముగా కూడా ఉండును. నరాలు, ఊపిరితిత్తులు, కీళ్ళు నెప్పులు, చెవి నెప్పి, దంతములకు సంబంధించిన వ్యాధులు వచ్చే సూచనలు ఉన్నవి. వీరిలో ఎదో ఒక మానసిక ఆందోళన ఉండును.

వీరికి చదువు బాగా వస్తుంది. శాస్త్రములు యందు పట్టు, ప్రచురణ, గ్రంధ రచన, చదవటం, ఉపన్యాసాలు ఇవ్వటం గరుగును. ఉపాధ్యాయ వృత్తి,నాటక, చలన చిత్ర రంగములు మొదలగు వాణి యందు బాగా రాణిస్తారు. వీరు ఇరతులకు గర్వము ఉన్నవారి వాలే కనిపించును. ఇరరులకు చాలా ధైర్యవంతులవలె కనిపించును. వీరు బుద్ధిమంతులు, నీతి పరులు, వ్యక్తిగతముగా ఖర్చుగని, వస్తు వినియోగం గాని తక్కువ. ఒకపని అనుకొంటే అది సాధించే వరుకు ఊరుకోరు అది గెలిచామా? ఓడినామా? అనే దృష్టి ఉండదు. వీరికి రెండు వివాహములు కానీ, అన్య స్త్రీ సంబంధంగాని ఉండును. రెండవ వివాహం జరిగిన లోకమునకు తెలియకుండా ఉంటారు. వీరు వ్యాపారంలో బాగా రాణిస్తారు. వీరికి పుత్ర సంతానం ఉంటుంది. అందులో ఒకరు అదృష్టవంతులు అవుతారు. ముప్పై సంవత్సరములు వయస్సు తరువాత అదృష్టము దెబ్బతినుట గాని, శరీరమునకు సంబంధించిన వాత రోగములు వచ్చును. ప్రయానములలో జాగ్రత్త అవసరము. వీరు మంచి నమ్మకము కలిగిన వారుగా పేరు తెచుకొంటారు .

**10. మకర లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

వీరికి అతి ఆశ, పిసినారితనము, అధికంగా శ్రమించుట, శరీరంలో బలం లేకపోవటం, జీర్ణకోసము సరిగ్గా పనిచేయకపోయటం, కీళ్ల వాతము, నొప్పులు, చర్మవ్యాధులు మొదలుగునవి కలిగియుందురు. తమ యొక్క పనులను ఇతరులచేత తెలివిగా చేయించుకొంటారు. వీరికి కాస్త బద్ధకం, సోమరితనం కూడా ఉంటుంది. వీరు చాల సంతానాన్ని కలిగి ఉంటారు. వీరు గుండ్రని ముఖము, కళ్ళు లోతుగాను, బిరుపైన వెంట్రుకులు, సన్నని బలహీనమైన శరీరము కలిగి ఉందురు. పట్టిన పట్టుని విడవరు. అనుకొన్న పని అయ్యే వరుకు యెంత కాలమైన వేచిఉంటారు. అమాయకులవలె ఇతరులకు కనిపిస్తారు. కొన్ని సందర్భాలలో లంచాలు తీసుకొని వారి యొక్క ఆస్తి విలువలు పెంచుకొంటారు. లోకంలో పనీకి రాని విషయాలను చర్చిస్తూ మధ్యలో తమకు అవసరం అయిన విషయాలను జొదించి తమ పనులను చేయించుకొంటారు. వీరి జ్ఞపక శక్తి ఎదుట వారికి ప్రమాదకరము. ఎప్పటి విషయాలు అయిన, రాతలు అయిన వీరికి బాగా గుర్తుంటాయి. గణిత శాస్త్రము నందు పట్టు ఉండును.

ఆచార వ్యవహారములు యధావిధిగా జరిగే విధంగా చూసుకొంటారు. వీరి సంకల్ప సిద్ధి గొప్పది. ఎన్ని ఆటకములు వచ్చిన వెనకాడరు. వీరికి ధనము, పదవి, అధికారము పైన వ్యామోహము ఎక్కువ. ప్రతి ఫలము లేనిదే ఒక రూపాయి ఖర్చు పెట్టారు. భార్యాపుత్రులు యందు ఎక్కువ అభిమానము కలిగి ఉందురు. అవసరమైన చోట నీచ కార్యములు చేయుటకు వెనకాడరు. వీరి శరీరమున గాయములు ఉండును. మనస్సున నిరాస, నిరుత్సాహం, చిరాకు, కోపము, వ్యక్తులపై అనుమానము వీరి ముఖ్య లక్షణములు. మొత్తం మీద వీరి జీవితమున చివరి భాగములో సుఖపడగలరు.

**11. కుంభ లగ్నము (లగ్న జనన ఫలములు) :-**

వీరికి జ్ఞాపక శక్తి ఎక్కువ గా ఉండును. ప్రతి పనియందు మంచి, చెడులను పరిశీలించి గాని కార్యరంగమున ప్రవేశించరు. శాస్త్రవిద్యలయందు అభిరుచి ఉండును. వీరులో మంచితనము ఎక్కువుగా ఉండును. యెంత మంచితనముగా ఉండినా చివరికి అవమానములను, అపవాదులను పొందుట జరుగును. మత వేదాంత సంబంధమైన విషయములందు, దైవభక్తి యందు ఎక్కువ ఆసక్తి ఉంటుంది. సుగంధద్రవ్యములు, సుందరమైన వస్తువులను, పువ్వులను ఎక్కువగా ఇష్టపడతారు. ఇతరుల యొక్క కష్టాలను తమ కస్తాలుగా భావించి సహకారము చేస్తారు. ఉన్నతమైన ఉద్యోగాలలో పనిచేస్తారు.
ఒంటరితనమును ఇష్టపడరు. ఇతరలు యందు కోపముగాని, ఇష్టముగాని ఉండవు. ఉల్లాసముగా, ఆనందంగా జీవితాన్ని గడుపుతారు. వీరికి మంచి శరీర సౌష్టవం కలిగి ఉంటారు. వీరు పొడవుగాను, బలము కలిగియుందురు, గుండ్రని ముఖము కలిగి చక్కని ముఖ వర్చస్సు తో సుందర స్వరూపంగా నుందురు. వీరు ఎల్లప్పుడు కళత్రము యొక్క సుఖము గురించే ఆలోచించెను. వీరికి తరుచుగా పంటి వ్యాధులు, అజీర్ణము, కీళ్ల వ్యాధులు, కంటి జబ్బులు, చర్మ వ్యాధులు మొదలగు వాటితో బాధపదురు. రక్తపోటు, గర్భావాతము, నరముల వ్యాధులు, కీళ్ల వాపులు రాగలవు. ఆరోగ్య విషయంలో చాల జాగ్రత్తగాఉండాలి. చిన్న తనములోనే వివాహమగును. వీరి భార్యలకు లలిత కళలు యందు ఇష్టము ఉండును. సంతానంలో పెద్దవారితో విరోధము వచ్చును. పెద్దతనములో సంతానము మోసము చేయటం కానీ, దండన చేయటంగాని జరగవచ్చు. పిలల్ల విషయంలో చిన్నతనము నుండి కాదు జాగ్రత్తగా నుండవలెను. మొత్తము మీద ఈ లగ్న జాతకులు యోగ కారుకులే.

**12. మీన లగ్నం (జనన లగ్న ఫలములు ) :-**

వీరు బుద్ధిమంతులు, త్యాగమంతులు. ధర్మము తెలిసిన వారు, బుద్ధి సూక్ష్మత తెలిసిన వారు. రచన శక్తి కలవారు. సమయాన్ని వృధాగా గడపక ఏదో ఒక పని చేయువారు. శత్రువుల వల్ల గాని, కలహములు వల్ల గాని ధన నష్టము జరుగును. వీరికి అదృష్టము కలిసివచ్చును. బలహీనమైన శరీరము కలవారు. వీరు తమ అభిప్రాయాలను వెంటనే మర్చుకొందురు. వాతావరణమునకు అనుకూలంగా మారి జీవించుట, ఊహ ప్రపంచంలో సంచరించుట, ఒడలు తెలియని సంతోషము, దుఃఖము పొందుట, లలిత కళ రసావేశము చెంది ప్రవశులగుట వీరి స్వభావము. వీరికి నీటి ప్రదేశములు కలిసివచ్చును. నదులు. కాలువలు లాంటి ప్రదేశములు అనుకూలించును.
మనస్సున న్యాయబద్ధము, ధర్మమార్గము, దయా స్వభావము, దృఢ సంకల్పము కలిగి ఉందురు. ఇతరలను బాధ పెట్టుట వీరికి ఇష్టం ఉండదు. బంధుమిత్రుల సహకారముతో సంపదాలు వచ్చును. దూర ప్రయాణముల వలన నష్టము జరుగును. ఈ లగ్న జాతకుని తల్లితండ్రులకు ఎక్కువ సహకరించదు. వీరికి సంతానం హెచ్చు. సంతానం కొఱకు, విద్య కొఱకు, ఉద్యోగం కోసము దూర ప్రాంతాలకు వెళ్ళవలిసి వస్తుంది. ప్రవీణత చెందినా సన్మానాలు, బహుమతులు, విద్యలు వచ్చును. వివాహ సమయమున గాని, వివాహ కారణముగా గని పెద్దలతో కలహములు ఏర్పడును. కడుపు నొప్పి, ఊపిరితిత్తుల వ్యాధి, మూత్రపిండములకు సంబంధించిన వ్యాధులు వచ్చును. స్త్రీలకు గర్భ కోసములకు సంబంధించిన వ్యాధులు కలుగును. ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా ఉండవలెను. ఈ లగ్నములో పండితులు, జ్ఞానవంతులు ఉండును. మొత్తం మీద ఈ లగ్న జాతకులు తమ యొక్క ధర్మబద్ధమైన ఆచరణ ద్వారా ఉన్నతి శిఖరాలు చేరును.

# రాహు దోషం - నివారణోపాయలు

అన్ని గ్రహాలు రవి వలన అస్తంగతులైతే.. రవి చంద్రులను కూడా నిస్తేజులుగా చేయగల చండ ప్రచండుడు రాహువు. అందుకే ఈయన స్తోత్రంలో "చంద్రాదిత్య విమర్ధనం" అని మర్దించే శక్తీ రాహువుకు గలదని చెప్పబడింది. ప్రాణ శక్తీ కారకుడైన సూర్యుని, మనః శక్తీకి కారకుడైన చంద్రుని మర్ధించే శక్తి ఉంది. అందుకే రాహు మహా దశః బాగు లేనివారు పడే పాట్లు వర్ణనాతీతం.

పురాణా శాస్త్రాల ప్రకారం దక్షుని కూతురు సింహికకు కస్యపునికి రాహువు జన్మించాడు. పైటినసగోత్రజుడు పార్ధవా నామ సంవత్సర భద్రా పద పౌర్ణమి పూర్వభద్రా నక్షత్రామందు జన్మించాడు. మ్లేచ్చ స్వభావం కలిగినవాడు. సూర్యునికి నైరుతి దిశలో శూర్పకార మండలంలో సింహవాహునుడై, కరాళ వక్త్రంతో ఉప విష్ణుడై వుంటాడు.

కొత్త దాన్ని ఆవిష్కరించే స్వభావం రాహువుది. శరీరంలోకి ఫారిన్ మీటర్కానీ, మనుషులకు ఫారిన్ ప్రయాణం కానీ, వ్యక్తులతో పరిచయాలు గానీ, అలవాట్లతో అనుభూతులు కానీ కల్గించేవాడు రాహువు. ఈ గ్రహం గారడీ చేయించే శక్తి కలవాడు. అబద్ధాలు, అల్లకల్లోలాలు, కొత్త అలవాట్లు. కొత్త వేష భాషలు కలిగించడంలో సిద్ధహస్తుడు. గ్రీకు పురాణ గాధల్లో డ్రాగన్ అనే రాకాసి బల్లి వంటి జంతువు తలగా రాహువును, తోకగా కేతువును ప్రతీకలుగ చిత్రీకరించారు. శని గ్రహం వలే రాహువు కర్మ గ్రహం. పూర్వ జన్మ కర్మల్ని అతి విడ్డురంగా అనుభవింప చేయగలడు. దుర్మార్గ స్వభావం కలవారు. అందలం ఎక్కడానికి సహస కార్యక్రమాలు చేపట్టి వారికీ చేయూత ఇవ్వడానికి రాహువు బాగా సహకరిస్తాడు.

అంతేకాదు రాహు మహా దశలో ఖచ్చితంగా పితృ కర్మలు చేయిస్తాడు. కుటుంబంలో ఇద్దరు ముగ్గురికి రాహు దశఃకానీ, అంతర్ దశః కానీ జరుగుతున్నపుడు తండ్రి, తాత, తల్లి, అమ్మమ్మలో ఒకరికి ఆయువు తీరుతుంది. రాహువుకు యోగాలు కల్గించడం ఉన్నా, అనుభవంలో అవయోగాలు ఎక్కువుగా కల్గిస్తాడు."రాహు మహా దశః పట్టిందిరా అనేది వాడుక. అల్పుల అందలం ఎక్కుట వల్ల ఏర్పడిందే. ఫారిన్ భాషలు, ఫారిన్ వస్తువులు ఫారిన్ జబ్బులు తెప్పించడంలో రాహువుదే ఆగ్రాతాంబూలం

## రాహువు వల్ల ఏర్పడే పరిణామాలు

రాహువు వల్ల పలు పరిణామాలు ఏర్పడతాయి. రాజ్యాధికారం కల్పించుటలో , పదవిచ్యుతుని చేయుటలో రాహువు కారకుడు. వర్ణాంతర వివాహాలు చేసుకోనటలో కూడా ప్రభావం కలవాడు. కుట్రలు, పన్నాగాలు, ఎత్తు గడలు, కులద్రోయుట వంటి నీచ గుణాలు కలిగిస్తాడు. సాంప్రదాయాల సంస్కరణకు, మతభ్రస్థత్వాం పట్టిస్తాడు. తక్కువ స్థితిగల స్త్రీ సాంగత్యానికి పురిగొల్పుతాడు. సంకుచిత ఆలోచనలు కల్గిస్తాడు. వ్యసనపరులుగా, పోకిరిలుగా మార్చి దుష్ట స్నేహాలను కల్గిస్తాడు. నైరుతి దిశలో కలిగే లాభ నష్టాలకు కారకుడు. పీడ కలలు, భయందోళనలు కలిగిస్తాడు. రహస్య స్థావరాల పనులు, రహస్య మంతనాలకు ప్రేరేపిస్తాడు. వన దుర్గ దేవి ఆరాధనతో రాహువు ప్రీతీ చెందుతాడు. ఉర్దూ, పర్షియన్ వంటి విదేశీ భాషలు నేర్చుకోవడానికి కారకుడు అవుతాడు.

## రాహువు కలిగించే బాధలు

రాహువు అనేక బాధలు కలిగిస్తాడు. కుటుంబంలో కల్లోలాలు సృష్టిస్తాడు. స్వంత బుద్ధి లోపించి ఇతరుల చెడు సలహాలను పాటించుట, మూర్ఖునిగా ప్రవర్తించుట, అధికార దుర్వినియోగం చేసి అల్లరి పలగుట, ఎలక్ట్రికల్ లేదా ఎలక్ట్రానిక్స్ వస్తువుల వల్ల నష్టాలు, పోలిసు గూడచారి సంస్థల వల్ల బాధ కలుగును. కుటుంబంలో పెద్దవారికీ ఆకస్మిక మరణాలు, పిల్లలు తప్పిపోవుట లేదా ఎత్తుకు పోవుట, కోర్టు వ్యవహారాల్లో చిక్కుకుపోవుట, మిలటరీ సంబంధ, బిల్డింగ్ కాంట్రాక్టు సంబంధ నష్టాలు, పాములు, తేల్లు, గేదెలు, విష జంతువుల వల్ల బాధలు కలిగిస్తాడు. విష గ్యాసులు, ఆమ్లాలు, వాతావరణ కాలుష్యం వల్ల ప్రమాదాలు, న్యూన్యత భావం, ఎక్కడికో పారి పోదామనే మానసిక ప్రవర్తన, జైలు వరకు తీసుకొని వెళ్ళుట చేయిస్తాడు.

చంద్రునితో కలిస్తే గొప్ప బుద్ధి చాంచల్యం గానీ పిచ్చి కానీ కల్గించవచ్చును. కుజుని తో కలిసి చెడిపోతే ఆకస్మిక ప్రమాదాలు, దెబ్బ లాటలు, గాయాలు కల్గిస్తాడు. రవితో కలిస్తే తప్పకుండా తండ్రితో సత్సంబంధాలు దెబ్బ తీస్తాడు. శని రాహువుల కలయిక త్రీవ్రమైన పరిస్తితిలకు దారి తీయవచ్చును. గురునితో కలిస్తే సద్భావన ఉన్నా, తప్పని పరిస్థితిలలో తప్పులు చేయిస్తాడు. ఎంత రహస్యంగా పనులు చేసినా బహిర్గాతం చేసి పరువు తీయిస్తాడు. రాహువు ఎంత యోగం కల్గించినా, ఎంతో కొంత అప్రదిష్ట చేయకుండా ఉండలేడు.

## రాహువు కలిగించే అనారోగ్యాలు

రాహువు వాయుతత్వ కారకుడు కావడం వల్ల మనవ శరీరంలోని సమస్త వాయు సంబంద రోగాలను కల్గిస్తాడు. నొప్పి ఎక్కడుందో అక్కడ రాహువు ఉంటాడు. కడుపు, నాభి, మర్మాంగాల నొప్పులకు ప్రతీక. ఉచ్వాస నిశ్వాసల్లోని గమన సిలత్వాన్ని కంట్రోలు చేసే శక్తీ రాహువుది. ఉరఃపంజర సంబంధ రోగాలను కలిగిస్తాడు. శుక్ర రాహువుల కలయికతో చర్మ సౌంధర్యాన్ని దెబ్బ తీస్తాడు. సమస్తమైన అంటు వ్యాధులకు రాహువు అధిపతి. టైఫాయిడ్, మలేరియా, మసూచి, ఇన్ ఫ్లూ,అనేక రకాల వైరస్ జ్వరాలకు రాహువు పెట్టింది పేరు. కన్య రాశిలో వుంటే అన్ని రకాల పురుగులను కడుపులో పెంచుతాడు. శరీరంలోని రోగనిరోధక శక్తిని తగ్గించి.. బ్యాక్టీరియాను ఆహ్వానించడంలో రాహువు మొదటి వాడు. రాహువు స్టితి బట్టి పక్షవాతం, కీళ్ళవాతం, నడుము నొప్పి కలుగుతాయి

## రాహు గ్రహ నివారణోపాయలు

మానవుని ఇంత ప్రభావం చూపే రాహు గ్రహ నివారణోపాయలు ఇప్పుడు తెలుసుకుందాం. రాహువుకు అధిదేవత పృద్వీ అని కొందరు, గౌ గోవులని కొందరు చెబుతారు. ప్రత్యదిదేవత సర్పములు, అధిప్రత్యాది దేవతా సహితంగా పునశ్చరణ చేసి దార పోయుట వలన నివారణ కలుగును. రాహువుకు అధిష్టాన దేవత దుర్గా దేవి సప్తాసతి పారాయణం కానీ మంత్రం జపం కానీ, కవచం కానీ పునఃశ్చరణ చేయుట వలన నివారణ పొందవచ్చును. చిన్నమాస్తాదేవిని విధి విధానంగా పూజించడం వల్ల రాహు గ్రహం దుష్పరిమనాలను నివారించవచ్చును.

రాహు గ్రహ దోష నివారణకు శనివారం నాడు ప్రారంభించి వరుసగా 18 రోజుల పాటు పారుతున్న నీటిలోకి రోజుకోక కొబ్బరికాయ దార పోయుట వల్ల నివారణ కలుగును. పడుకొనే ముందు గదిలో నెమలి పించాన్ని కనపడేటట్లు పెట్టి, తెల్ల వారు జామున లేవగానే చూచుట వల్ల రాహు గ్రహ పీడ నివారణ కలుగును

రాహు దోషం తొలగాలంటే దీపారాధన కూడా చేయాలి. రాహు యంత్రాన్ని పుష్పాలతో అర్చించాలి. నల్ల దుస్తులు ధరించాలి. ఇంకా మినపప్పును దానం చేసి వేప నూనెతో దీపారాధన చేయడం ద్వారా రాహు దోషం తొలగిపోతుందని శాస్త్రం చెబుతోంది. రాహు భగవానునికి ఏదైనా ఒకరోజు అభిషేకం చేయించాలి. నలుపు వస్త్రాలు, గోమేధికం, బ్లూ లోటస్‌తో పూజ చేయించాలి. రాహు స్తుతి చేసి గరికతో యాగం నిర్వహించి.. మినపప్పు, మినపప్పు పొడి, అన్నం అగ్నికి ఆహుతి ఇవ్వండి. తర్వాత దీపారాధన చేయాలి.

## *తారాబలం చూడడం ఎలా*

ముహూర్త నిర్ణయంలో ప్రధానమైనది తారాబలం. ఏ చిన్న ముహూర్తానికైనా మన జన్మ నక్షత్రానికిసరిపోయే నక్షత్రమును మాత్రమే తీసుకోవాలి. జన్మనక్షత్రం నుండి ముహూర్త సమయానికి ఉన్న నక్షత్రంవరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను 9 చే భాగహరించాలి. వచ్చిన శేషాన్ని బట్టి ఫలితం క్రిందివిదంగా నిర్ణయించాలి.

1 వస్తే 'జన్మతార' అలా వరుసగా....
1) జన్మతార, 2) సంపత్తార, 3) విపత్తార, 4) క్షేమతార, 5) ప్రత్యక్తార, 6) సాధన తార, 7) నైధన తార, 8) మిత్ర తార, 9) పరమమిత్ర తార.

ఇవేవో అశ్వని, భరణి, కృత్తికల వలే వేరే కొత్త తారలుఅనుకోకండి. ఆ 27 నక్షత్రాలకే మన జన్మతారనుబట్టి ఈ తొమ్మిది పేర్లు అన్వయించాలి. అంటే'విద్యార్థి' అనే పేరు గల వ్యక్తి ఉన్నాడు. అతను ఒకరికి కొడుకు, ఒకరికి తమ్ముడు, ఒకరికి భర్త అవుతాడు. అలాగే అశ్వనీ నక్షత్రం ఒకరికి జన్మతార అయితే, మరొకరికి సంపత్తార ( సంపదలు కలిగించేతార ) అవుతుంది. మరొకరికి విపత్తార (విపత్తులుకలిగించేతార) అవుతుంది. ఎవరికి ఏమవుతుందిఅన్నది వారి జన్మనక్షత్రాన్ని బట్టి నిర్ణయించుకోవాలి.
పైవాటిలో సంపత్తార, క్షేమ తార, సాధన తార, మిత్రతార, పరమమిత్ర తారలు (2, 4, 6, 8, 9 తారలు) సకల శుభకార్యాలు చేసుకోవడానికి పనికి వస్తాయి. వృత్తి, వ్యాపార సంబంధమైన విషయాలు 'సంపత్తార'లోను, ప్రయాణాది కార్యాలు 'క్షేమతార' లోను, సాధించి తీరాలనుకునే కార్యాలు 'సాధనతార' లోను ప్రారంభించడం మరింత మంచిది.

జన్మతార కొన్ని శుభకార్యాలకు పనికొస్తుంది.కొన్నిటికి పనికి రాదు.

చెవులు కుట్టడం, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, ఉపనయనం, నిషేకం, యాగం, పట్టాభిషేకం,వ్యవసాయం, భూసంపాదన మొదలైన వాటికి జన్మతారను గ్రహించ వచ్చు.

ప్రయాణం, పెండ్లి, క్షౌరము, ఔషధ సేవనం, గర్భాదానం, సీమంతం, పుంసవనము మొదలైనవి జన్మనక్షత్రంలో చేయరాదు.

ఉదాహరణ : రేవతి నక్షత్రం జన్మ నక్షత్రం అనుకుంటే, ముహూర్త నిర్ణయం రోజు పూర్వాభాద్ర నక్షత్రం ఉందిఅనుకుంటే, రేవతికి పూర్వాభాద్ర సరిపోతుందో లేదో తెలుసుకోవాలి. అంటే రేవతి నుండి పూర్వాభాద్ర ఎన్నో నక్షత్రమో లెక్క పెట్టాలి.

26 వ నక్షత్రంఅవుతుంది. దానిని తొమ్మితో భాగహరించగా శేషం 8వస్తుంది. అంటే రేవతికి - పూర్వాభాద్ర ఎనిమిదో తార (మిత్ర తార) అవుతుంది. అంటే శుభం కనుకముహూర్తము పనికొస్తుంది.

శేషం సున్నా వస్తే అది తొమ్మిదిగా గుర్తించాలి.
తప్పని సరి పరిస్థితులలో ముహూర్త నిర్ణయంచేయవలసి వస్తే .....
ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషువర్జయేత్ !

ప్రథమ నవకం లో (1 నుండి 9 తారలలో ) మొట్టమొదటి తారను,
2 వ నవకం లో (10 నుండి 18 తారలలో ) మూడవతారను,
3 వ నవకంలో (19 నుండి 27 తారలలో) పంచమతారను,
ప్రతీ నవకంలో 7 వతారను ఎల్లప్పుడు వదిలిపెట్టవలెను.

అంటే జన్మనక్షత్రము లగాయతు 1, 7, 12, 16, 23 మరియు 25 నక్షత్రాలను ఎల్లవేళలా శుభకార్యములలో వదిలి పెట్టాలి.

అంటే సాధారణంగా జన్మ నక్షత్రం నుండి 1, 3, 5, 7, 10, 12, 14, 16, 19, 21, 23 మరియు 25 నక్షత్రాలను శుభకార్యములలో వదిలిపెట్ట వలసిఉన్నది. కానీ కావలసిన సమయము లోపలముహూర్తములు కుదరని పక్షమున 1, 7, 12, 16, 23 మరియు 25 తారలు మాత్రం వదిలి మిగతావి రెండవ ఎంపికగా గ్రహించ వచ్చును.

## *నక్షత్రాలు ప్రయోజనాలు*

***ధృవ నక్షత్రాలు*:** ఉత్తర,ఉత్తరాషాడ,ఉత్తరాభాద్ర,రోహిణి నక్షత్రాలు.స్థిరమైన పనులు చేయుటకు పనికి వస్తాయి. ఉదా:- గృహ నిర్మాణం, ఉద్యోగం. ఈ నక్షత్రములు గురు వర్గ జాతకులకు విశేష ఫలములనిచ్చును.

***చర నక్షత్రాలు*:** స్వాతి,పునర్వసు,శ్రవణం,ధనిష్ఠ,శతభిష నక్షత్రాలు చర నక్షత్రాలు. ఈ నక్షత్రాలలో యాత్రలు, విద్యా, వాహన చోదనం, గృహారంభం, నూతన కార్యములు.
పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ నక్షత్రములు గురువర్గము లగ్నాలలో జన్మించిన వారికి మిగితావి శని వర్గం లో జన్మించిన వారికి శుభనక్షత్రాలు.

***ఉగ్ర శని నక్షత్రాలు* :** భరణి, మఖ, పుబ్బ, పూర్వాషాడ, పూర్వాభాద్ర నక్షత్రాలు ఉగ్ర నక్షత్రాలు. ఈ నక్షత్రాలు శుభ కార్యాలకు మంచిది కాదు. ఆయుధాల ప్రయోగానికి, మందులు తయారు చేయటానికి పనికి వస్తాయి.
ఇందులో భరణి, పుబ్బ, పూర్వాషాఢ
ఈ నక్షత్రాలు శని వర్గ లగ్న జాతకులకు మిగితావి గురవర్గ జాతకులకు.

***మిశ్రమ నక్షత్రాలు* :** విశాఖ, కృత్తిక నక్షత్రాలు. ఇవి మిశ్రమ నక్షత్రాలు. ఇవి యజ్ఞ క్రియలు, దేవాలయ కార్యములు చేయుటకు మంచివి. నిప్పు, బాంబులు,పేలుడు పదార్థాలు చేయుటకు మంచిది.

***క్షిప్ర నక్షత్రాలు* :** అశ్విని, హస్త, పుష్యమి, అభిజిత్ నక్షత్రాలు క్షిప్ర నక్షత్రాలు. విద్యారంభానికి, అమ్మకాలకి, ఔషదాలు తీసుకొనుటకు, పనిలో సత్ఫలితాలు ఇచ్చే వాటికి, వెంటనే జరిగే పనులకు ఈ నక్షత్రాలు మంచివి.
పుష్యమి శని వర్గ లగ్న జనితులకు మిగితావిగురువర్గలగ్న జనితులకు.

***మృదు నక్షత్రాలు* :** మృగశిర, రేవతి, చిత్త, అనురాధ నక్షత్రాలు మృదునక్షత్రాలు. ఇవి లలిత కళలు, స్నేహం చేయటానికి, నూతన వస్త్రాలు కొనటానికి, దరించటానికి, దౌత్య కార్యాలకు, వివాహములకు మంచిది.
మృగశిర, చిత్త గురు వర్గ జనితులకు మిగితావి శని వర్గ జనితులకు.

***దారుణ నక్షత్రాలు* :** మూల, జ్యేష్ఠ, ఆశ్లేష, ఆరుద్ర నక్షత్రాలు దారుణ నక్షత్రాలు. ఈ నక్షత్రాలు హింస, దొంగతనం, ఆందోళన కార్యములకు, ఎదుటివారిని జయించటానికి, తాంత్రిక విద్యలకు, చేతబడులు చేయటానికి, ఇతరులను లొంగతీసుకోవటానికి పనికి వస్తాయి. కాని జ్యోతిష్కుడు ధర్మబద్దంగా మార్గదర్శకంగా నడుచుకోవలెను కావున ముహుర్తములు ఇవ్వగూడదు.

***ఊర్ధ్వముఖ నక్షత్రాలు* :** ఆరుద్ర, పుష్యమి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రోహిణి, ఉత్తరాత్రయ నక్షత్రాలు వీటి దృష్టి ఆకాశం వైపుకు ఉంటుంది. కాబట్టి రాచ కార్యాలకు, వ్యవహారాలకు, గృహప్రవేశాలకు, దనుర్విద్యలకు, విమాన చోదనం, గృహ నిర్మాణం, విత్తనాలు చల్లుటకు, దేవాలయ నిర్మాణాలు, రాకెట్ ప్రయోగాలకు మంచివి.
రోహిణి, శ్రవణం, ధనిష్ఠ, ఉత్తరత్రయం ఇవి గురువర్గ జనితులకు మిగితావి శనివర్గ జనితులకు.

***అధోముఖ నక్షత్రాలు* :** మూల, ఆశ్లేష, విశాఖ, కృత్తిక, పుబ్బ, పూర్వాషాడ, పూర్వాబాద్ర నక్షత్రాలు వీటి దృష్టి క్రింది వైపుకు ఉంటుంది. బావులు త్రవ్వటానికి, నాగలి పట్టుటకు, పునాదులు త్రవ్వటానికి పనికి వస్తాయి.
మూలా, విశాఖ, కృత్తిక, పూర్వాభాద్ర ఈ నక్షత్రాలు గురువర్గ జనితులకు మిగితావి శనివర్గ జనితులకు.

***తిర్యఙ్ముఖ నక్షత్రాలు* :** మృగశిర, రేవతి, చిత్త, అనురాధ, హస్త, స్వాతి, పునర్వసు, అశ్విని, జ్యేష్ఠ ఇవి రోడ్లు వేయుటకు, ముందుకు సాగే వాటికి, ద్వజ స్తంభ ప్రతిష్ఠ, విగ్రహ ప్రతిష్ఠలకు మంచిది.

స్వాతి, అనూరాధ, జ్యేష్ఠా, రేవతి ఇవి శనివర్గ జాతకులకు మిగితావి గురువర్గ జాతకులకు.

***పంచక నక్షత్రాలు* :** ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, శుభకార్యాలకు మంచిది. క్రూర కర్మలు ప్రారంభించుటకు, సాహస కార్యములకు ఈ నక్షత్రాలు పనికి రావు. ఈ నక్షత్రాలను ధనిష్ఠా పంచక నక్షత్రాలు అంటారు వీటిలో మరిణిస్తే ఏ జాతకులకైనా మహా దోషం.

***గండ నక్షత్రాలు* :** ఆశ్లేష, మఖ, జ్యేష్ఠ, మూల, రేవతి, అశ్వని నక్షత్రాలలో శిశువు జన్మించిన విశేషంగా గ్రహ శాంతులు చేయవలెను ఏ వర్గంలో శిశువు జన్మించినను దోషం.

## <u>రాశి చక్రం మొత్తం 360 భాగములు</u>

**రాశి చక్రమును 12 భాగములుగా విభజించ బడినది అవి ఈక్రింది విధముగా కలవు:**

(1) మేషం (2) వృషభము (3) మిథునము (4) కర్కాటకము (5) సింహము (6) కన్యా(7) తులా (8) వృశ్చికము (9) ధనస్సు (10) మకరము (11) కుంభము (12) మీనము.

**నక్షత్రములు ఇరువది ఏడు అవి ఈక్రింది విధముగా కలవు:**

(1) అశ్విని (2) భరణి (3) కృత్తిక (4) రోహిణి (5) మృగశిర (6) ఆరుద్ర (7) పునర్వసు (8) పుష్యమి (9) ఆశ్లేష (10) మఖ (11) పుబ్బ (12) ఉత్తర (13) హస్త (14) చిత్త (15) స్వాతి (16) విశాఖ (17) అనూరాధ (18) జ్యేష్ఠా (19) మూల (20) పూర్వాషాఢ (21) ఉత్తరాషాఢ (22) శ్రవణం (23) ధనిష్ఠ (24) శతతార (25) పూర్వాభాద్ర (26) ఉత్తరాభాద్ర (27) రేవతి

***గురువర్గ రాశులు*:**

(1) మేషం (2) కర్కాటకం (3) సింహం (4) వృశ్చికము (5) ధనస్సు (6) మీనం

***గురువర్గ నక్షత్రములు***

అశ్విని, కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, హస్త, చిత్త, విశాఖ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, పూర్వాభాద్ర పదిహేను నక్షత్రములు గురువర్గమునకు చెందినవి.దినసరి సమయాల్లో గురువర్గ సమయాలు. ఉ: 9:00 గం!!ల నుండి మధ్యాహ్నము 12:00గం!!ల వరకు సాయంత్రం 06:00 గం!!ల నుండి 09:00 గం!!ల వరకు అర్ధరాత్రి 00:00 నుండి(12:00)03:00గం!!ల వరకు రాత్రి 03:00 గం!! ల నుండి ఉ:06:00 గం!!ల వరకు.

<table>
<tr><td>పూర్వాభాద్ర - 4<br>ఉత్తరాభాద్ర - 1,2,3,4<br>రేవతి - 1,2,3,4<br>మీన రాశి</td><td>అశ్విని - 1,2,3,4<br>భరణి - 1,2,3,4<br>కృత్తిక - 1<br>మేష రాశి</td><td>కృత్తిక - 2,3,4<br>రోహిణి - 1,2,3,4<br>మృగశిర - 1,2<br>వృషభ రాశి</td><td>మృగశిర - 3,4<br>ఆరుద్ర - 1,2,3,4<br>పునర్వసు - 1,2,3<br>మిధున రాశి</td></tr>
<tr><td>ధనిష్ఠ - 3,4<br>శతభిషం - 1,2,3,4<br>పూర్వాభాద్ర - 1,2,3<br>కుంభ రాశి</td><td colspan="2" rowspan="2">1) అశ్విని, భరణి, కృత్తిక పాదో మేషం<br>2) కృత్తిక త్రయో, రోహిణి, మృగశిరార్ధం వృషభం<br>3) మృగశిరార్ధం, ఆరుద్రా, పునర్వసు త్రయో మిధునం<br>4) పునర్వసు పాదోః పుష్యమి, ఆశ్లేషాంతం కర్కాటకం<br>5) మఖ, పుబ్బ, ఉత్తర పాదః సింహం<br>6) ఉత్తర త్రయో, హస్త, చిత్తార్ధం కన్య<br>7) చిత్తార్ధం, స్వాతి, విశాఖ త్రయో తులః<br>8) విశాఖ పాదః అనూరాధ, జేష్ఠ్యాంతం వృశ్చికం<br>9) మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పాదః ధనస్సు<br>10) ఉత్తరాషాఢ త్రయో, శ్రవణం, ధనిష్టార్ధం మకరం<br>11) ధనిష్టార్ధం, శతభిషం, పూర్వాభాద్ర త్రయో కుంభః<br>12) పూర్వాభాద్ర పాదః, ఉత్తరాభాద్ర, రేవత్యాంతం మీనం</td><td>పునర్వసు - 4<br>పుష్యమి - 1,2,3,4<br>ఆశ్లేష - 1,2,3,4<br>కర్కాటక రాశి</td></tr>
<tr><td>ఉత్తరాషాఢ - 2,3,4<br>శ్రవణ - 1,2,3,4<br>ధనిష్ఠ - 1,2<br>మకర రాశి</td><td>మఖ - 1,2,3,4<br>పుబ్బ - 1,2,3,4<br>ఉత్తర - 1<br>సింహ రాశి</td></tr>
<tr><td>మూల - 1,2,3,4<br>పూర్వాషాఢ - 1,2,3,4<br>ఉత్తరాషాఢ - 1<br>ధనస్సు రాశి</td><td>విశాఖ - 4<br>అనూరాధ - 1,2,3,4<br>జేష్ఠ - 1,2,3,4<br>వృశ్చిక రాశి</td><td>చిత్త - 3,4<br>స్వాతి - 1,2,3,4<br>విశాఖ - 1,2,3<br>తుల రాశి</td><td>ఉత్తర - 2,3,4<br>హస్త - 1,2,3,4<br>చిత్త - 1,2<br>కన్య రాశి</td></tr>
</table>

## 'వర్జ్యం'

' వర్జ్యం ' అంటేనే విడువదగినది వర్జ్య కాలమును నక్షత్రాన్ని బట్టి నిర్ణయిస్తారు. ప్రతి నక్షత్ర సమయంలో వర్జ్య కాలం ఉంటుంది.వర్జ్య కాలం అంటే విడువ తగిన కాలం.అశుభ సమయం.శుభకార్యాలు , ప్రయాణాలు ఈ సమయంలో చేయకూడదు. ప్రతి నక్షత్రానికి వర్జ్యం 4 ఘడియలు లేదా 96 నిమిషాలు విష ఘడియలు కావున ఆ సమయము మంచిదికాదు.విషఘడియలు కావున వర్జ్యము అనుట జరిగినది.అదే విధముగా నక్షత్ర సమయములో కొంత సమయము చాలా మంచి సమయము వుంటుంది దానిని అమృతఘడియలంటారు.ఈ వర్జ్య అమృత ఘడియలు నక్షత్రాంద్యంతమును బట్టి వస్తాయి.

## కుజ దోషం అంటే ఏమిటి?

మనలో ప్రతి ఒక్కరూ సహజంగా వివాహ సమయంలో జాతకాలు చూసేటప్పుడు కుజదోషం అనే పదాన్ని వింటూనే ఉంటాం. కుజదోష నిర్ధారణ విషయంలో ఒక్కో పండితుడు ఒక్కోరకంగా నిర్ధారిస్తారు. అసలు కుజదోషం అంటే ఏంటో తెలుసుకుందామా?

నవగ్రహాలలో కుజుడిది మూడో స్థానం. కుజుడికి మంగళుడని, అంగారకుడని పేర్లు కూడా కలవు. మేష, వృశ్చిక రాశులకు ఈయన అధిపతి. మకరం ఉచ్చస్థానం, కర్కాటకం ఇతనికి నీచస్థానం. మృగశిర చిత్త ధనిష్ట నక్షత్రాలకు అధిపతి కుజుడు.

మార్గాలు.. వాటి సంగతి పక్కన పెడితే దోష స్థానంలో ఉన్న కుజునికి బుధ గురు గ్రహముల వీక్షణ కలిగినట్లైతే దోషం పరిహారమతుందనీ, అదే విధంగా దోష స్థానంలో ఉన్న కుజునితో గురువుగానీ చంద్రుడు గానీ కలిసి ఉన్నట్లైతే దోషపరిహారం కుజుడు కోప స్వభా వం కలిగినవాడు కావడంతో కుజుడి ఆధిపత్య కాలంలో సోదరుల మధ్య వివాదాలు, రుణబాధలు, భూవివాదాలు తలెత్తుతాయి. .

అయితే... ఒకరి జాతకంలో మాత్రమే కుజదోషం ఉంటే కష్టనష్టాలు కలుగుతాయి. ఇందులో భాగంగా... పురుషులకు 2, 12 స్థానాల్లోనూ, స్త్రీలకు 4, 7 స్థానాల్లోనూ... ఒకవేళ ఇద్దరికీ ఎనిమిదో స్థానంలో కుజుడు ఆధిపత్యం వహించినట్లైతే కుజదోషం తప్పకుండా ఉంటుందని జ్యోతిష్కులు అంటున్నారు.

వధూవరులకు కుజదోషం లగ్నం నుండి, చంద్రుని నుండి, శుక్రుని నుండి 1, 2, 4, 7, 8 మరియు 12 స్థానాలలో అంగారకుడు ఉన్నట్లైతే... అలాంటి దంపతులు దీర్ఘకాలం సుఖసంతోషాలతో జీవిస్తారు. సంతాన సంపత్తి కూడా కలుగుతుంది.

అయితే ఒకరి జాతకంలో కుజదోషం ఉండి, మరొకటి జాతకంలో లేనివారికి వివాహం జరిపిస్తే ఆ దాంపత్యం చిరకాలం వర్ధిల్లదు. పుత్రనాశనం, మరణభయం కలుగుతుంది. వధూవరులిద్దరికీ కుజదోషం అనేది ఉంటే మంచిదే. దీనివల్ల శుభాలు కలుగుతాయని జ్యోతిష్కులు అంటున్నారు.

అలా కాకుండా ఇద్దర్లో ఏ ఒక్కరికో కుజదోషం లేకుంటే... అలాంటి వారికి ఎట్టి పరిస్థితుల్లోనూ వివాహం జరిపించటం మంచిది కాదు. జాతక ఫలాల్లో పెళ్లికి ప్రధాన అడ్డంకిగా అందరూ చెప్పుకునేది కుజదోషం. సాధారణంగా ఈ కుజదోషం స్త్రీ పురుషులు ఇద్దరికీ వారి జనన సమయంలో సంప్రాప్తిస్తుంది. వివాహాది సంబంధ విషయాలలో వధూవరుల జాతక ఫలాలను సరిచూసుకోవటం ఇప్పుడు ప్రతి ఇంటా జరుగుతున్న విషయం. కుజదోషం ఉండి దానికి సరైన పరిహారం చేయని వారి వివాహబంధంలో దాంపత్య అనుకూలత లోపించి సమస్యలు కలుగుతాయి. కనుక వధూవరులిద్దరూ తప్పనిసరిగా జాతక ఫలాలు చూసుకోవలసి ఉంటుంది.

ప్రధానంగా వరుని జాతకంలోని కుజదోషం వధువుకి, వధువు జాతకంలోని కుజదోషం వరునికి కీడు కలుగుతుందని అభిప్రాయం. అయితే వధూవరులు ఇద్దరికీ కుజదోషం ఉన్నట్లైతే దోష పరిహారం జరిగి శుభం చేకూరుతుంది. ఈ విషయంలో వధూవరులిద్దరికీ జాతకంలో సమపాళ్లలో దోషమున్నట్లైతేనే వివాహం చెసుకోవచ్చునన్న అభిప్రాయం ఉంది. ఈ దోషం స్త్రీలకు మాత్రమే ఉన్నట్లైతే దాంపత్య కలహం వంటి అనేక దుష్పరిణామాలు చోటు చేసుకోగలవని శాస్త్రవేత్తల అభిప్రాయం.

కుజదోష పరిహారానికి ఎన్నో జరుగుతుందని శాస్త్రవేత్తల అభిప్రాయం. కనుక కుజదోష నివారణకు అనుసరించవలసిన మార్గాలను అన్వేషించి దోషం నివారణ జరిగిన తర్వాతే వివావ కార్యక్రమాలకు పూనుకోవాలని శాస్త్రవేత్తలు పేర్కొంటున్నారు. కుజదోషం అని పండితులు చెప్పగానే వధూవరుల తల్లితండ్రులు కుమిలి కుమిలి పోతుంటారు. అలా బాధపడే వారందరూ సంతోషంగా ఉండాలనే ఉద్దేశ్యంతోనే... "కుజదోషంపై నిజానిజాలు" ఇవ్వటము జరిగింది జాతకాలలో కుజగ్రహం జన్మలగ్నము నుంచి 2, 4, 7, 8, స్థానాలలో వుంటే కుజదోషముండునని తెలుసుకున్నాము. మరి ఈ కుజదోషం కొందరికి

వర్తించదని శాస్త్రాలు చెబుతున్నాయి. ఎవరెవరికి ఈ కుజదోషం వర్తించదో ముందు తెలుసుకుందాం. జ్యోతిశ్శాస్త్రం ప్రకారం కుజగ్రహం తన నీచస్థానమైన కర్కాటక రాశిలో వుండి వుంటే, అట్టివారికి కుజదోషం వర్తించదని భావం. అలాగే కుజుడికి తన స్వక్షేత్రములైన మేష వృశ్చిక రాశులలో గానీ, ఆయా లగ్నాలలో గానీ జన్మించి వుంటే కుజదోషం వర్తించదు. కుజగ్రహానికి మిత్రులైన రవి గురుల రాశులైన సింహ, ధనుస్సు, మీన రాశులలో గానీ, లగ్నాలలో గానే జన్మించివుంటే కుజదోషము వర్తించదు. కుజగ్రహానికి ఉచ్చస్థానమైన మకరరాశి యందు లేక మకరలగ్న మందు జన్మించిన వారికి కుజదోషము వర్తించదు. మేష, వృశ్చిక, కర్కాటక, సింహ, ధనుస్సు, మకర, మీన రాశులలో గానీ, లగ్నాలలో జన్మించిన వారికి కుజదోషం భంగమగునని, భయపడవలసిన అవసరం లేదని........ పైన పేర్కొన్న పేరా సారాంశం. మొత్తం 12 రాశులలో 7 రాశుల జాతకులు పోనూ..... మిగిలిన అయిదు రాశుల జాతకులకు కుజదోషం వుంటే భంగం కాదనే కదా సారాంశం. మరి ఆ రాశులు ఏమిటంటే... వృషభ, మిధున, కన్య, తుల, కుంభ రాశులు... మరి ఈ రాశులలో మాత్రమే గాక మొత్తం 12 రాశులలో ఏ రాశివారికైన కుజదోషం వుండి వుంటే, వారి జాతకంలో కుజుడిని, గురుగ్రహం విశేష దృష్టులతో చూస్తూవుండిననూ కుజదోషం వర్తించదనే శాస్త్ర నిర్ణయములున్నవి.

రెండవ స్థానంలో కుజుడు దోషరూపంలో వుండి... వారు మిధున కన్యారాశులలో గానీ, మిధున కన్యాలగ్నాలలోవుండిన కుజదోషం వర్తించదనే శాస్త్రప్రమాణమున్నది. అనగా 4, 7, 8 స్థానాల దోషం భంగపడదు. కేవలం రెండవ స్థాన దోషం భంగమగునని ఉద్దేశ్యం. మరి ఈ విషయం 2 వ స్థాన దోషం వారికి ఊరట నిచ్చే మాట.
నాల్గవ స్థాన కుజదోషం వున్నవారు మేష వృశ్చిక రాశులలో గానీ, మేష వృశ్చిక లగ్నాలలో గానీ జన్మించి వుంటే కుజదోషం వర్తించదు. అంటే 2, 7, 8 స్థానాల లోపం ఉంటుందని భావం. అలాగే సప్తమ స్థానంలో కుజదోషం వున్నవారు మకర కర్కాటక రాశులలో గానీ, మకర కర్కాటక లగ్నాల యందు గానీ జన్మించి వుంటే 7 వ స్థాన కుజదోషం భంగమగునని, రెండు, నాలుగు, ఎనిమిది స్థానాలలో భంగం కాదని శాస్త్ర నిర్దేశం.

అష్టమ స్థాన కుజదోషం వున్నవారు ..... ధను, మీన రాశులలో లేక లగ్నాలలో జన్మించి వుంటే.... వారికి అష్టమ స్థాన కుజదోషం వర్తించదు. ఈ కుజదోషమనేది జన్మ లగ్నం నుంచే వుంటుంది. జనం లగ్నం నుంచే లెక్కించాలి. చంద్రుడు ఉన్న రాశి నుంచి, శుక్రుడు ఉన్న రాశి నుంచి, కుజ దోష స్థానాన్ని చూడవలసిన అవసరం లేదు. ఆ విధంగా చూస్తే ప్రపంచంలో ఉన్న ప్రతి ఒక్కరికి జన్మ లగ్నం నుంచి, చంద్రుడి నుంచి శుక్రుడి నుంచి కుజదోషం వుండి తీరుతుంది. ఇది సరియిన సక్రమమైన వివరం కాదు. కేవలం జన్మ లగ్నం నుంచి మాత్రమే కుజదోషాన్ని లెక్కించాలి. ఇరవై ఏడు నక్షత్రాలలో జన్మించిన ఏ ఒక్కరూ కుజదోషం గురించి బెంగ పడాల్సిన అవసరం లేనేలేదు.
కుజదోషం ఉంటే... పగడం, శని (ఏలినాటి శని) దోషానికి... నీలం, ఇలా ఎప్పుడు కూడా ధరించకూడదు. మీ జాతకానికి పగడం సరిపడకపోతే కొత్త సమస్యలు ఎదురవుతాయి. పగడం అనే రత్నం ఏ రకంగానూ కుజదోషాన్ని తగ్గించదు. విధించే హోదాలో ఉంటారు. శౌర్యము, ఆత్మగౌరవమును కలిగి ఉంటారు. ఆత్మగౌరవాన్ని కలిగి ఉంటారని జ్యోతిష్కులు పేర్కొంటున్నారు. ఇక కుజగ్రహ కారకత్వములను పరిశీలిస్తే... కుజుడు శౌర్యము, యుద్ధ ప్రియుడుగా ఉంటాడని వారు చెబుతున్నారు.

కుజ, కుజునిగా పరిగణించబడే కుజాధిపత్య జాతకంలో జన్మించిన జాతకులు కఠిన కష్టాలను ఎదుర్కొన్నా... అంగారకుడిగా దోషం నుంచి శాంతి కలగాలంటే... రాగిని నైవేద్యం చేయడం ద్వారా తృప్తి పరుచవచ్చునని జ్యోతిష్కులు అంటున్నారు. ఈ

కుజగ్రహాధిపత్య జాతకులు విద్యుత్, వ్యవసాయం, మిలటరీ, పోలీసు రంగాల్లో రాణిస్తారు. గణితం కఠినమైన శిక్షలు ఇతరుల అంత సులభంగా నమ్మబోరు. వారితో స్నేహం అయిన చాలారోజులకే నమ్మటం చేస్తారు. తర్కశాస్త్రం, శస్త్రవిద్యలను అభ్యసించేవారుగా ఉంటారు. కుజదోషమున్న జాతకులు ఎరుపు వస్త్రంతో పాటు రాగి గింజలను నైవేద్యం చేసి తృప్తి పరచడం ద్వారా బలోపేతమైన సమస్యల నుంచి కాస్త విశ్రమించవచ్చునని జ్యోతిష్కులు వివరిస్తున్నారు.

కుజుడు ఉష్ణ ప్రకృతి గల గ్రహము. దీనిని పాప గ్రహముగా చెప్పబడును. వివాహము మరియు వైవాహిక జీవితములో కుజుని యొక్క అశుభ ప్రభావము అధికముగా కనిపించును.

కుజ దోషము కలవారిని మాంగళీకునిగా చెప్పబడును. గ్రహ దోషము కారణముగా అనేక మంది స్త్రీ పురుషులు జీవితాంతము అవివాహితులుగా వుండిపోయెదరు. ఈ దోషము వలన గల భయమును తొలగించుటకొనుటకు దీని గురించి పూర్తిగా తెలుసుకొనుట అవసరము.

## గ్రహ కారక తత్వాలు – 1

***సూర్య గ్రహ కారకత్వములు***

తండ్రి, ఆత్మ, ఇతరులకు అపకారం కోరని మనస్తత్వం, శక్తి, పితృచింత, ఆత్మాభిమానం, నారాయణోపాసన, ధైర్యం, బుద్ధి, ఆరోగ్యం, పిత్తము, కార్యనిర్వహణాశక్తి, బుద్ధిబలం, యజ్ఞము, దినబలము, సౌమ్యత, రాగి, దేవాలయము, గిరిగమనం, కీర్తి, అధికారం, హృదయం, స్వల్పకేశము, శిరోవ్యాధి, ప్రవర్తన, క్షత్రియ, పాషాణము, భూషణము, వ్యవహారము, లావునడుము, రక్తవర్ణము, రాజసము, రోషము, కారము, పొట్టి, తూర్పుదిశ, జ్ఞానోదయము, ప్రవాళము, రాజ్యము, స్వస్థల స్వాధికారలాభము, పరాక్రమమునకు ఘనత, జనప్రియుడు, శతృభయంకరుడు, యుద్ధం, ఉద్యోగం, వైద్యం, సౌఖ్యం, పితృ ప్రియుడు, ఆత్మజ్ఞానం, వీపుపై భాగం, పక్కలు, స్త్రీల యందు ఎడమకన్ను, పురుషులయందు కుడికన్ను పై ప్రభావం, ఆరోగ్యము, ప్రాణధాతువులు, గౌరవమైన పదవులు, బిరుదులు, అభివృద్ధి, రాజకీయములు, పరిపాలనాధికారులు, ధర్మాచరణ,సకల వేదశాస్త్ర పారంగతుడు జ్యోతిష్యానికి మూలం మొదలైనవి రవి కారకత్వములు.
గురువర్గ గ్రహము సింహరాశ్యాధిపతి, కృత్తిక, ఉత్తర ఫాల్గుణి, ఉత్తరాషాఢ నక్షత్రాలకు అధిపతి.

***చంద్ర గ్రహ కారకత్వాలు***

తల్లి, మనస్సు, ప్రసాదగుణం, మాతృచింత, పుష్పములు, సుగంధం, రూపం, సుఖభోజనం, సముద్రస్నానం, వెండి, తీపి, పాలు, వస్త్రం, నీరు, ముత్యం, ఆవులు, కంచు, పండ్లు, అపస్మారకం, గుల్మము, యశస్సు, పట్టువస్త్రం, బావి, స్త్రీలకు అండాభివృద్ధి, జలసౌఖ్యం, శ్లేష్మము, బలము, పంట, యాత్ర, అశ్వసంచారం, దుర్గగమనం, శీతజ్వరం, సమదృష్టి, స్నానశాల, సత్యం, తటాకము, మణి, వైశ్యులు, చెరుకు, నడివయస్సు, లగ్నం, పరిహాసం, గౌరీభక్తి, దూరదేశగమనం, వాయువ్య దిశ, వ్యాధి, కూపము, వాతము, మధువు, స్థూలము, క్షయ, స్త్రీ, ద్విజ, సౌఖ్యం, , నిద్ర, ముఖము, ఉదరం, వ్యవసాయం, వైద్యం, వ్యాపారం, నీటిసంబంధమైన పని, బుద్ధి, సౌందర్యము, సత్యము, రంజితము, మనసు, దాని స్వభావము, మనశ్శక్తి, ఉదరము, స్తనములు, పురుషులయందు ఎడమకన్ను, స్త్రీలలో కుడికన్ను మొదలైనవి చంద్రుని సంబంధ కారకత్వములు.
కర్కాటకరాశ్యాధిపతి, రోహిణి,హస్త,శ్రవణ నక్షత్రాధిపతి గురువర్గ గ్రహము.

***కుజ గ్రహ కారకత్వాలు***

కనిష్టసోదరీ సోదరులు, సేవకాగుణం, భూమి, ప్రాకారం, రోగము, వ్రణము, సాహసం, శస్త్రములు, అగ్ని, స్ఫోటకము, సందర్శనము, ఉత్పాటనము, రక్తవస్త్ర ప్రియుడు, కాలినవస్త్రం, ఋణము, ఉద్యానవనము, బలము, వనచరుడు, స్వర్గకారకుడు, వాతము, రాగి, పొడువు, శౌర్యము, యుద్ధప్రియత్వము, విరోధము, సైన్యాధిపత్యము, వాక్కు, కటినాధిపత్యం, సీసం, విదేశగమనం, దక్షిణదిశ, తర్కశాస్త్రం, శస్త్రవిద్య, శత్రువృద్ధి, స్ఫోటకము, మూర్ఖత్వము, ఆయుధధారణ, వాగ్వాదం, మూత్రకుచ్ఛము, వ్యాపార గణితం, కటినమైన శిక్షలు విధించు ఉద్యోగం, పోలీసు, మిలటరీ, విద్యుత్తు, వ్యవసాయం, ధైర్యము, శౌర్యము, ఆత్మగౌరవము, మూత్రాశయము, కండలు, తల, ముఖము, మజ్జ, ఎడమచెవి, చర్మము, కేశములు, రక్తము, నరాలు, గోళ్ళు, దంతాలు, ఎముకలు, మెదడు, వెన్నుపూస, మూత్రపిండాలు మీద ప్రభావము, మొదలైనవాటికి కుజుడు కారకత్వము వహిస్తాడు.

గురు వర్గ గ్రహము: దక్షిణ దిశ మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రాలకు ఆధిపత్యము మేష వృశ్చకరాశ్యాధి పతి.

***బుధ గ్రహ కారకత్వాలు***

ప్రజ్ఞ, కర్మ, విజ్ఞానం, గణితం, ఇంజనీరింగు, సాఫ్ట్ వేర్,సివిల్,వైద్యవిద్య, గూఢ రహస్య విద్యలు శిల్పము, జ్యోతిషము, విద్య, మేనమామ, చింత, బుద్ధి, సుందర స్వరూపం, శాంతం, గృహప్రవేశం, వ్యాపారం, వ్యవహారం, వేదాంతవిచారణ, సేవకులు, నాభి, శ్రీ మహాగణపతి ఉపాసన, వ్యాకరణం, నామకరణం, మైథునం, విష్ణుభక్తి, వైద్యము, యుక్తి, భుక్తి, దాసదాసీజన వృద్ధి, పరిహాసము, జ్ఞాతులు, తంత్రము, నపుంసక కారత్వము నిచ్చువాడు, పాదచారి, అడ్డచూపు, యువరాజు, పికిలిన వస్త్రం, రజోగుణం, సునేత్రం, ఆకుపచ్చ, రచన, మేడలు, వినయం, రత్నశోధన, వైశ్య జాతి, యాత్ర, సమదృష్టి, భయం, భూమి, స్థిరము, వాక్కు, హాస్యము, ఉత్తర దిశ, వేదాంతం, గుమాస్తా, పుస్తకములు వ్రాయుట, అమ్ముట, తీర్పుచెప్పుట, నాటకములు, సినిమాలు, వ్యాపారము, పుత్ర సుఖదుఃఖము, మాతులసుఖం, గణితం, వేదాంతం, శిల్పశాస్త్రం, వక్తృత్వం, శరీరంలోని నాడులు, నరముల మీద ప్రభావం, ప్రేగులు, ముంజేయి, నోరు, నాలుక, దృష్టి, భావము, ఇంద్రియజ్ఞానము, ఊహ, భాషాంతరీకరణము, శైలి, అలవాటు వలన విద్యనభ్యసించటం, అనుకరణ.

ఉత్తర దిశ, మిథున, కన్య, రాశ్యాధిపత్యం, ఆశ్లేష,జ్యేష్ఠ,ఉత్తర భాద్ర నక్షత్రాధిపతి, శనివర్గ గ్రహము.

***బృహస్పతి గ్రహ కారకత్వాలు***

విద్య, పుత్రులు,స్వగృహము, కుటుంబము, జ్యేష్ట భ్రాత, దేహపుష్టి, మేధస్సు, అర్థసంపద, యజ్ఞము, కీర్తి, బంగారము, శస్త్రము, అశ్వము, జ్యోతిషము, వేదశాస్త్రము, శబ్దశాస్త్రము, వాహనసౌఖ్యం, ఆందోళికము, గజము, యజ్ఞయాగాది క్రతువులు, కర్మ, ఆచారము, ఛాందసము, సుజనత్వము, శాంతము, ఆచార్యత్వము ఐశ్వర్యము, బంధువృద్ధి, దయ, దాక్షిణ్యము, ధర్మము, దైవభక్తి, పసుపు వస్త్రము, సత్యము, తర్కము, మీమాంస, సింహాసనము, వాగ్ధోరణి, పసుపురంగు, నృపసన్మానం, ధర్మం, వెండి, బ్రాహ్మణులు, కోశాగారం, నవీనగృహం, బంధుసమూహం, సుబుద్ధి, ఈశాన్య దిశ, కావ్యజ్ఞానము, నిక్షేపము, కనకపుష్యరాగము, ఊరువులు, అగ్నిమాంద్యము, దంతములు, వేదవేదాంతజ్ఞానము, బ్రాహ్మణభక్తి, శ్రద్ధ, పాండిత్యం, బ్రాహ్మణవృత్తి, ఉపాధ్యాయవృత్తి, ముద్రాధికారం, భ్రాతృసుఖం, సంపత్తి, బహువిధ విద్వత్తు, వ్యాకరణం, పిత్తాశయము, కాలెయము ఉన్నత విద్యలపై అధికారము, వాణిజ్య విషయములు, ధన విషయములు

మొదలైనవి గురుని కారకత్వములు. గురువర్గగ్రహము ధనర్ మీన రాశ్యాధిపతి పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర, నక్షత్రాధిపతి ఈశాన్య దిశ.

***శుక్ర గ్రహకారకత్వములు***

వివాహం, భార్య, భాగ్యం, భోగం, వాహనం, విలాసవంతమైన జీవనం కామసుఖం, సంగీతం, విద్యాది రహస్యం, నృత్యం, సంగీతం, లలితకళలు, సరస సల్లాపము,

స్త్రీ సౌఖ్యం, ఆభరణం, మణిమాణిక్యాది కారకుడు, నాటకాలంకార సాహిత్యాదులు, వ్యభిచారం, నృత్తము, ఆభరణం, ఐశ్వర్యం, రహస్యమోహము, కపటం, వేశ్యాసంభోగం, సౌమ్యం, సౌందర్యం, శ్వేతవర్ణం, సునేత్రం, ఖండశరీరం, పొట్టి, గర్వం,అహం, దృడత్వం, ఆజ్ఞ, శుక్లం, శయనాగారం, మంత్రం, ఆగ్నేయదిశ, మధ్యవయస్సు, రాజముద్ర, సత్యవచనం, యజుర్వేదము, భరతశాస్త్రం, శ్వేతఛత్రం, వింజామరలు, ఐశ్వర్యము, సింహాసనము, సుగంధము, హేమము, రాజు, రతి, స్త్రీసుఖం, గానం, కాంతి, కళాకౌశలం, స్పర్శ, గొంతు, అండకోశము, అంతఃకరణము మీద ప్రభావం, భూతదయ, ఉన్నతమైన మేధాశక్తి, సంగీతము, నాట్యము, నాటకశాలలు, పద్యకవిత్వము, చిత్రలేఖనము సినీ రంగము,మొదలైన వాటికి శుక్రుడు కారకత్వం వహిస్తాడు. శనివర్గ గ్రహము వృషభ, తులారాశ్యాధిపతి. భరణి,పూర్వ ఫాల్గుని, పూర్వాషాఢ నక్షత్ర అధిపతి.ఆగ్నేయ దిశ.

***శని గ్రహ కారకత్వాలు***

ఆయువు, జీవనోపాయం, మరణం, సేవకులు, జైలు, బంధనం, ప్రవాసం, నీచ సాంగత్యం, దుఃఖము, అధర్మం, స్ఫోటకం, కురూపం, శాంతము, అనాచారం, నల్లధాన్యములు, మహిషము, ఖర్మ కారకత్వం, దుష్ప్రవర్తన, కోపము, పాపము, నరకము, నీచజీవనము, హూణవిద్య, కృషిజీవనం, శూద్రప్రియుడు, క్రిందిచూపు, అజీర్ణము, అసత్యం, అన్యకుల విద్య, కఠినము, ఔదార్యం, కఠినరోమములు, పౌరుషహీనం, మలినవస్త్రం, నీలమణి, ఇనుము, భూపరాగం, తిల, తైలములు, దాస్యము, విరోధం, దుఃఖం, మరణం, నపుంసకత్వాన్ని ఇచ్చేవాడు, ప్రతిబంధనం, పశ్చిమ దిశ, అడవుల సంచారం, పౌరుషం, వాతము, వాద్యధ్వని, దుస్సాహసము, కార్యభంగము, కిరాతత్వము, వ్యసనము, జ్యేష్టసోదరుడు, నౌఖరుల సుఖదుఃఖాలు, ఘాతుక స్వభావం, దారిద్ర్యం, కారాగృహవాసం, కుడిచెవి, శ్రవణశక్తి, ప్లీహము అపమృత్యువు మొదలైనవి శని గ్రహ కారకత్వములు. మకర,కుంభ రాశ్యాధిపత్యం పుష్యమి,అనూరాధ, ఉత్తరాభాధ్ర నక్షత్రాధిపతి శని వర్గ గ్రహము.

***రాహు గ్రహ కాకత్వాలు***

పితామహ , మాతామహ సంబంధములు, ఛత్రం, హూణవిద్య, తటాకములు, ఆరామములు, సీసము, సన్మానము, యవ్వనం, బొమికెలు, పాపస్త్రీవలన లాభము, వ్యయము, వ్యవసాయము, వ్యాపారము, వ్యతిరిక్తత, వైధవ్యం, వృక్షపతనము, శిలలు, బలాత్కారము, సంకోచము, ఉద్యోగము, వివాహము, యుద్ధము, బొగ్గు, ధూమపానము, పొగాకు, ఛామరం, పితృచింత, విషవైద్యము, క్షుద్రమంత్రాలు, నీచజీవనము, ద్యూతం, పశుసాంగత్యం, అపసవ్యలిపి,గుహ్య, గుద బాగమందు రోగాలు గారడి, లాటరీలు, కుతర్కం, పాపస్త్రీ, పాము, రాత్రి,విష జీవులు,క్రూర జీవులు ఏకఛత్రాధిపత్యం, నైఋతిదిశ, రాజ్యము, జూదగుణం, స్వదేశ, నీచాశ్రయం, శ్వాస, ప్రేతత్వము, కర్మ, విసనకర్ర, రసాయనిక శాస్త్రం, రత్నపరీక్ష భూత,ప్రేత ఉఛ్ఛాటనాది ప్రయోగాలు. రాహుకారకత్వములుగా చెప్పబడ్డాయి. ఈ గ్రహం శని వర్గగ్రహం

ఛాయా గ్రహం కావున రాశ్యాధిపత్యం లేదు. ఆరుద్ర,స్వాతి,శతతార నక్షత్రాధిపత్యం కలిగిన గ్రహం.

***కేతు గ్రహ కారకత్వాలు***

పితా మహ ,మాతా మహచింత, మట్టిపాత్రలు, మోక్షము, ఆలస్యం, నిద్ర, ముక్కు, స్వప్నము, జాగ్రదవస్థ, ప్రవాసము, ఉదరము, నేత్రసంబంధము, మూఢభక్తి, చిత్రలిపి, క్రూరకృత్యములు, యోగాభ్యాసము, పింగాణి, బహుదాతృత్వము, వేదాంతవిచారణ, దైవభక్తి, వైరాగ్యము, జ్ఞానము, అన్యభాషాప్రవేశం, కిరాతకం, పాషాణం, వ్రణం, అల్పాహారము, శతృబాధ, జడత్వం, కపలత్వం, వైద్యము, కృత్రిమమణులు, కృత్రిమ వస్తువులు, స్ఫోటకము, తారు, విషాదము, గంగాస్నానము, భోగభాగ్యములు, మూఢభక్తి, లోభత్వం, అన్యభాష, మిత్రభేదము, శైవదీక్ష, మతము, మతఛాందసము, దంభము, నటనము, భిక్షాటన, కీర్తి, కపాలము, స్నేహము, బ్రహ్మవిద్య, పితామహాది సంబంధ లాభములు మొదలైనవి కేతు కారకత్వములు. ఈ గ్రహం గురు వర్గ సంభదితమైనది. ఇద్ కూడ చాయా గ్రహం కావున దీనికి కూడ రాశ్యాధిపత్యం లేదు. అశ్విని, మఖ, మూల నక్షత్రాధ్పత్యం కలిగిన గ్రహం.

**తారాబలం చూడడం ఎలా?**

ముహూర్తా నిర్ణయంలో ప్రధానమైనది తారాబలం. ఏ చిన్న ముహూర్తానికైనా మన జన్మ నక్షత్రానికి సరిపోయే నక్షత్రమును మాత్రమే తీసుకోవాలి. జన్మ నక్షత్రం నుండి ముహూర్త సమయానికి ఉన్న నక్షత్రం వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను 9 చే భాగహరించాలి. వచ్చిన శేషాన్ని బట్టి ఫలితం క్రింది విదంగా నిర్ణయించాలి.

1 వస్తే 'జన్మతార' అలా వరుసగా....

1) జన్మతార, 2) సంపత్తార, 3) విపత్తార, 4) క్షేమ తార, 5) ప్రత్యక్తార, 6) సాధన తార, 7) నైధన తార, 8) మిత్ర తార, 9) పరమమిత్ర తార.

ఇవేవో అశ్వని, భరణి, కృత్తికల వలే వేరే కొత్త తారలు అనుకోకండి. ఆ 27 నక్షత్రాలకే మన జన్మతారను బట్టి ఈ తొమ్మిది పేర్లు అన్వయించాలి. అంటే 'విద్యార్థి' అనే పేరు గల వ్యక్తి ఉన్నాడు. అతను ఒకరికి కొడుకు, ఒకరికి తమ్ముడు, ఒకరికి భర్త అవుతాడు. అలాగే అశ్వనీ నక్షత్రం ఒకరికి జన్మతార అయితే, మరొకరికి సంపత్తార (సంపదలు కలిగించే తార ) అవుతుంది. మరొకరికి విపత్తార (విపత్తులు కలిగించే తార) అవుతుంది. ఎవరికి ఏమవుతుంది అన్నది వారి జన్మనక్షత్రాన్ని బట్టి నిర్ణయించుకోవాలి.

పైవాటిలో సంపత్తార, క్షేమ తార, సాధన తార, మిత్ర తార, పరమమిత్ర తారలు (2,4,6,8, 9 తారలు) సకల శుభకార్యాలు చేసుకోవడానికి పనికి వస్తాయి. వృత్తి, వ్యాపార సంబంధమైన విషయాలు 'సంపత్తార' లోను, ప్రయాణాది కార్యాలు 'క్షేమతార' లోను, సాధించి తీరాలనుకునే కార్యాలు 'సాధనతార' లోను ప్రారంభించడం మరింత మంచిది.

జన్మతార కొన్ని శుభకార్యాలకు పనికొస్తుంది. కొన్నిటికి పనికి రాదు.

చెవులు కుట్టడం, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, ఉపనయనం, నిషేకం, యాగం, పట్టాభిషేకం, వ్యవసాయం, భూసంపాదన మొదలైన వాటికి జన్మతారను గ్రహించ వచ్చు.

ప్రయాణం, పెండ్లి, క్షౌరము, ఔషధ సేవనం, గర్భాదానం, శ్రార్థం, సీమంతం, పుంసవనము మొదలైనవి జన్మనక్షత్రంలో చేయరాదు.

ఉదాహరణ : రేవతి నక్షత్రం జన్మ నక్షత్రం అనుకుంటే, ముహూర్త నిర్ణయంరోజు పూర్వాభాద్ర నక్షత్రం ఉంది అనుకుంటే, రేవతికి పూర్వాభాద్ర సరిపోతుందో లేదో తెలుసుకోవాలి. అంటే రేవతి నుండి పూర్వాభాద్ర ఎన్నో నక్షత్రమో లెక్క పెట్టాలి. 26 వ నక్షత్రం అవుతుంది. దానిని తొమ్మితో భాగహరించగా శేషం 8 వస్తుంది. అంటే రేవతికి - పూర్వాభాద్ర ఎనిమిదో తార (మిత్ర తార) అవుతుంది. అంటే శుభం కనుక ముహూర్తము పనికొస్తుంది.
శేషం సున్నా వస్తే అది తొమ్మిదిగా గుర్తించాలి.

తప్పని సరి పరిస్థితులలో ముహూర్తనిర్ణయం చేయవలసి వస్తే .....

ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం

తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషువర్జయేత్ !

ప్రథమ నవకం లో ( 1 నుండి 9 తారలలో ) మొట్ట మొదటి తారను,
2 వ నవకం లో ( 10 నుండి 18 తారలలో ) మూడవ తారను,
3 వ నవకంలో( 19 నుండి 27 తారలలో ) పంచమ తారను,
ప్రతీ నవకంలో 7 వతారను ఎల్లప్పుడు వదిలి పెట్టవలెను.

అంటే జన్మనక్షత్రము లగాయతు 1, 7, 12, 16, 23 మరియు 25 నక్షత్రాలను ఎల్ల వేళలా శుభకార్యములలో వదిలిపెట్టాలి.

అంటే సాధారణంగా జన్మ నక్షత్రం నుండి 1,3,5,7,10,12,14,16,19,21,23 మరియు 25 నక్షత్రాలను శుభకార్యములలో వదిలిపెట్ట వలసి ఉన్నది. కానీ కావలసిన సమయము లోపల ముహూర్తములు కుదరని పక్షమున 1, 7, 12, 16, 23 మరియు 25 తారలు మాత్రం వదిలి మిగతావి రెండవ ఎంపికగా గ్రహించ వచ్చును.

## ద్వాదశ రాశుల లక్షణాలు వాటి వివరాలు

### *మేష రాశి లక్షణాలు*

రాశులవారీగా తీసుకుంటే ప్రథమ రాశి మేషం. ఈ రాశిని అగ్నితత్త్వంతో పోలుస్తారు. భగభగమండే తత్త్వంతో ఉండి, కోపాన్ని పౌరుషాన్ని ప్రదర్శిస్తారు. తోచిన విధంగా ప్రవర్తించడం వంటి లక్షణాలతో ఉంటారు. ఈ రాశికి కుజుడు అధిపతి. చర రాశి అయినందున స్థిరమైన ఆలోచన ఉండదు. చకచకా ఆలోచనలు, నిర్ణయాలు మారిపోతుంటాయి. ఎప్పటికప్పుడు కొత్త ఆలోచనలు పుట్టుకొస్తాయి. అగ్నితత్త్వం అయినందున ఆయా ఆలోచనలు వేగంగా రూపాంతరం చెందడం ఈ రాశివారిలో అత్యంత సహజం. నాయకత్వం వహించాలనే తపన, తొందరపాటుతనం కనిపిస్తాయి. తి చురుకుదనంతో నూతన పద్ధతులపై మనస్సు లగ్నం చేస్తారు. క్షత్రియ రాశి కూడా అయినందున పురుషాహంకారంతో శక్తిమంతుడుగా ఉంటారు. పట్టుదల, కార్యసాధన లక్షణం కలిగి ఉంటారు. దీనివల్ల మొండితనం అబ్బుతుంది. మాట నెగ్గించుకోవడంకోసం క్రూరత్వం వహించే అవకాశం ఉంది. మేష రాశిలో అశ్వని నాలుగు పాదాలు, భరణి నాలుగు పాదాలు, కృత్తిక మొదటి పాదం ఉంటాయి.

***వృషభ రాశి లక్షణాలు***

వృషభ రాశి స్థిరరాశి అయినందున స్థిరత్వాన్ని కోరుకుంటారు. ఆలోచనలు, నిర్ణయాలు పటిష్టంగా ఉంచుకుంటారు. అనుకొన్న దానిగురించే ఎక్కువ ఆలోచన చేసే లక్షణం కలిగి ఉంటారు. ఈ రాశికి శుక్రుడు అధిపతి.

ఈ రాశిలో కృత్తిక 2, 3, 4 పాదాలు, రోహిణి నాలుగు పాదాలు, మృగశిర నక్షత్రంలో తొలి రెండు పాదాలు ఉంటాయి.

***మిథున రాశి లక్షణాలు***

మిధున రాశి స్వభావరీత్యా స్వభావరాశి. చరరాశిలా వేగంగా గమిస్తూనే, స్థిర రాశి మాదిరి స్థిరత్వంవైపు మొగ్గుచుండును. ఈ రాశివారు చురుకుదనానికి పెట్టింది పేరు అనవచ్చు. దుష్ట గ్రహ దోషం ఉంటే తప్ప, వీరి చురుకుదనం, లౌక్యాన్ని ఆపలేం. సమాకార రూపంతో అన్ని స్థితులయందు సమభావం చూపుతారు. ప్రకృతి రాశి అగుటయే కాక వాయుతత్వాన్ని సూచించును. దీనివల్ల ఆలోచనలు వాయువేగంతో పరిభ్రమిస్తూ ఉంటాయి. చురుకుదనంతో కొత్త ఆలోచనల వైపు ఉరకలు వేయుట కద్దు. పంతాలకు తావివ్వకుండా సర్దుకొనే స్వభావం కలవారై ఉంటారు. అవకాశాలను సద్వినియోగ పరచుకుంటూ ముందుకు సాగడానికి ఇష్టపడతారు.

మిథున రాశిలో మృగశిర 3, 4 పాదాలు, ఆరుద్ర 1, 2, 3, 4 పాదాలు, పునర్వసు 1, 2, 3 పాదాలు ఉంటాయి.

***కర్కాటక రాశిలక్షణాలు***

కర్ణాటక రాశి - రాశి చక్రంలో నాలుగవది. లక్షణ రీత్యా ఇది చర రాశి. ఆలోచనలు వేగంగా మారిపోతుంటాయి. నిర్ణయాలు కూడా చకచకా మార్పు సంతరించు కొంటాయి. ఆందోళనలకు ఎక్కువ అవకాశం ఉంటుంది. సమస్య ఎదురైనప్పుడు విభిన్న రకాల విశ్లేషణలు ముందుకు వస్తాయి. వాటిద్వారా కొన్ని సార్లు సమస్యలు జటిలం కావచ్చును. సమస్య పెద్దదైనప్పుడు ముడుచుకుపోయే లక్షణం ఉంటుంది. ఆలోచనలకు, కార్యాచరణకు మధ్య ఉండే అంతరాన్ని గుర్తిస్తారు. ఈ రాశికి చంద్రుడు అధిపతి కావున మానసిక సంఘర్షణలు, మానసిక వేదన ఉంటుంది. తరచి తరచి ఆలోచించే గుణం ఉంటుంది.

కర్కాటక రాశిలో పునర్వసు నాలుగో పాదం, పుష్యమి 1, 2, 3, 4 పాదాలు, ఆశ్లేష 1, 2, 3, 4 పాదాలు ఉంటాయి.

***సింహ రాశి లక్షణాలు***

స్వభావ రీత్యా నాయకత్వాన్ని సూచిస్తుంది. జంతు సామ్రాజ్యానికి రాజు అయిన సింహం దీనికి సూచిక. అందుకే ఈ రాశిలో జన్మించినవారిలో సహజసిద్ధంగా నాయకత్వ లక్షణాలు ఉంటాయి. ఏ విషయంలో అయినా ముందడుగు వేసే తత్వం ఉంటుంది. కొత్త, పాతలతో నిమిత్తం లేకుండా చొరవ చూపించగలుగుతారు. ఆత్మాభిమానాన్ని కలిగి ఉంటారు. అభిమానాన్ని దెబ్బతీస్తే మాత్రం తట్టుకోలేరు. స్వయం నిర్ణయాధికారాన్ని కోరుకుంటారు. సమాజంలో తనకంటూ ఒక గుర్తింపు ఆశిస్తారు. ఏ వృత్తిలో ఉన్నా చాకచక్యం, సామర్థ్యం మేళవించి ముందుకు వెళ్లగలుగుతారు. లౌక్యాన్ని సైతం అలవరచుకొంటే అద్భుతాలు సాధించగలుగుతారు. లేదంటే మాత్రం ఇబ్బందులు తప్పవు. ముందుచూపుతో పాటు వెనుకచూపుకూడా అవసరం అని గుర్తుంచుకోవాలి. పొగడ్తలంటే ఇష్టపడతారు. ఇది బలం మాత్రమేకాదు, బలహీనత అనికూడా అనుకోవచ్చు.

లక్షణరీత్యా ఇది స్థిరరాశి. తీసుకొన్న నిర్ణయాన్ని స్థిరంగా అమలు పరచాలని కోరుకుంటారు. నాయకుడిగా తన స్థానాన్ని పదిలపరచుకోవాలంటే ఇది అవసరం అని భావిస్తారు. నిర్ణయాలకు ఆమోదం లభించాలని ఉవ్విళ్లూరుతుంటారు. దీనికోసం కొన్నిసార్లు మొండిపట్టు పడతారు. ఈ లక్షణం కొన్ని సమయాల్లో ఇబ్బందులు తెచ్చిపెడుతుంది. లోపాన్ని గుర్తించినప్పుడు బయటపడాల్సి వస్తుంది.దీనిన్న జాగ్రత్తగా పరికించుకోవాలి. పురుష స్వభావం ఉన్న రాశి కావటంతో ఏ విషయం అయినా

ముఖతః ఉండాలనుకొంటారు. జీవితంలో వెలుగు ఆశించే తత్వం. నాయకత్వంకోసం కష్టపడటానికి అయినా సిద్ధంగా ఉంటారు. శ్రమకు ఓరుస్తారు. సర్దుబాటు తత్వం కాస్త తక్కువ అనుకోవచ్చు. లక్ష్యాన్ని నిర్దేశించుకుంటే మాత్రం అది నెరవేర్చుకొనేందుకు ప్రాధాన్యం ఇస్తారు. దీర్ఘకాలికంగా పనిచేయడానికి సైతం ఇష్టపడతారు. కుటుంబ సంబంధాలకు ప్రాధాన్యం ఉంటుంది. కానీ గుర్తింపుకు పెద్ద పీట వేస్తారు. నలుగురు తన గురించి ఏమనుకొంటారో అన్న అంశాన్ని బాగా దృష్టిలో పెట్టుకుంటారు. చైతన్యవంతమైన రాశి కావటంతో ఉత్సాహంగా ఉంటారు. దూసుకెళ్లే సమయంలో చిన్న విమర్శ ఎదురైనా మనసులో పెట్టుకుంటారు.
సింహ రాశిలో మఖ నక్షత్రం నాలుగు పాదాలు, పుబ్బ నాలుగు పాదాలు, ఉత్తర మొదటి పాదం ఇందులో ఉంటాయి.

**<u>*కన్యారాశి లక్షణాలు*</u>**

కన్యా రాశి స్వభావరీత్యా 'ద్వి స్వభావ రాశి'. అందుచేత రెండువైపులా ఆలోచిస్తుంటారు. ఏ విషయంలో అయినా లోతుగా పరిశీలిస్తుంటారు. అభిప్రాయాలను మార్చుకుంటూ ఉంటారు. విభిన్నమైన అంశాల్ని పరికిస్తూ ఉంటారు. ఆలోచనకు అనుగుణంగా వ్యాఖ్యానిస్తూ ఉంటారు. అంత తేలిగ్గా దేనినీ వదలరు. ప్రతిదాన్నీ ఒకటికి రెండుసార్లు తర్కిస్తారు. అనుమానించడంకూడా కన్యారాశివారికి సహజ సిద్ధమైన లక్షణం. ఏ విషయంలోనైనా విచక్షణ ఉపయోగిస్తూ ఉంటారు. కానీ ఈ ఆలోచనలు అనుమానాల్ని మాత్రం పైకి రానీయరు. చాలావరకు మనసులోనే గణించుకుంటూ ఉంటారు. స్త్రీలయితే తేలిగ్గా కన్నీళ్లు పెట్టుకుంటారు. ఆవేశానికి, ఉక్రోషానికి లోనవుతూ ఉంటారు. ఈ రాశివారికి ధైర్యం పాలు కాస్త తక్కువ. ఆహారం మీద ఆసక్తి ఉంటుంది. ఇష్టాయిష్టాలకు ప్రాధాన్యం ఇస్తుంటారు. శారీరక అవసరాలు, కుటుంబ ప్రాధాన్యతలకు పెద్దపీట వేస్తారు. భౌతిక విషయాలమీద దృష్టి పెడతారు. పని ప్రారంభించే ముందు పదే పదే ఆలోచిస్తారు. పని మొదలెట్టాక మాత్రం పట్టువిడువకుండా పూర్తి చేస్తారు. సహనంతో వ్యవహరిస్తూ ఉంటారు. ముందు జాగ్రత్త ఉంటుంది. కొన్ని సార్లు అతి జాగ్రత్త కూడా ఉంటుంది. స్త్రీ రాశి కావడంతో మానసిక భావనలకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. దూకుడు తక్కువగా ఉన్ననూ, ఫలితం ప్రాధానంగా ఉంటుంది. లక్ష్యం మీద ఏకాగ్రచిత్తం నిలుపుతారు. దృష్టిని మరల్చకుండా కార్యసాధనకు ప్రాధాన్యమిస్తారు. ఈ రాశికి బుధుడు అధిపతి.

కన్యారాశిలో ఉత్తర నక్షత్రంలోని 2, 3, 4 పాదాలు, హస్త నక్షత్రపు మొత్తం నాలుగుపాదాలు, చిత్త నక్షత్రప 1,2 పాదాలు.

**<u>*తులా రాశి లక్షణాలు*</u>**

తులారాశి వారు జీవితాన్ని పోటీగా తీసుకుంటారు. జీవితములో ప్రారంభములో ఎదురైన అపజయాలకు క్రుంగి పోక ఉపాయముతో లక్ష్య సాధన కొరకు కృషి చేసి ముందుకు సాగుతారు. తమ ఆలోచనను బయటకు చెప్పరు. ఇతరుల కుయుక్తులకు లొంగరు. ఎత్తులకు పై ఎత్తులు వేయడములో నేర్పు కలిగి ఉంటారు. మేధావులుగా గుర్తింపు పొందుతారు. అత్యున్నత స్థానాలను అధిరోహిస్తారు. ప్రజాకర్షణ అధికముగా ఉంటుంది. ప్రజల అభిమానానికి సంబంధించిన వృత్తి, ఉద్యోగ, వ్యాపార, వ్యాపకాలలొ రాణిస్తారు. ఆర్థిక క్రమశిక్షణ బాగా పాటిస్తారు. స్థిరాస్థులని అభివృద్ధి చెస్తారు. అనువంశికముగా వచ్చిన వ్యాపారాలను మార్పు చేసి అభివృద్ధి చేస్తారు. అలంకార ప్రియులు. ఇతరుల అభిరుచిని త్వరగా తెలుసుకోగలరు. కళా, సాహిత్య, రాజకీయ రంగాలలో రాణిస్తారు. యవ్వన ప్రాయములో అదృష్టము కలసి వస్తుంది. జీవితములొ అనేక సుఖాలు అనుభవిస్తారు. తరతరాలకు ఆదర్శంగా నిలుస్తారు. బంధు వర్గముతొ విబేధాలు దీర్గ కాలము కొనసాగుతాయి. ఏ విషయములో రాజీ లేకుండా శ్రమిస్తారు. కూతురుకి మాత్రము అన్ని విషయాలలొ మినహాయింపు ఉంటుంది. వ్యక్తిగత

సామర్థ్యాన్ని ఎప్పటికప్పుడు అభివృద్ధి చెసుకుంటూనే ఉంటారు. ఒక స్థాయికి వచ్చినా పాత పద్దతులు పొవు. ఆత్మీయులతో విబెధాలు వస్తాయి. గతము మరిచారన్న విమర్శను ఎదుర్కొంటారు. విదేశీయానము లాభిస్తుంది. సాంకేతిక విద్యలో రాణిస్తారు. మంచి మార్గదర్శకత్వ ప్రతిభ ఉంటుంది

తుల రాశిలో చిత్త నక్షత్రం 3, 4 పాదాలు, స్వాతి నక్షత్రం నాలుగు పాదాలు, విశాఖ నక్షత్రంలోని 1, 2, 3 పాదాలు ఉంటాయి.

***వృశ్చిక రాశి లక్షణాలు***

లక్షణ రీత్యా వృశ్చిక రాశి స్థిరమైనది. ఆలోచనలు, అంచనాలు, నిర్ణయాలు కచ్చితంగా ఉంటాయి. ఊగిసలాట ధోరణి పెద్దగా కన్పించదు. దీర్ఘకాలిక అంచనాలు, దూరం ఆలోచించే తత్వం ఉంటాయి. ఆ సమయానికి ఏది అవసరం అనే దానిపై నిర్ణయాలు జరిగిపోతాయి. తత్వం రీత్యా జల స్వభావం అయినందున బయటపడకుండా పనులు చక్కబెట్టుకుంటారు. గుంభనంగా వ్యవహారాలు చక్కబెడతారు. జరిగిపోయినవి, జరగాల్సినవి అన్న స్పష్టత ఉంటుంది. ఏ అంశాల ఆధారంగా అంచనా వేస్తున్నదీ మాత్రం బయటపెట్టబోరు.

వృశ్చిక రాశిలో విశాఖ నాలుగో పాదం, అనూరాధ 4 పాదాలు, జ్యేష్ట 4 పాదాల్లో జన్మించిన జాతకులు ఉంటారు.

***ధనుర్ రాశి లక్షణాలు***

రాశి చక్రంలో  తొమ్మిదో రాశి ధనురాశి. స్వభావరీత్యా ఇది ద్వి స్వభావ రాశి. కొన్నిసార్లు వేగంగానూ, మరికొన్నిసార్లు నిదానంగానూ స్పందించే లక్షణం ఉంటుంది. నిర్ణయాల విషయంలోకూడా ఇదే వైఖరి కనిపిస్తుంది. స్థిమితమైన ధోరణి తక్కువగా ఉంటుంది.

ధనూ రాశిలో మూల నక్షత్రం 4 పాదాలు, పూర్వాషాఢ 4  పాదాలు, ఉత్తరాషాఢ మొదటి పాదం ఉంటాయి.

***మకరరాశి లక్షణాలు***

మకరరాశి కాలపురుషుని కర్మ స్థానము. సూర్యుడు ఈ రాశి లో ప్రవేశించినప్పుటి నుండి ఉత్తరాయణ పుణ్యకాలము ఆరంభమౌతుంది. వెంఖటేస్వరస్వామి వారి జన్మ నక్షత్రమైన శ్రవణము ఈ రాశిలోనిదే. ఈ రాశి వారు జీవితములో ఎదురయ్యే సంఘటనల కారణంగా అపార అనుభవాన్ని స్వంతము చేసుకుంటారు. ఇతరులు మొసము చెయ్యనంత వరకు ఇతరులను మోసము చెయాలన్న తలంపు రాదు. వీరికి బంధుప్రీతి ఎక్కువ. స్నేహితుల ఎడల అవ్యాజమైన ప్రేమ పెంచుకోవడము వీరి స్వభావము బలహీనత కూడా. పక్కవాళ మాట విని వాస్తవాలు తెలుసుకోకుండా నిర్ణయాలు తీసుకుంటారు. ఇది విమర్శలకు దారి తీస్తుంది. తన లొపము తెలిసిన తరువాత తమ తప్పును అంగీకరించడానికి వెనుకాడరు. చేసిన పొరపాటు తిరిగి చెయ్యరు. అందరినీ సమానంగా ప్రేమభావంతో చూస్తారు. ద్వేషించే వారిని ప్రేమించే వారిని సమానంగా చూస్తారు కనుక వ్యక్తిగత ప్రయోజనాలు దెబ్బతింటాయి. అయినా పద్ధతి మార్చుకోరు. సాత్విక స్వభావము మాత మిద నిలబడే తత్వము ఉంటాయి. స్త్రీ సంతానము పట్ల అభిమానము అధికముగా ఉంటుంది. సంతానము వీరి అభీష్టము ప్రకారము నడవక వీరిని ఇబ్బందులకు గురి చేస్తారు. నైతిక బాధ్యతలకు ఎక్కువగా ప్రాధాన్యత ఇస్తారు. నమ్మిన వారి కొరకు అధికముగా ప్రమిస్తారు. చిన్నతనము నుండి అధికముగా శ్రమపది చిన్నతనములోనే అధికముగా శ్రమించి అవి సాధించడానికి కృషిచేస్తారు. అనుకున్న దానిని ఎదొ ఒక విధంగా సాధిస్తారు. పట్టుదల, అంతర్గత ప్రతీకార వాంఛ, పోటీతత్వము అధికముగా ఉంటుంది. అధికమైన జ్ఞాపక సక్తి, సాధారణమైన ఆకారము కలవారై ఉంటారు. రచనా వ్యాసఘ్గము, పరిశోధనా, నతన, కళాఅ సంబంధమైన నైపుణ్యము విశేషముగా ఉంటుంది. వీరు చేసే పనులకు

సమానంగా ఇతరులు అనుసరించ లేరు. విరి మేధస్సు, శ్రమ ఇతరుల చేత దోచుకొనబడుతుంది. విరి ప్రతిభ వెలుగులోకి రావడము కష్టము. ధన సంపాదనే ధ్యేయముగా జీవించరు. ఎదో విధముగా ధనము సర్ధుబాటు అయి అవసరాలు గడిచి పోతాయి. అభిమానించే నమ్మిన అనుచర వర్గము వెంట ఉంటారు. కులమత వర్గాలకు అతీతంగా జీవిస్తారు. స్త్రీల వలన అదృష్టము కలసి వస్తుంది. జీవిత భాగస్వామితో చిన్న చిన్న కలతలు ఉన్నా పెద్ద ఇబ్బందులు ఉండవు. చాలా మందికి తండ్రి వలన మేలు జరగదు. ప్రజాభిమానముతో ఉన్నత స్థితికి చేరుకుంటారు. వీరికి దైవానుగ్రహము అధికముగా ఉంటుంది. బంధువర్గము కంటే బయటి వారి సహాయము అధికముగా అందుతుంది. అంచనాలు చక్కగా పొరబాట్లు లేకుండా వేస్తారు. ఊహలు నిజము ఔతాయి.శని, శుక్ర, బుధదశలు యోగిస్తాయి. ఆధ్యతమక విషయాలలో అంకితభావము తో ఉంటారు. సామాజిక సేవ, సామాజిక న్యాయము దైవముగా భావిస్తారు. జివిత మధ్యకాలములో మోకాల్ల నొప్పులు, కీళ్ళ నొప్పులు వంటివి వస్తాయి.

***కుంభ రాశి లక్షణాలు***

కుంభరాశిలో జన్మించిన వారికి బంధాలు అనుభంధాలు ఎక్కువ. మేలు చెసిన వ్యక్తులను గుర్తుంచుకుంటాఆరు. కొత్త వారు ఎందరు పరిచయము అయినా పాత స్నెహాలను, బంధుత్వాలను మరువరు. ఇంటి భోజనము అంటేనే అత్యంత ప్రీతి కలిగి ఉంటారు. అలవాట్లను మార్చుకుని క్రమశిక్షణతో నుతన విజయాల కొరకు ప్రయత్నిస్తారు. కాని ఎక్కువ కాలము క్రమశిక్షన నిలవని పరిస్థితులు ఎదురౌతాయి. అవేశము, ఇతరులు రెచ్చగొదితే రెచ్చి పోయె స్వభావము ఇబ్బందికర పరిస్థితులకు దారి తీస్తాయి. తమ బాధను బాధ్యతను ఇతరులకు వినిపించరు. బధను అధికముగా మనసులో దాచుకుంటారు. ఉన్న విషయాన్ని నిర్మొహమాతముగా చెప్పడము వలన విరోధాలు వస్తాయి. ఈ విధానాన్ని మార్చుకోవడనికి ప్రయత్నించి విఫలము ఔతారు. మధ్యవర్తిత్వానికి ముందు నిలుస్తారు. ఇతరులకు హామీ ఉండి చిక్కులు కొని తెచ్చుకుంటారు. సాంకెతిక విద్య, వైద్య విద్యలలో రాణిస్తారు. ప్రజా సంబంధాలు, చిత్రవిచిత్ర వ్యాపారాలు అనుభవము నెర్పు కలిగి ఉంటారు. కుటుంబ విషయాలు ఒడిదుడుకులకు లోనైనా సర్దుకుంటాయి. అవసర సమయాలలో ధనము లభించక పోయినా అవసరము లెనప్పుదు ధనము అధికముగా లభిస్తుంది. బంధువులు, ఆత్మీయ వర్గము అవసరాలకు ధనము సర్ధుబాటు చేసి ఉన్నతికి తోడ్పడతారు. సమాజములో ఉన్నత స్థానాలలో , గౌరవ స్థానాలలో ఉన్న వారి వలన అన్యాయానికి గురి ఔతారు. ఇతరుల పక్షపాత బుద్ధికి నష్టపోతారు. అకస్మాత్తుగా రాజకీయాధికారము చేకూరుతుంది. శుక్ర, శని, బుధ మహర్దశలు యోగిస్తాయి. ఏకపక్షముగా పొరబాటుగా తిసుకున్న నిర్నయాల వలన ఇబ్బందులు కలుగుతాయి. చర్చించి తీసుకున్న నిర్ణయాలు మేలు చెస్తాయి. సమాజములో పేరు లేని వారిని గౌరవించి విమర్శలకు గురి ఔతారు. తన సంతానము, ఆత్మీయులు, స్వంత వారు చెసే తప్పులు తప్పులుగా కనిపించవు. వారిని సమర్ధించడానికి రక్షించడానికి అధికముగా ధనమును పలుకుబడిని ఉపయోగిస్తారు. వ్యాపారములో అంచనాలు నిజమై లాభము పేరు వస్తాయి. సక్రమంగా సాగుతున్న వ్యవహారాలలో నూతన ప్రయోగాలు చేసి ఇబ్బందులకు గురి ఔతారు. భుములు విలువ పెరగడము వలన ధనవంతులు ఔతారు. వ్యాపారకూడలిని అద్దెకు ఇచ్చి అదృష్టాన్ని జారవిడుచుకుంటారు. సంతానము అదృష్టము వలన మంచి స్థితికి చేరుకుంటారు. స్త్రీ సంతానము పట్ల అభిమానము అధికము. జీవిత ప్రారమ్భములో తెలిసి తెలియక చెసిన నిర్ణయాలు మంచికి దారి తిస్తాయి. వీరు అందలము ఎక్కించి బలోపేతము చేసిన అసమర్ధులైన చిన్నపాటి వ్యక్తులే విరికి ప్రత్యర్ధులు ఔతారు. పోటీ లేని చోట్ల కూడా వీరి మమ్చితనము వలన పోటీదారులను కొని తెచ్చుకుంటారు. ఇతరుల ఎత్తులను తేలికగా చిత్తు చేయగలరు. అయినా స్వయంకృతాపరాధాన్ని సరి దిద్దుకోలేరు. మీరు కొల్పోయిన ధనము, పదవి ఇతరులు మీ కారణంగానే పొందారని పేరు వస్తుంది. భాగస్వామ్యము కొంత కాలమే లాభిస్తుంది. హస్తవాసి మంచిదని పేరు వస్తుంది.సొదర సోదరీ వర్గానికి సహాయము

చేయడము వలన మరో వర్గము దూరము ఔతారు. పైస్థాయి మరియు కిమ్దస్థాయి వారి వలన ఏకకాలములో ఇబ్బందులు ఎదురౌతాయి. ఋణల విషయములో అసత్య ప్రచారాలు ఎదురౌతాయి. కోర్టు వ్యవహారాలలో అపజయము ఎదురౌతుంది. ఆత్మీయ వర్గము ద్రోహము చెస్తే తప్ప ఏ విషయమునకు లోటు ఉండదు. ఆధ్యాత్మికంగా, వృత్తి ఉద్యోగాల పరంగా అనేక రంగాలలో అనుభవము గడిస్తారు. ఎదుటి వారి మనస్తత్వము తేలికగా గ్రహిస్తారు. విరి కంటే వెనుక వచ్చిన వారు వీరిని అధిగమించి ముందుకు సాగినా దీర్గకాలములో వారిని వీరు అధిగమించగలరు. పెద్దలు ఇచ్చిన స్థిరాస్థులు పోగొట్టుకున్నా స్వశక్తితో తిరిగి సాధించుకుంటారు. శత్రు వర్గము మీద విజయము సాధిస్తారు వారి వలన కలిగిన ఇబ్బందులను ఎదుర్కొంటారు. పరాయి వారి వలన ఇబ్బందులురాకుండా జాగ్రత్త వహిస్తారు. అయిన వారి వలన ఇబ్బందులు ఎదుర్కొంటారు. పడమర, దక్షిణం, ఉత్తర దిశలు యోగిస్తాయి. వీరికి ఏదిక్కూ దోషమైనది కాదు. కుబేర కంకణ ధారణ, కాలభైరవ స్తోత్ర పారాయణము మేలు చేస్తుంది. అదృష్టానికి దగ్గరగా జీవితము నడుస్తుంది.

<u>*మీన రాశి లక్షణాలు*</u>

మీన రాశిలో జన్మించిన వారు ప్రశాంత మనస్కులై ఉంటారు. కోపము త్వరగా రాదు.లా కొపము వాచ్చినప్పుడు అది విపరీతముగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాలు స్వయంగా ఏర్పరచుకోగల సామర్ధ్యము ఉంటుంది. స్థిరత్వము కొరకు కష్టపడతారు. వృత్తి ఉద్యోగాలలో ఒడిదుడుకులు తరచుగా వస్తూంటాయి. ఆదరించి అండగా నిలిచేవారు ఉంటారు. ఎన్ని సమస్యలు ఉన్నా ప్రశాంతంగా నిద్రిస్తారు.ఎక్కువగా నీళ్ళు తాగుతుంటారు. స్థానాభిలాష కలిగి ఉంటారు. ఉన్నత స్థానాలలో బంధువులు కలిగి ఉంటారు. వారి సహాయసహకారాలు నామ మాత్రముగా ఉన్నా బాధ్యతలు ఎక్కువగా ఉంటాయి. విద్యారంగలో సాధన ఆరోగ్యము మీద ఆధార పడి ఉంటుంది. కళా సాహిత్య రంగాలలో మంచి ఆసక్తి నిపుణత ఉంటుంది. వంశ పారంపర్యముగా సంక్రమించిన ఆస్తులను సామర్ధ్యంగా వృద్ధి చేస్తారు. కాని ఆస్తులు దక్కడం అనుమానాస్పదం. బంధువర్గమ్ తండ్రిని మోసగించి నష్టపరుస్తారు. వ్యక్తిగత సంపాదనకు జీవిత భాగస్వామి అదృష్టం తోడై మంచితనముతో ఆస్తులు ధనం సంపాదిస్తారు. మంచి ఆశయము కొరకు, మంచి వారి సాంగత్యం కొరకు భాగస్వామ్యం కొరకు ఎదురు చూస్తారు. ఇలాంటి ప్రయత్నాలు ఫలించి ఐకమత్యముతో మంచి ఫలితాలు సాధించే సమయములో విబేధాలు సత్ప్రవర్తన లేని వ్యక్తుల వలన విఘాతము కలుగుతుంది. ఆచార వ్యవహారాలు, తత్వ, వేదాంత, జ్యోతిష, హోమియోపతి, గణితం మొదలైన వాటిలో ప్రావీణ్యత కలిగి ఉంటారు. వీరికిగల సంగీతాభిమాం, క్రీడాభిమానం జీవితములో మంచి మలుపుకు దారి తీఇస్తాయి. ఇతరుల మాయమాటల ప్రభావం చాలా కాలం వీరి మీద ప్రభావం చూపిస్తుంది. తమకంటూ స్వంత విధానం అవసరమని నిదానంగా గ్రహిస్తారు. వంశ గౌరవం, మంచితనం చాలా వరకు ఆదుకుంటుంది. ఎవరో అద్భుతాలు సాధించి ఉద్ధరిస్తారని చాలా కాలం విశ్వసిస్తారు. అవి ఫలించక చివరకు వీరే కష్టపడి సాధిస్తారు. సామర్ధ్యం లేని మనుష్యులను ప్రోత్సహించడం ద్వారా సమయము శ్రమ వృధా ఔతాయి. అన్యభాషలకు సంబంధించిన విషయాలు, విదేశీ వ్యవహారాలు కలసి వస్తాయి. ఎవరిని ఏపనికి నియమించాలో బేరీజు వేయడములో చాలా వరకు పొరబాటు పడతారు. ధనవంతులైన స్నేహితులు ఆదుకూంటారు. సభానిర్వహణ, సాంస్కృతిక కార్య నిర్వహణలో సామర్ధ్యము కలిగి ఉంటారు. సహజత్వానికి దగ్గరగా గదపాలన్న మీ ఆశయము నెరవేరుతుంది. ప్రచారసాధనలు, మీడియతో జీవితంలో ముఖ్య విషయాలు ముడిపడి ఉంటాయి. స్వంతవారు, బంధువర్గం లెక కులానికి చెందిన ఒక వ్యక్తి వలన అనేక సమస్యలను ఎదుర్కొంటారు. మనుష్యుల మనోభావాలను చదువగలరు. సంతానం మంచి స్థాయిని సాధిస్తారు. గురు, శుక్ర, సని దశలు బాగా యోగిస్తాయి. ప్రకృతికి సహజత్వానికి సమీపముగా జీవితం గడపాలన్న మీ ఆశ నెరవేరుతుంది. ధనం లేక పోయినా దర్జాగా విలాసవంతమైన జీవితం గడుపుతారు. వీరితో ఉన్న అవసరాల వలన బంధువులు,స్నేహితులు దగ్గరైనా అవసరాలు తీరిన తరువాత కూడా

సంబంధాలు కొనసాగుతాయి. ఆర్థిక ప్రయోజనాలు, ఆశించిన గుర్తింపు రావడం కష్టమే. రావలసిన ప్రయోజనాలు ఏదో కారణం వలన నిలిచి పోతాయి. అర్ధిక స్థిరత్వం పోరాటం వలన కొన్ని ప్రయోజనాలు సాధించు కూంటారు. ముఖ్యవిషయాల మీద దృష్టి సారించడం అధికమైన ఆస లెక పొవడం వలన మానసిక ప్రశాంతత విజయము లభిస్తుంది. వివాద రహితమైన జీవితం కావాలని అనుకుంటారు. కాని స్వంత వారి వలన గొడవలు, ఇతరులతో మనస్పర్ధలు ఏర్పడతాయి. విజయానికి దైవానుగ్రహమే కారణమని విశ్వసిస్తారు. సుదర్శన కవచ పారాయణ, విష్ణు సహస్రనామ పారాయన మెలు చేస్తుంది. సువర్ణాభరణాలు తనఖా పెట్టడం అనర్ధమౌతుంది. భద్రత విషయంలో జాగ్రత్త వహించాలి. ఆలస్యముగా అయినా అదృష్టం వరిస్తుంది.

## అదృష్ట సంఖ్యలు - మంచి రోజులు

మానవుడికి కలిసి వచ్చే సంఖ్యలు కూడా ఉంటాయి. వివిధ రాశుల్లో జన్మించిన జాతకులు అదృష్ట సంఖ్యలు, మంచి రోజులను బట్టి కార్యాచరణ చేయడం ఉత్తమమని జ్యోతిష్యశాస్త్రం చెబుతోంది. అదృష్ట సంఖ్యల్లో వాహనాలు కొనడం, రాశికి అనుగుణమైన రోజున శుభకార్యాన్ని మొదలు పెట్టడం వల్ల శుభ ఫలితాలు చేకూరుతాయి.

సంఖ్యా జ్యోతిష శాస్త్రములో ఫలితములు తెలుసుకొనుట రెండు విధములు. అందులో ఒకటి.. వారివారి జన్మ తేదీని బట్టి ఫలితములు తెలుసుకొనుట. రెండవది జన్మ తేదీ లేకపోతే వారి పేరులోని అక్షరముల సంఖ్యల ప్రకారం తెలుసుకోవడం.

సంఖ్యలకు గ్రహాల నిర్ణయం

1 రవి 4 రాహువు 7 కేతువు 2 చంద్రుడు 5 బుధుడు 8 శని 3 గురుడు 6 శుక్రుడు 9 కుజ

ఇంగ్లీషు అక్షరములకు అంకెలు

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z
1 2 3 4 9 8 7 6 5 1 1 2 3 5 7 8 1 2 3 4 6 6 6 5 1 7
దీనిని బట్టి ప్రతివారి పేర్లు ఫలితాలను, మిగిలిన విషయములో సులభంగా తెలిసుకొవచ్చు. ఏ సంఖ్యకు ఏ గ్రహమో తెలుసుకోవాలి. వాటి కారకత్వమును కూడా తెలిసికొనుట యుక్తము.

ఉదా: RAJU

2116

2+1+1+6=10, (1+0) = 1 (అంటే రాజు అనే వ్యక్తికి 1 వస్తుంది. 1వ సంఖ్య వారు 1 సంఖ్య అధిపతి రవి. ఏ మాసములోనైనా 1, 10, 19, 28 తేదీలలో జన్మించినచో జన్మ సంఖ్య 1 అగును. వీరికి ఒకటి అదృష్ట సంఖ్య అగును. ఆది, సోమవారములు అదృష్ట రోజులు అవి.. 1, 10, 19, 28 తేది అయినచో విశేష అదృష్ట దినములగును. వీరికి 2, 4, 7 సంఖ్యలు తేదీలు అదృష్ట రోజులు. వీరికి ఏక సంఖ్య 2, 4, 7, ఇంకా.. 11, 13, 16, 20, 22, 25, 29, 31 తేదీలు ఇంకా.. ఆ సంఖ్యలు గలవి అనుకూలములైనవి అగును. వీరు కెంపును ధరించాలి. 2వ సంఖ్య వారు ఏ మాసంలో నైనను 2,11,20, 29 తేదీలలో జన్మించిన వారికి అదృష్ట సంఖ్య 2 అగును. అధిపతి చంద్రుడు. వీరికి 1, 4, 7 తేదీలు. ఇంకా రెండు అంకెలు సంఖ్యలు వచ్చు 10, 13, 16, 22, 25, 31 తేదీలు ఆ సంఖ్యలు కూడా అనుకూలమైనవి.

వీరికి ఆది, సోమ, శుక్రవారములు అనుకూలమైనవి. ఆ వారములు 2, 11 20, 29 అయినచో విశేష అదృష్టము. వీరు ముత్యము ధరించాలి. 3వ సంఖ్య వారు ఏ మాసములో నైనను 3, 12, 21 30 తేదీలలో జన్మించినచో అదృష్ట సంఖ్య 3

అగును. వీరికి 3,6,9 తేదీలు ఆ సంఖ్యగల వాహనములు, లాటరీ టిక్కట్లు అనుకూల ఫలితాలనిస్తాయి. వీరికి మంగళ, గురు, శుక్రవారములు అనుకూలమైనవి. ఆ వారములు 3, 12, 21, 30 తేదీలు అయితే ఇంకాను విశేష అదృష్ట ప్రదములైనవి. ఆసంఖ్యకు అధిపతి గురుడు. 6, 9, 15, 18, 24, 27 తేదీలు మరియు ఆ సంఖ్యలు కూడా అనుకూలమైనవి. మీరు కనకపుష్యరాగము ధరించాలి. 4వ సంఖ్య వారు ఈ సంఖ్యకు అధిపతి రాహువు. ఏ మాసములోనైనను 4, 13, 22, 31 తేదీలలో జన్మించిన వారికి జన్మసంఖ్య అనగా.. అదృష్ట సంఖ్య 4 అవుతుంది. వీరికి సోమ, ఆది, శనివారములు అనుకూలము. ఆ వారములు 4, 13, 22, 31 తేది అయితే ఇంకను విశేష శుభ ప్రదములు. వీరికి 1, 2, 7, 10, 11, 16,19, 20, 25, 28, 29 తేదీలు కూడా శుభప్రదములు.

వీరికి 1,2,7,10,11,16,19,20,25,28,29 తేదీలు కూడా అనుకూలమైనవి. వీరు ఉంగరములో గోమేధికము అనే రత్నము ధరించాలి. 5వ సంఖ్య వారు ఏ మాసంలోనైనను 5, 14, 23 తేదీలలో జన్మించిన వారి అదృష్ట సంఖ్య 5 అగును. ఈ సంఖ్యకు అధిపతి బుధుడు. వీరికి బుధ, శుక్రవారములు అదృష్ట రోజులు. ఆది, బుధ, శుక్రవారములు 5, 14, 23 తేదిలు అయినచో ఆ రోజుల విశేష అదృష్ట దినములగును. వీరు ఉంగరములో పచ్చ ధరించడం మంచిది. ఈ అంకెలు గల లాటరీ టిక్కెట్లు బుధ, శుక్రవారములలో కొనుట మంచిది.

6వ సంఖ్య వారు ఏ మాసములో నైనను 6, 15, 24 తేదీలలో జన్మించిన వారికి అదృష్టసంఖ్య 6 అగును. ఈ సంఖ్యకు అధిపతి శుక్రుడు. వీరు యితరుల అభిమానమును సులభముగా పొందగలరు. వీరు నలుపురంగు వస్త్రములు ధరించుట మంచిదికాదు. మంగళ, గురు, శుక్రవారములు అయినప్పుడు అట్టి తేదీలు గల దినములు విశేష అదృష్ట దినములగును. వీరు వజ్రం ధరించడం మంచిది.

7వ సంఖ్యవారు ఏ మాసంలోనైనను 7, 16, 25 తేదీలలో జన్మించిన వారికి జన్మ సంఖ్య 7 అగును. ఈ సంఖ్యకు అధిపతి కేతువు. ఈ సంఖ్య గల వారికి 2వ సంఖ్య గల వారితో సర్వవిషయములందును పొత్తుగా కుదురును. వీరికి ఆదివారము, సోమవారము 7, 16, 25, 29 తేదీలతో కూడి ఉన్నచో వ్యాపారము చేసి ధన సంపాదన చేయడంలో శక్తి యుక్తుల గలవారై ఉంటారు. వీరికి 1, 2, 4, 10, 11, 13, 19, 22, 28, 29, 31 తేదీలు సామాన్యంగా ఉండును వీరు ఉంగరములలో వైఢూర్యం ధరించడం మంచిది.

8వ సంఖ్య వారు ఏ మాసంలోనైనను 8, 17, 26 తేదీలలో జన్మించినవారి అదృష్ట సంఖ్య 8 అగును. దీనికి అధిపతి శని అందువల్ల ఉంగరములో ఇంద్రనీలం అనే రాయి ధరించుట శుభకరం. అదృష్ట తేదీలు 8, 17, 26. వీరికి శనివారము, సోమవారము, ఆదివారము కూడా అనుకూలమైన దినములు. వీరు ఏ కార్యమునైననూ 8, 17, 26 తేదీలలో ప్రారంభించడం మంచిది. నూతన వ్యాపారము కూడా ఈ తేదీలలో ప్రారంభించుట మంచిది.8, 17, 26 తేదీలు అదృష్ట సంఖ్యలు 9వ సంఖ్య వారు ఏ మాసంలోనైనను 9, 18, 27 తేదీలలో జన్మించిన వారికి అదృష్ట సంఖ్య 9 అగును. దీనికి అధిపతి కుజుడు. వీరు కుజ వ్యక్తులు. వీరు తరచుగా సైనికులుగా వ్యవహరిస్తారు. జీవితంలో 30సంవత్సరాల వయస్సు వచ్చే వరకు కష్టములుగయున్నను. తరువాత స్వయంకృషితో ఉన్నతస్థాయికి చేరుకొంటారు. వీరికి మంగళ, గురు, శుక్రవారములు 3, 6, 12,15, 18, 21, 24, 27, 30, తేదీలు అనుకూలము. వీరు ఉంగరములో పగడం ధరించుట మంచిది. ఏ సంఖ్యనైనను 9తో గుణించగా వచ్చిన సంఖ్యలు గల అంకెలన్నింటిని కలుపగా మళ్లీ 9 వచ్చును. 12x9 = 108 మళ్లీ ఈ మూడు సంఖ్యలు కలిపి ఒక సంఖ్య చేస్తే 9 వచ్చును.

రాశులను బట్టి అదృష్ట సంఖ్యలు - శుభ దినాలు

మేషరాశి వారి అదృష్ట సంఖ్యలు 9, 1, 2, 3. ఆది, సోమ, గురు శుక్రవారాలు మంచి రోజులు. ఈ రోజుల్లో ఏ పనినైనా ప్రారంభించినా మంచి జరుగుతుందని జ్యోతిష్య శాస్త్రం చెబుతోంది.

వృషభరాశి వారి అదృష్ట సంఖ్యలు 6, 5, 8, 9. మంగళ, శుక్రవారాలు వీరికి మంచివి.

మిధునరాశి వారి అదృష్ట సంఖ్యలు 5, 1, 6, 7, 8. ఆది, శుక్ర, శని వారాలు వీరికి అదృష్టాన్నిచ్చే రోజులు.

కర్కాటక రాశి వారి అదృష్ట సంఖ్యలు 2 మాత్రమే. మంగళ, శుక్రవారములు మంచివి.

సింహరాశి వారి అదృష్ట సంఖ్యలు 1, 2, 3, 5, 9. ఆది, మంగళ, గురువారములు వీరికి అనుకూలం.

కన్యారాశి వారి అదృష్ట సంఖ్యలు 5, 1, 3, 4, 6. ఆది, శుక్ర, సోమ వారాల్లో శుభకార్యాలు తలపెట్టడం మంచిది.

తులారాశి వారి అదృష్ట సంఖ్యలు 6, 2, 7, 9. సోమ, శుక్ర, శని వారాలు వీరికి అనుకూలిస్తాయి.

వృశ్చికరాశి వారి అదృష్ట సంఖ్యలు 9, 1, 2, 3. ఆది, సోమ, గురు వారాలు యోగప్రదాలు.

ధనుస్సురాశి వారి అదృష్ట సంఖ్యలు 1, 2, 4, 5. ఆది, బుధ, గురు వారాలు వీరికి కలసివస్తాయి.

మకరరాశి వారి అదృష్ట సంఖ్యలు 8, 3, 4, 5, 9. సోమ, మంగళ, శుక్రవారములు మంచివి.

## జ్యోతిష్య సంబంధ ముఖ్య విషయములు

1. గృహసంభంధ విషయాలు

**గృహప్రవేశము :**

కాలామృతం ఆధారంగా వైశాఖంలో గృహప్రవేశం గృహపతికి బహుపుత్రంబు, జ్యేష్ఠమాసం శుభప్రదము. ఫాల్గుణమాసం సంపత్కరము, మాఘం ధాన్య ప్రదము. అయితే ఉత్తరాయంలో కుంభంలో రవి ఉండగా తప్పమిగిలిన అన్నియు శ్రేష్ఠములే. బహుగ్రంధకర్తలు కార్తీక, మార్గశిర, శ్రావన మాసములు శ్రేష్ఠములు అని తెలిపిరి.

**వారములు:**

ఆదివారము అత్యంత దుఃఖమును క్షీణేందువారము (బహుళసప్తమి తర్వాత సోమవారము) కలహమును, పూర్ణేందు వారము సంపదను, మంగళవారము అగ్నిభయమును, బుధవారము ధాన్యమును గురువారము పశుపుత్రులను, శుక్రవారము శుభసౌఖ్యములోను, శనివారము స్థైర్యమును, చోరభయమును కలుగచేయును.

**నక్షత్రములు :**

చిత్త, అనూరాధ, ధనిష్ఠ, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, రేవతి, శతభిషం, రోహిణి, మృగశిర, ఈ నక్షత్రములు ప్రశస్తమైనవి. పుష్యమి మధ్యమము. పునర్వసు, స్రవణం నక్షత్రములలో గృహప్రవేశమైన ఆ ఇల్లు అన్యాక్రాంతమగును. ఆర్ద్ర, కృత్తిక, అగ్నిభయమును కలుగచేయును.

**<u>లగ్నములు :</u>**

కర్కాటక లగ్నమునందు గృహప్రవేశము నాశనము, తులాలగ్నమునందు గృహప్రవేశమును వ్యాధిని, మకరలగ్నమునందు గృహప్రవేశమును ధాన్య నష్టము, మేషలగ్నము నందు చలనమును కలుగచేయును, వృషభ, సింహ లగ్నములు స్థిరములు అయినకారముగా ఆ లగ్నము నందు గృహప్రవేశము మంచిది. మిధున, కన్యా, ధనుర్మీన లగ్నములు గృహ ప్రవేశమునకు శుభప్రదమైనవే.

**<u>విశేషములు :</u>**

గృహప్రవేశమునకు 4,8,12 స్థానములు శుద్ధిగా ఉండుట విశేషము. 4 గృహస్థానము, 8 ఆయుఃస్థానము, 12 వ్యయస్థానము అయినకారనముగా ఈ స్థానములు శుద్ధిగా వుండవలెను, 3,6,11 ల యందు పాపగ్రహములు, 1,2,4,5,7,9,10,11 లలో శుభగ్రహములుండగా గృహప్రవేశము విశేషము.

**<u>ద్వారం ఎత్తుటకు :</u>**

పాడ్యమి, విదియ, తదియ, పంచమి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిథుల యందును, సోమ, బుధ, గురు, శుక్ర, వారముల యందును శుభగ్రహ హోరలయందును ద్వారం ఎత్తుటకు మంచిది. శ్లాబ్ విషయమై కూడా అంతే. వర్జ్య, దుర్ముహుర్త, రాహుకాలములు విడచి సూర్యోదయము మొదలు మధ్యాహ్నం లోపల శ్లాబ్ వేయుట ప్రారంభించాలి అలాగే ద్వారం ఎత్తాలి. దీనినికూడా ఆషాడ, భాద్రపద,పుష్యమాసములు పనికిరావు.

**<u>నామ నక్షత్ర వినియోగం:</u>**

సంగ్రామ, వ్యవహారములకు, ధామార్వణం, నగరార్వణం, మంత్రార్వణం విషయములలోను నామ నక్షత్రము చూడవలెను. ధామార్వణం విషయంలో కాలామృతం సంస్కృత వ్యాఖ్యానంలోక్షేత్రార్వణం అని వివరించిన కారణంగా గృహము ఏదిశలో కట్టుకోవాలి. ఆయాది వివరణల విషయంగా నామనక్షత్రం వాడి ముహూర్త విషయంలో జన్మ నక్షత్రం వాడవలెను.

**<u>బోరింగ్ లేదా బావి తీయుటకు ముహూర్తం :</u>**

హస్త, పుష్యమి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి, మఘ.... ఈ నక్షత్రాలు శ్రేష్ఠము. ఆది, మంగళ, శనివారములలో తీయుబావులయంధు నీరు ఎక్కువకాలం వుండదు. మీన, మకర, కర్కాటక, వృషభ, కుంభ లగ్నములందును, లగ్నానికి చతుర్థస్థానముకు పాపగ్రహ సంబంధం లేకుండాను చూచుకొని ముహూర్తం చేయవలెను. జలరాసులు

"మత్స్యే కుళిరే మకరే బహోదకం, కుంభేవృషే చార్ధజల ప్రమాణం, అళ్యంచ తౌల్యామ్ మిధునేన పాదం శేషేతు రాశఊ జలనాశంచ"

**శంఖుస్థాపన చేయుటకు :**

**మాసములు :**

చైత్రమున ధనహాని, వైశాఖం శుభం, జ్యేష్ఠం మరణం, ఆషాఢం పశునాశనం, శ్రావనం భృత్యవృద్ధి, భాద్రపదమాసం ప్రజాపీడ, ఆశ్వయుజం కలహప్రధం, కార్తీకం ధనలాభం, మార్గశిరం భయము, పుష్యం అగ్నిభయము, మాఘం అధిక సంపద, ఫాల్గుణం రత్నలాభం.

**నక్షత్రములు :**

అశ్విని,రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉషా, శ్రవనం ధనిష్ఠ, శతభిషం ఉత్తరాభద్ర,రేవతి.

**వారములు:**

ఆది, మంగల, శని వారములు నిషేధము. అయితే శని ఆదివారములు వాడుకలో ఉన్నవి.

**లగ్నబలం :**

వీలైనంతవరకు పాపగ్రహ సంభంధంలేని ఏ లగ్నమైనా, లగ్నము అష్టమముతో పాపగ్రహములు లేని లగ్నము, కుజగురువులు బలంగా వున్న గ్రహములు స్వీకరించాలి.

**స్థలం రిజిష్టర్ చేయించుకోవడానికి:**

చవితి, షష్ఠి, అష్టమి, ద్వాదశి, అమావాస్య తిధులు, భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, పూర్వాభాధ్ర నక్షత్రములు, మంగళవారం కాకుండాచూచుకొని, స్థలము రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. అయితే రిజిష్టర్ చేయించుకొనే సమయానికి వర్జ్యం, దుర్ముహూర్తం, రాహుకాలం వుండకూడదు. వీలైనంతవరకూ శుభగ్రహ హోరల సమయంలో రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి.

## ఏక వింశతి మహా దోషములు

*ఏకవింశతిమహాదోషములు - అపవాదములు*

1. పంచాంగ శుద్ధిహీన - ఏష్యము, దుష్టగ్రహవేధ,క్రాంతులు, వైప్రా, అనుదోషములు గల రోజులు కాని బుధ, గురులు బలముగా నున్నచో దోషములు లేదు.

2. సూర్య సంక్రాంతి - రవి ప్రవేశమునకు 19 ఘడియలు ముందు వెనుకలు, మేష, కర్కాటక,తులా, మకర, సంక్రమణములకు ఆయన ప్రవేశములకు 30 ఘడియలుముందు వెనుకలు దోషము.

3. పాపషడ్వర్గలు - లగ్న, హోర, ద్రేక్కాణ, నవాంశ,ద్వాదశాంశ, త్రింశాంశల యందు పాపగ్రహములు లేకుండుట.

4. భృగుషట్కం - ఉచ్ఛంగతుడైన శుక్రుడు 6వ యింట ఉండకూడదు. శత్రునీచ స్థానములో అస్తంగతుడైన దోషము లేదు అని కొందరందురు. కాని, ప్రమాణములు కానరావు.

5. అష్టమకుజ - 8వ యింట కుజుడు ఉచ్చస్థుడైను కాకున్నను దోషమే శత్రునీచ అస్తంగతుడైన దోషము లేదు.

6. గండాంతము - 10 ఘ||ల మధ్యమ 4-9 మధ్యమ 10-11 మధ్యమ 4ఘ||లు తిథి గండదోషము. ఆశ్రేష, మఘ, జ్యేష్ఠ, మూల, రేవతి,అశ్వినుల మధ్య 4 ఘ నక్షత్ర గండదోషము. నంద తిథులకు ప్రారంభమున 2 ఘుడియలు, పూర్ణ తిథులకు అంత్యమున 2 ఘుడియలు గండాంతములగును.

7. రాశిగండదోషము - కర్కాటక, సింహ, వృశ్చిక,ధనుస్సు, మేష, మీన రాశుల మధ్య 4ఘుడియలుచంద్ర గురులు శుభులైనచో ఈ దోషము బాధించదు.

8. కర్తరీ - లగ్నమునుండి 2వ యింట వక్రగ్రహము 12వ యింట ఋజుగ్రహము, సమభాగములనున్న దోషము. 1, 4, 5, 7, 9, 10, 11వ యింట బుధ, గురు,శుక్రులున్న దోషము లేదు. ఈ కర్తరులందు గృహనిర్మాణాది పనులు చేయరాదు. తదితర వివాహాది శుభముహూర్తములకు ఈ కర్తరీ దోషముతో సంబంధం లేదు.

9. రిఃఫషష్ఠాష్టమ, సగ్రహచంద్ర - చంద్రుడు 6,8,12వ యింట జన్మలగ్న నక్షత్ర లగ్నములకు 8వ లగ్నము, 8వ యింట చంద్రుడున్నను అష్టమాధిపతి లగ్నమందున్నను దోషము. ఆయా 8 స్థానములు శుభగ్రహ వీక్షణ పరస్పర మైత్రులు కలిగినచో దోషము లేదు.

11. అష్టమచంద్ర- అష్టమచంద్రుడైనచో, ఆ చంద్రుడు నీచ నవాంశగతుడైనచో దోషము లేదు.

12. వర్జ్య, దుర్ముహూర్తదోషములు - పంచాంగంలో వ్రాసిన వర్జ్య దుర్ముహూర్తకాలములు పనికిరావు.

13 కుళికా : ఆది 1,సోమ 2, మంగళ 12, బుధ 11, 3 శుక్ర, 7శని, 15 ఘుడియలుతరువాత 4 ఘ||కు కుళికాదోషము. లగ్నమునుండి చంద్రుడు 3, 4, 5, 7, 9, 10 స్థానములతో నున్న శుభప్రదము.

14. ఖర్జూరయోగము : 1. పంచశలాక, సప్తశలాక,ఖర్జూర చక్రములందు (అభిజిత్తుతో) వ్రాసిన నక్షత్రములు ఒక రేఖపై గలవి వేధించబడును. 2. క్రూర గ్రహమునకు ముందు వెనుక నున్నవి. వేధానక్షత్రములు క్రూరాక్రాంత గలవి.

15. ఏకార్గళ - దుష్టయోగములైన, 1.వ్యాఘా-పున,2. శూల-మృగ, 3. పరిఘ-మఘ, 4. వ్యతీ-ఆశ్రే, 5. నిష్కం-అశ్విని, 6. గండ-మూల, 7. అతిగండ-అనూరాధ, 8.వజ్ర-పుష్య, 9.వైధృ-చిత్ర మొ||గాగల నక్షత్రములు మొదటి రేఖపై నున్నచో ఏకార్గళ దోషము. సూర్య చంద్ర నక్షత్రములు 1-4, 4-1, 2-3 పా||కానిచో దోషము లేదు.

16. ఉత్పాత - భూకంపములు, తోకచుక్కలు,మొదలగునవి ఉత్పాత అనబడును. దాని నుండి 7 రోజుల వరకు దోషము.

17. గ్రహణ : గ్రహణములు సంభవించిన నక్షత్రములు ఆ పిదప 7 రోజుల వరకు దోషము. అర్ధగ్రాస గ్రహణమైన 3రోజులు మాత్రమే వదలవలెను. ఏ నక్షత్రమున గ్రహణము పట్టునో ఆ నక్షత్రము ఆరు మాసముల వరకు ముహూర్తములకు పనికి రాదు.

18.క్రూరగ్రహ వేధ - పాప గ్రహ, ప్రవేశ వర్జ్యరాశులు పనికి రానివి. ఆ రాశులు శుభగ్రహయుక్తమైనపుడు శుభప్రదము.

19. అశుభ విబద్ధ నక్షత్రములు - పంచాంగములోని రవే, రాక్రాం, రావే, కుక్రాం, కువే, శక్రాం, శవే మొదలైననక్షత్రములు దోషములు.

20. క్రూరగ్రహ నవాంశ - లగ్న, నవాంశాధిపతులు,నవాంశులను చూచుచుండినను, లగ్ననవాంశాధిపతులు పరస్పరదృష్టి,లగ్నగతులైనను, శుభ, మిత్ర, దృష్టి కలిగినను శుభప్రదము.

21. మహావ్యతీపాత వైధృతి- శోభ, హర్షణ, శూల,వైధృతి, వ్యతీపాత, గండ అనువాటి చివర భాగములలో సూర్య,చంద్ర కాంతి దోషము కలిగిన వ్యతీపాత దోషము.

మొత్తము మీద పర్యాలోచన చేయగా, లగ్న కేంద్ర, దోషములయందు గురు, శుక్ర బలములున్నచో శుభము. ముహూర్తములకు బలము నిర్ణయించునపుడు లగ్నబలము చూచుట ముఖ్యము.

నైసర్గిక పాపులైన రవి, కుజ, రాహు, కేతువులు 3,6,11 స్థానములందును,

శుభ గ్రహములైన గురు, శుక్ర, బుధ, చంద్రులు 1,2,4,5,7,9,10,11 స్థానములందుండుట ఉత్తమము. గ్రహములెంత బలముగానున్నను లగ్నబలము లేనిచో ప్రయోజనము లేదు.

గర్భాధాన, వివాహ, ఉపనయన, అన్నప్రాశనలకు తప్ప, మిగిలిన సమస్త శుభ కార్యములకు లగ్నమందు చంద్రుడికంటే ఇతరమైన శుభగ్రహము లెన్ని వున్న అంత లగ్నబలము,

వివాహేతర శుభకార్యములకు సప్తమమునుండి ముహూర్తలగ్నమును శుభులు చూచుట మంచిది. కోణములందుండి గురుడు, షష్ఠమము నుండి కుజుడు, ఏకాదశము నుండి శని చూచుట మంచిదే అగును.

గురువు కేంద్రస్థానమునందు, రవి ఏకాదశమునుండి అన్నచో సమస్తదోషములు పరిహారమవుతాయని శాస్త్రకారులు తెలిపారు. ముఖ్యముగా ఈ దోషములు లేకుండగా చూసుకొనవలెను.

## తారలు అధిపతులు శాంతులు

ఎవరైనా మంచి ముహూర్తము నిర్ణయించుకొన్నప్పుడు వ్యక్తియొక్క జన్మలేక నామ నక్షత్రము నుండి ఆనాటి వరకు లెక్కించగా ఈ క్రింది తారలు వచ్చును. ఇవి మూడు పర్యాయాలు వచ్చును.

1 జన్మ, 2 సంపత్, 3 విపత్,4 క్షేమ, 5 ప్రత్యక్, 6 సాధన, 7 నైధన, 8 మిత్ర, 9 పరమమిత్ర తారలు అనబడును.

1.జన్మతార: మంచిదికాదు. అధిపతి రవి. వాహనం-నెమలి. దోషకాలం-7.ఘుడియలు తోటకూరదానం శాంతి. తాపకారకుడు. మనస్తాపం కలిగించును. క్షోభతో దేహనాశము కల్గించును. వృత్తి, ఉద్యోగములకు కారకుడు, వృథా వ్యయము.

2. సంపత్తార: మంచిది. అధిపతి-బుధుడు. వాహనం-గుర్రం. దోషం లేదు. ధనలాభం, ఆనందం, సుఖం కలిగించును. ధనధాన్యలాభకరము, సర్వవిధ ద్రవ్యలాభము. ఏలోటు ఉండదు. హుందాతనం, సంపద, వృద్ధి, స్థిరత్వము.

3. విపత్తార: చెడ్డది. అధిపతి-రాహువు. వాహనం-మేక. దోషం-3ఘడియలు. బెల్లం దానం శాంతి. ఇది కలహములు, అపార్థములు కలిగించును. దారిద్ర్యబాధ, కార్యనాశనము కూడ. మనఃక్లేశము, విపత్తులు ఇచ్చును.

4. క్షేమతార: మంచిది-అధిపతి-గురుడు. వాహనం-ఏనుగు. దోషం లేదు. రాజప్రాప్తి. శాంతి, సుఖం, గౌరవం, ధైర్యప్రదాత. ఆరోగ్య క్షేమములు కలుగును.

5. ప్రత్యక్తార: చెడ్డది-అధిపతి-కేతువు వాహనం-కాకి. కార్య నాశనం-దోషం 8 ఘడియలు. ఉప్పు దానం శాంతి. మృత్యుకారకుడు, పట్టుదలలు, తాపము.

6. సాధనతార :మంచిది-అధిపతి-చంద్రుడు వాహనం-నక్క. దోషం లేదు. కీర్తికరుడు. సుఖశాంతులతో సంపత్సౌభాగ్యాలతో గౌరవప్రతిష్ఠలతో వర్ధిల్లచేయును. వ్యవహార జయం, లాభం, కార్యసిద్ధి కల్గించును.

7. నైధనతార: చెడ్డది-అధిపతి-శని-కార్యనాశకుడు. వాహనం-సింహం. ప్రమాదభయము, యుద్ధభయం, ప్రాణభీతి, దోష ఘడియలు 8. బంగారంతో కలపి నువ్వులు దానం శాంతి. సర్వదా చెడ్డది. ఆయుఃక్షీణము నిచ్చును.

8. మిత్రతార: మంచిది. అధిపతి-శుక్రుడు-సంతోషకారకుడు. వాహనం-గరుడుడు విశేషమైన సుఖ సౌఖ్యములు, దోషం లేదు. పుష్టిని యిచ్చును.

# Sri Sitarama Jyotishyalayam

# జ్యోతిష్య భాగము - 2

రచించిన వారు : బ్రహ్మశ్రీ శిష్ట్లా నాగేశ్వర శర్మ (ప్రకాష్) గారు, జంషెడ్ పూర్
మొబైల్ నెం. : +919470566998 / +917903591993
తయారు చేసినవారు : ఎ.వి.కె. శ్రీనివాసరావు, భిలాయి (ఛ.ఘ)